# శ్రీ సత్యసాయి శతకము



గ్రంథకర్త

కొమరగిరి కృష్ణమోహనరావు

శ్రీవాణి పబ్లికేషన్స్
24-52, రామానాయుడు పేట,
మచిలీపట్నం - 521 001.

# శ్రీ సత్యసాయి శతకము

ప్రథమ ముద్రణ 1997
ద్వితీయ ముద్రణ 1998

వెల : రు. 12-00

ముద్రణ
శ్రీవాణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
రామానాయుడు పేట,
మచిలీపట్నం - 521 001.
ఫోన్ : 21137

ప్రతులకు
శ్రీ సత్యసాయి బుక్స్ & పబ్లికేషన్స్ ట్రస్ట్
ప్రశాంతి నిలయం - 515 134
అనంతపూర్ జిల్లా

# ముందుమాట

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి అనుగ్రహంతో, వారి దివ్యాశీస్సులతో శ్రీ సత్యసాయి శతకము ప్రథమ భాగము నవంబరు '93, ద్వితీయ భాగము నవంబరు '96లలో శ్రీవాణి ప్రత్యేక సంచికలకు అనుబంధముగా భగవాన్ సాయి జన్మదినోత్సవాలను పురస్కరించుకొని శ్రీవాణి చందాదారులందరికి ఉచితంగా అందించబడినాయి.

ఈ నాలుగు భాగములలో భగవాన్ బాబా వారు తమ ప్రసంగములలో అప్పుడప్పుడు అందించిన 100 పద్యములకు సందర్భోచితమైన, సముచితమైన వ్యాఖ్య యివ్వబడింది. ముఖ్యంగా మానవత్వం, ప్రేమతత్త్వము, భక్తి, సేవ, నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక విషయముల మీద బాబావారు ఆశువుగా చెప్పిన పద్యములకు చక్కటి వివరణ, సరళమైన భాషలో యివ్వబడింది. ముఖ్యంగా బాలవికాస్ పిల్లలకు మరియు Study Classes లలో పాల్గొను కార్యకర్తలకు, బాలబాలికలకు నీతి తరగతులు నిర్వహించు ఉపాధ్యాయులకు మరియు ఆధ్యాత్మిక ప్రసంగములు చేయు పండితులకు వివిధ అంశముల మీద విపులీకరించి చెప్పడానికి ఈ 'శతకము' ఎంతగానో ఉపయోగపడుతుంది.

శ్రీవాణి పాఠకులకు గతంలో అందించిన నాల్గు భాగములు కలిపి ఒకే పుస్తకముగా తీసుకొని వస్తే బాగుంటుందని ఎందరో శ్రేయోభిలాషులు చాలాకాలంగా కోరుతున్నారు. వారు కోరిన విధంగా ఒకే పుస్తకంగా "శ్రీసత్యసాయి శతకము"ను భగవాన్ సాయి అనుగ్రహముతో ఈనాడు అందించగలుగుతున్నాను. సహృదయంతో స్వీకరించి, ఈ శతకములోని భావములను పదిమందికి అందించి భగవాన్ సాయి కృపకు, అనుగ్రహమునకు పాత్రులవుతారని ఆశిస్తున్నాను. ఆకాంక్షిస్తున్నాను.

ధన్యవాదములు.

సదాసాయిసేవలో...

మచిలీపట్నం - 521 001,
కృష్ణాజిల్లా
ఆంధ్రప్రదేశ్

కొమరగిరి కృష్ణమోహనరావు
ఎడిటర్ 'శ్రీవాణి'

# శ్రీ సత్యసాయి శతకము

## విషయసూచిక

## తప్పు ఒప్పుల పట్టిక

| పేజి నెం. | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 15 | 3వ లైను | శాంతిప జేయ | శాంతింపచేయ |
| 15 | 7వ లైను | వాత్సముఅతో | వాత్సల్యములతో |
| 40 | 3వ లైను | యినుముడించదు | యినుమడించదు |
| 45 | 1వ లైను | మూర్ఘజన | మూర్ధజన |
| 47 | 20వ లైను | లేనివాడు | లేనినాడు |
| 50 | 13వ లైను | గనత | ఘనత |
| 51 | 3వ లైను | స్రేమ | ప్రేమ |
| 51 | 21వ లైను | చేసిదిట | చేసేదిట |
| 57 | 15వ లైను | వహంతి | బహంతి |
| 59 | 6వ లైను | మాచెబితే | మాట చెబితే |
| 61 | 4వ లైను | చేసుకొననివాడు | చేసుకొనిననాడు |
| 61 | 5వ లైను | గులుగుతారు | గలుగుతారు |
| 65 | 10వ లైను | హృదయుడు | హృదయుడా |
| 77 | 13వ లైను | నదియు | నడయు |
| 77 | 14వ లైను | వీడు | తుప్ప |
| 78 | 21వ లైను | relistation | realisation |
| 87 | 8వ లైను | ధనమదికంబురాదు | ధనమదికంబురాదు |
| 96 | 4వ లైను | నాలుకలె | నాలుకవలె |
| 96 | 6వ లైను | సాధుజనులు | సాధుజనుల |
| 112 | 16వ లైను | గంగ | గంగి |
| 121 | 15వ లైను | సర్వవేత్తి | సర్వవిద్యావేత్త |
| 122 | 23వ లైను | ధైవభిక్తి | ధైవభక్తి |
| 128 | 2వ లైను | తయారుచుసి | తయారుచేసి |
| 128 | 2వ లైను | మునిగా | మునిగి |
| 130 | 8వ లైను | దుశ్వాసనుడు | దుశ్శాసనుడు |
| 152 | 10వ లైను | దేశయందున | దేశమందున |
| 152 | 13వ లైను | పనులల | పనుల |
| 153 | 18వ లైను | దేస్సనాతన | దేవస్సనాతన |

ఓం శ్రీ సాయిరాం



# శ్రీ సత్యసాయి శతకము

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు తమ దివ్య ప్రసంగ ప్రారంభంలో ఏదో ఒక నీతి పద్యముగాని, పాటగాని పాడి ప్రసంగాన్ని కొనసాగించటం పరిపాటి. ప్రసంగము మధ్యలో, ఆఖరిలో కూడా సందర్భోచితంగా పద్యాలు, పాటలు వినిపించి భక్తులను తన్మయులను చేస్తూంటారు. అవి చాలా అమూల్యమైనవి. భావగర్భితంగా ఉంటాయి. సామాన్యులకు సహితం అర్థమయ్యే రీతిలో ఉంటాయి. పండితులు సహితం నేర్చుకోవలసిన వేదాంత అంతరార్థములు ఎన్నో ఉంటాయి. భావం ఉన్నతం, భాష సరళం. వేమన, సుమతీ శతకముల పద్యాలలాగే ఉంటాయి. వాటి అంతరార్థములను అర్థం చేసుకుంటే తెలుసుకుంటాం వేదాంతం. బోధిస్తాయి మానవత్వం. పెంపొందిస్తాయి ప్రేమతత్త్వం. నేర్చుకుంటాం సనాతన ధర్మతత్త్వజ్ఞానం. అవగాహన చేసుకుంటే ఉంటుంది ప్రయోజనం. కలుగుతుంది వివేకం. అవుతుంది జ్ఞానోదయం. ఆచరణలో పెడితే లభిస్తుంది ఆనందం. నమ్మకం ఉంటే బాబా అనుగ్రహమునకు పాత్రులవుతారు. నమ్ముకున్నవారు పొందుతారు మోక్షం. ఇది ఒకరు చెబితే తెలిసేది కాదు. గమ్యానికి

చేరుకోదలచిన వారికి మార్గమును మాత్రం చూపిస్తాయి. అంధకార బంధురంలో పయనిస్తున్న మానవాళికి వెలుగును ప్రసాదిస్తాయి. వారి వారి ఓపికను బట్టి ఫలితాలు ఉంటాయి. శ్రద్ధను బట్టి లభిస్తుంది భగవాన్ బాబా అనుగ్రహం.

# మనసు

**మనసులోనున్న భావంబు మంచిదైన**
**కలిగి తీరును ఫలసిద్ధి కార్యమందు**
**మనసులో నున్న భావంబు మలినమైన**
**ఫలము గూడ నా రీతిగ మలినమగును 1**

అన్నారుబాబా. 'యద్భావం తద్భవతి' మన భావాలు మంచివైతే మన మనస్సులో సద్భావనలు ఉంటే మనం చేబట్టిన కార్యం ఆశించినట్లుగా ఫలిస్తుంది. ఒకవేళ మన భావాలు చెడ్డవైతే, దుర్భావనలు అయితే దుష్ఫలితాలనే అందిస్తాయి. సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్తి అని అంటారు బాబా. మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః అన్నారు గదా ! బంధమునకు మోక్షమునకు మన మనస్సే కారణం. మంచి చెడ్డలకు, సుఖదుఃఖాలకు మూలం మన మనస్సే. కనుక మన మనస్సును నిర్మలంగా , పవిత్రంగా ఉంచుకుంటే మంచి ఆలోచనలు, సద్భావనలు, సచ్చింతనలు సదాలోచనలు మన మనస్సులో ప్రవేశిస్తాయి. మన చేతలకు, మన మాటలకు, మన ఆలోచనలే మూలం. కనుక మనస్సులో దురాలోచనలకు ప్రవేశం ఇవ్వకుండా దూరాలోచనలు చేయాలి. మన ఆలోచనలు పవిత్రంగా , స్వార్థరహితంగా, పదిమందికి ప్రయోజనకరంగా విశ్వశ్రేయస్సును కాంక్షించేవిగా ఉంటే మన మాటలూ, మన చేతలూ వాటినే అనుసరిస్తాయి. భగవాన్ బాబా ఒక పర్యాయం "త్రికరణ శుద్ధి"కి చక్కటి

నిర్వచనం చెబుతూ "మనసులోని యోచన; మాటలోని సూచన, క్రియలోని ఆచరణ - ఈ మూడూ ఏకం కావాలి" అన్నారు. కనుక మాట్లాడే ప్రతిమాట ఆచి తూచి మాట్లాడటం నేర్చుకోవాలి. కాలుజారితే తీసుకోవచ్చును గాని నోరు జారితే తీసుకోలేము గదా! "మాటకు ఖర్చు లేదుగాని విలువ ఎక్కువ" అంటారు బాబా. కాని ఈనాడు మనిషి బుద్ధి మారడం వలన నోటుకు కూడా విలువ లేకుండా పోయి కోర్టుల చుట్టూ తిరుగుతున్నారు. ఈనాడు "మనిషి మారాలి" అని నినాదం యిస్తున్నారు. మనిషి మారుతునే ఉన్నాడు. పసిపిల్లవాడు బాలుడవుతున్నాడు. బాలుడు యువకుడవుతున్నాడు. యువకుడు పెద్దవాడవుతున్నాడు. పెద్దవాడు వార్ధక్యమును చవిచూస్తున్నాడు. తరువాత కాలగర్భంలో కలిసిపోతున్నాడు. మనిషియొక్క శరీరము (Physical Body) మారుతునే ఉన్నది. అది కాదు మారవలసినది. మనిషి మనస్సు మారాలి. అప్పుడే సమాజంలో శాంతి సౌభాగ్యాలు విలసిల్లుతాయి.

**మాటలందు తీపి మనసులోన చేదుండ**
**మంచి కాదు మీకు మచ్చగాని**
**మచ్చలేని బ్రతుకె మహిలోన చెల్లురా**
**ఉన్నమాట తెలుపుచున్న మాట** 2

అన్నారు బాబా. చాలా మంది పైకి మంచిగా, తీయని కబుర్లు చెబుతూ ఆప్యాయతను చూపుతుంటారు. మనసులో మాత్రం కాలకూట విషం పెట్టుకుంటారు. ఎవరైనా కనిపిస్తే మీ అంతటివారు లేరని పైకి పొగుడుతారు. లోపల తిట్టుకుంటారు. 'నోరు మాట్లాడుతుంటే నొసలు వెక్కిరిస్తుంటాయి' అన్న సామెత అట్టి వారి విషయంలో యదార్థం. అట్టి వారు "ద్విపాత్రాభినయం" చేయగల సమర్థులు అయితే ఏదో ఒకరోజున

వారి అసలు రంగు బట్టబయలు కాక తప్పదు. కనుక ఈ దుర్మార్గపు ప్రవృత్తిని ప్రతి ఒక్కరూ విడనాడాలి. విడనాడనివారి గతి అధోగతే. ఒక పర్యాయం బాబా "హృదయము లేని మాటలు కంటే, మాటలు లేని హృదయమే మేలు" అని అన్నారు. మనం మాట్లాడే ప్రతి మాట హృదయ పూర్వకంగా మాట్లాడాలి. చాలామంది 'హృదయం' అంటే 'గుండె' (Heart) అనుకుంటారు. అదికాదు, అది భౌతికమైన గుండె. (Physical Heart) హృ....దయ - దయతో కూడినది హృదయం. అది ప్రేమకు స్థానం. ఆ హృదయం విశాలం కావాలి. అది ప్రేమమయం కావాలి. ఆ ప్రేమను పదిమందికి పంచాలి. ఎడమవైపున ఉండే గుండె (Heart) విశాలమైతే Heart enlarge అయిందని హాస్పిటల్‌లో చేరుస్తారు. అది కాదు విశాలం కావల్సింది. కుడివైపున ఉండే హృదయం విశాలం కావాలంటారు బాబా. "హృదయం లేని ప్రార్థన కంటే మాటలు లేని హృదయమే మేలు" అన్నారు బాబా. హృదయం మాట్లాడదు. కాని ప్రేమను వర్షింపజేస్తుంది. కరుణను కురిపిస్తుంది. దయామయునిగా మారుస్తుంది. అందువలననే 'దయగల హృదయమే దైవమందిరం' అన్నారు బాబా. హృదయాన్ని నమ్మి జీవించువారు సింహజీవులు. కండబలమును నమ్మి జీవించువారు గొఱ్ఱె జీవులు. గొఱ్ఱెలు నిరంతరమూ భయంతోనే జీవితాలను గడుపు తుంటాయి. సింహానికి అట్టి భయం ఉండదు. కనుక ప్రతి ఒక్కరూ హృదయాన్ని నమ్ముకొని జీవించాలి. హృదయపూర్వకంగా మాట్లాడాలి. మన మాటలు హృదయం నుండి రావాలి కాని పెదవుల పైనుండి కాదు. హృదయం కదలకుండా ఎన్నిసాధనలు చేసినా, ఎన్ని పలుకులు పలికినా, ఎన్ని ఉపన్యాసాలిచ్చినా - అవన్నీ అడివిగాచిన వెన్నెల వలె నిరుపయోగమై పోతాయి. సాధనతో హృదయం కరిగిపోవాలి. కరిగిన హృదయం కదిలిపోవాలి. హృదయ వేదనను పెంచాలి, పదిమందికి పంచాలి. అట్లా కాకుండా మాటలలో తీపి, మనసులో చేదుంటే ప్రయోజనం లేకపోగా ప్రమాదం కూడా సంభవిస్తుంది. అది జీవితం మీద చెరగని మచ్చగా

మిగిలిపోతుంది. అందుకనే "మచ్చలేని బ్రతుకె మహిలోన చెల్లురా!" అన్నారు బాబా. ఇదే వాస్తవమును వేమన కూడా చక్కగా చెప్పాడు.

మాటలాడు టొకటి మనసులో నొక్కటి
ఒడలి గుణము వేరె యోజ వేరె
ఎట్లు గల్గు ముక్తి యీలాగు తానుండ
విశ్వదాభిరామ వినురవేమ.

మనసులో ఒకటి పెట్టుకుని, మాట మరొక విధంగా మాట్లాడటం శరీరగుణం మరియొకటి అనగా శరీరంతో చేసే పని మరొక విధంగా ఉండటం, తద్విరుద్ధంగా ఆలోచన చేయటం - ఈ విధంగా నాటకం ఆడేవానికి ముక్తి ఎలా లభిస్తుంది? లభించడం దుర్లభం. కనుక మచ్చ లేని మనిషి (Spotless Character) మాత్రమే జీవన సంగ్రామరంగంలో విజయాలను సాధించగలుగుతాడు.

**మనసు మాట నడత మనిషికి ఒకటైన**
**మనిషి వాడు కాదు మహితుడౌను**
**మనసు మాట నడత మరి వేరు వేరైన**
**మనిషి కాడు వాడు మృగమె కాని. 3**

అన్నారు బాబా. మనసులో మంచి ఆలోచన, మాటలోని మంచి, మంచి నడత - ఈ మూడూ ఒకటిగా ఉన్నవాడే మానవత్వం గల మనిషిగా చలామణి అవుతాడు. ఈ మూడూ వేరు వేరైతే అతనికి సమాజంలో ఏమాత్రం విలువ ఉండదు. అతని మాటను ఎవరూ లెక్కచేయరు. అయితే ఈనాడు చాలామంది మనసులో ఒకటి పెట్టుకుని, మాట మరొకటి మాట్లాడుతారు. తీరా పని చేసేటప్పుడు తద్విరుద్ధంగా ప్రవర్తిస్తారు. ఒక దానికి మరొకటి ఏమాత్రం పోలిక ఉండదు. ఇటువంటివారిని "పయోముఖ విషకుంభాలు" వంటివారు అని

అనవచ్చును. వీరు సమాజం పాలిటి చీడపురుగులు. వీరు మృగముల వంటివారు. అంతకన్నా హీనమైనవారని చెప్పినా ఫరవాలేదు. ఒక్కొక్కప్పుడు మృగాలలోనయినా, జాలి, ప్రేమ, కరుణలాంటి ఉత్తమ సద్గుణాలు కనిపిస్తాయేమోగాని, ఈ మృగ లక్షణాలు ఉన్న మానవునిలో మాత్రం ఆ సద్గుణాలు ఏమాత్రం కనిపించవు. మానవుడు మాధవుడిగా ఎదగటానికి బదులు పశువుగా దిగజారి పోతున్నాడు. నరుడు నారాయణుడుగా మార్పుచెందటానికి బదులు మృగముగా తయారవుతున్నాడు. జీవుడు శివుడుగా మారటానికి బదులు రాక్షసుడుగా మారుతున్నాడు. మమత సమతలు మాసిపోతున్నాయి. ప్రేమ కరుణలు మరుగున పడిపోతున్నాయి. మానవత్వం మంట కలిసిపోతున్నది. దీనికి కారణం? మనిషిలో స్వార్ధ సంకుచిత భావాలు పెచ్చు పెరగడమే. ఏదో విధంగా ఎదుటి వానిని మోసం చేయాలనే తలంపు. అక్రమ అనాచార, అవినీతి మార్గముల ననుసరించి ధనసంపాదన చేయాలనే ఆలోచన. ఏ మాత్రం కష్టపడకుండా ఉన్నత స్థితికి ఎదగాలనే భావనలు మానవునిలో ఉత్పన్నం కావటం వలన మనసులో ఒకటి తలుస్తున్నాడు, మాటలో మరొకటి చెబుతున్నాడు, క్రియలో వేరొకటి చేస్తున్నాడు. ఒక వేళ ఈ విధంగా 'త్రిపాత్రాభినయం' చేసేటటువంటి కపటవేషధారులకు లాభిస్తే లాభించవచ్చును గాని - అది కేవలం తాత్కాలికమే. ఈ వాస్తవాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాలి. ఇలాంటి కపట వేషధారుల ప్రవర్తనను మానవ మాత్రులు తాత్కాలికంగా గుర్తించలేకపోయినప్పటికీ, సర్వాంతర్యామి అయిన లోకరక్షకునికి అన్నీ తెలుస్తూనే ఉంటాయి. దీనిని తెలుసుకోలేక నేనే గొప్పవాడనని ఈ కపట వేషధారి విర్రవీగుతుంటాడు. కనుక తాత్కాలిక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొనకుండా, శాశ్వతమైన, అత్యున్నతమైన స్థాయికి ఎదగటానికి ప్రయత్నించాలి. అప్పుడే ఈ మానవజన్మ సార్ధకమవుతుంది.

**మ్రానుఁ దిద్దగలరు మరి వంపు లేకుండ**
**దిద్దవచ్చు రాయి తిన్నగాను**
**మనసు దిద్దలేరు మరియెవ్వరైనను**
**ఉన్నమాట తెలుపుచున్నమాట. 4**

భగవాన్ బాబావారు ఈ పద్యంలో కొన్ని అనుభవపూర్వకమైన వాస్తవాలు వెల్లడించారు. వంకర టింకరగానున్న మహావృక్షము యొక్క వంపులను కూడా చక్కగా సరిదిద్ది (చెక్కి) ఒకే దూలముగా వంకర లేకుండా వడ్రంగి రూపొందించగలడు. అదేవిధంగా శిల్పి పెద్ద బండరాయిని సహితం తనకు కావలసిన రీతిలో చెక్కి సరిదిద్ది వంకరలేని ఒకే రాతి దూలమును తయారుచేయగలడు. వడ్రంగి వంకర టింకరగా నున్న కొయ్యను కళాత్మకంగా, సుందరంగా, అందంగా బొమ్మలను విగ్రహాలను తయారు చేయగలిగితే, శిల్పి కూడా అడ్డదిడ్డంగా నున్న బండరాయితో తన చాకచక్యంతో చక్కటి సుందరమైన విగ్రహాలను తయారు చేయగలడు. వాటిల్లో జీవం ఉట్టిపడుతూ ఉంటుంది.

మ్రానును, రాయిని సరిదిద్దవచ్చునుగాని మనసును మాత్రం ఎవరూ దిద్దలేరు. బహుకష్టము కూడాను. మనసు చాలా విచిత్రమైనది. మనిషి ఇక్కడ ఉంటే మనస్సు కొన్ని వేల మైళ్లు వెళ్ళి అక్కడి దృశ్యాలను అనుభవిస్తుంటుంది. మనస్సు చాలా చంచలమైనది. ఒకచోట నిలకడగా ఉండదు. దానిని పట్టి ఉంచటం చాలా కష్టం. తొందరపడి మనస్సును బలాత్కారం చేసి పట్టి ఉంచడానికి ప్రయత్నిస్తే ప్రమాదం. మనస్సును "శనైః శనైః" మెల్లమెల్లగా "లాలయేత్ చిత్తబాలకమ్" బాలుని లాలించినట్లు మనస్సును కూడా లాలించి బుజ్జగించి నెమ్మదిగా దానిని బాహ్య ప్రపంచము నుండి మరలించి అంతర్ముఖం చేయవలెను. ఇది చాలా కష్టమైన పని. నూటికి ఒకరు కూడా మనస్సును సరిదిద్ది అదుపులో పెట్టుకోలేరు. అందువలననే "మనసు దిద్దలేరు మరియెవ్వరైనను" అన్నారు.

బాబా. ఇదే వాస్తవమును వేమన కూడా అనుభవంలో చెప్పాడు.

"మాట దిద్దవచ్చు మరి యెగ్గు లేకుండ
దిద్దవచ్చు రాయి తిన్నగాను
మనసు దిద్దరాదు మహినెంతవారికి
విశ్వదాభిరామ వినురవేమ"

**ఇనుము విరిగినంత యిమ్మారు ముమ్మారు**
**కాల్చి యతుకవచ్చు కమ్మరీడు**
**మనసు విరిగినంత మరి చేర్చగలరయా**
**ఉన్నమాట తెలుపుచున్నమాట** **5**

అన్నారు బాబా. ఇనుపకడ్డీ ఎన్నిసార్లు ఎన్నిచోట్ల విరిగినా కాల్చి కమ్మరి అతికిస్తాడు. కాని మనస్సు విరిగితే మాత్రం దానిని ఎవరూ అతికించలేరు. ఈ సందర్భమును గురించి విదురుడు మహాభారతంలో చక్కగా వర్ణించాడు. "గొడ్డలి దెబ్బతిన్న అరణ్యం చిగురించవచ్చు కాని కటు వచనాలతో దెబ్బతిన్న హృదయము కోలుకోదు. శరీరములో నాటిన తీవ్ర శరములను పెరికి పారవేయవచ్చును కాని పరుష భాషణలు మాత్రం గుండెలో నుండి పైకి తీయలేము" అని ఎంతో అనుభవంతో విదురుడు చెప్పాడు. గొడ్డలితో నరికిన చెట్టు కూడా కొంతకాలానికి చిగురుస్తుంది. కఠినమైన మాటలతో దెబ్బతిన్న హృదయం మాత్రం కోలుకొనదు. శరీరంలో ఇరుక్కుపోయిన బాణమునుగాని, కత్తినిగాని, తుపాకి గుండును గాని శస్త్ర చికిత్స చేసి బయటకు తీయవచ్చును. ఆ గాయం కూడా కొంత కాలానికి మానిపోతుంది. కాని పరుష వచనాలను మాత్రం మనసులో నుండి తీసివేయలేము. కనుక మనం మాట్లాడే ప్రతి మాట ఆచి తూచి మాట్లాడటం నేర్చుకోవాలి. మన మాటలు పరుల మనస్సులను నొప్పించరాదు. కటువుగా, పెడసరంగా, పరుషంగా, అప్రియంగా

మాట్లాడరాదు. మన మాట మృదువుగా, ప్రియంగా, హితవుగా ఉండాలి. ఇదే వాస్తవమును వేమన కూడా చెప్పాడు.

"ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతుకవచ్చు క్రమముగాను
మనసు విరిగెనేని మరి చేర్చరాదయా
విశ్వదాభిరామ వినురవేమ."

మనస్సు చాలా సున్నితమైనది. అది ఒక పర్యాయం దెబ్బతింటే దానిని ఎవరూ బాగుచేయలేరు. ఏ వైద్యుని వలనా సాధ్యం కాదు. కనుక ప్రతి ఒక్కరూ ఎవరి మనస్సునూ నొప్పించకుండా మాట్లాడటం నేర్చుకోవాలి.

## బుద్ధి

**మనసు నాధారముగ గొను మానవుండు**
**పశువు కంటెను హీనమై పతనమగును**
**బుద్ధి నాధారముగ గొను బుధజనుండు**
**పశుపతిగ మారునని పల్కె పర్తిసాయి.** 6

అన్నారు బాబా. మనస్సు చాలా చంచలమైనది. ఇంద్రియములు, విషయ సుఖాలను కోరుతుంటాయి. ఇంద్రియ సుఖములే నిజమైన సుఖములని భావించి భ్రమించి మనస్సు కూడా ఇంద్రియముల వెంట పడుతుంది. చిట్టచివరకు విషయసుఖమనేది ఏదో ఒక సమయంలో, దుఃఖంగా అంతమొందటంచేత, మనస్సుకు కూడా దుఃఖం తప్పదు. ఒక పర్యాయం భగవాన్ బాబావారు మనస్సు యొక్క తత్వాన్ని చక్కగా విశదీకరించారు. మనస్సును భర్తతో పోల్చి, పది ఇంద్రియాలు (ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు) మనస్సుకు పదిమంది భార్యలని చెప్పారు.

భార్యలు సహజంగా భర్తనుండి సుఖాన్నే కోరుతారు గదా! భార్యాభర్తలు ఆనంద సుఖ ఉల్లాసాలలో మునిగి తేలుతూ తమ బాధ్యతలను విస్మరించడం సహజం. ఆ సమయంలో విచక్షణా జ్ఞానాన్ని కూడా కోల్పోతారు. అప్పుడు మనస్సును ఆధారముగా చేసుకొనిన మానవుడు పతనమవుతాడు. పశువుకంటే హీనంగా ప్రవర్తిస్తాడు. మరల బాబాగారు బుద్ధిని అత్తగారితో పోలుస్తూ చక్కటి ఉదాహరణ చెప్పారు. అత్తగారు పొలం పనికి వెళ్లాలి. పొరుగూరు నుండి ప్రొద్దున్నే అల్లుడు వచ్చాడు. భోజనాదులు పెట్టి సకల మర్యాదలు చేసింది అత్త. అల్లుడు ఇల్లు వదలి వెళ్లటం లేదు. నోటితో వెళ్లమని చెప్పటం అత్తకు మర్యాద కాదుకదా! పొలం పనికి వెళ్ళుతున్నానని చెప్పి అత్త ఇల్లు విడిచి వెళ్లిపోతుంది. పరిస్థితి అనుకూలంగా లేదని గ్రహించి, వచ్చిన త్రోవనే వెళ్ళిపోతాడు అల్లుడు. అల్లుడు వెళ్ళాక అత్త ఇంటిలో ప్రవేశిస్తుంది. అనగా బుద్ధి పరమాత్మ సాధనలో నిమగ్నమవుతుంది. మనస్సులాగే బుద్ధి ఊగిసలాడేది కాదు. దానికి నిశ్చలమైన, నిర్మలమైన, స్థిరమైన అభిప్రాయాలున్నాయి. అంతే కాదు దానికి (Discrimination Power) విచక్షణా జ్ఞానం ఉన్నది. వివేక జ్ఞానమున్నది. ఎప్పుడు ఏ పని చేయాలో దానికి బాగా తెలుసు. మనస్సు కంటే వేరైనది, ఉత్తమమైనది బుద్ధి. సహజంగా ఎవరైనా తప్పు చేస్తే *"నీకు బుద్ధి లేదురా!"* అంటారు. అంటే వివేక విచక్షణా శక్తి ఉండదు. కనుక మనస్సు, ఇంద్రియములను అనుసరిస్తే 'పశువు' అవుతాడు. శరీరము, మనస్సు రెండూ ఏకం కావటం చేతనే మానవుడు 'రాక్షసుడు' గా మారిపోతున్నాడు. కనుక మనస్సు బుద్ధిని అనుసరించడం శ్రేయస్కరం. అప్పుడు మానవుడు పశువుగా దిగజారక పశుపతిగా ఎదుగుతాడు. ఆ స్థితికి చేరుకుంటేనే ఈ మానవజన్మకు సార్థకం. *"మనస్సు ఇంద్రియాలను అనుసరిస్తే బంధం. బుద్ధిని అనుసరిస్తే ఆత్మ సంబంధం"* అన్నారు బాబా. కనుక బుద్ధిని అనుసరించి భవబంధాలను బాపుకుందాం.

# మానవత్వము

మానవులకంటే మృగములే మంచివేమో
ఎంత విజ్ఞానముండియు నేమి ఫలము?
మానవత్వము కోల్పోయి మనిషి నిలిచె
ఇంతకన్నను వేరెద్ది ఎఱుకపరతు? 7

అన్నారు బాబా. మరొక పర్యాయం భగవాన్ బాబా తమ ప్రసంగంలో 'మానవుడు పుట్టి కొన్ని లక్షల సంవత్సరాలైనా మానవత్వం మాత్రం ఇంకా పురిటి నొప్పులు పడుతూనే ఉన్నది. ఏనాడు మనలో మానవత్వం పుడుతుందో, ఆనాడే మనం మానవులమవుతాం. ఆ మానవత్వమే దైవత్వం. అదే సత్య స్వరూపం, అదే ధర్మ స్వరూపం, అదే ప్రేమ స్వరూపం, అదే శాంతి స్వరూపం. అట్టి మానవత్వాన్ని ప్రతి ఒక్కరూ పొందితే చాలు' అని అంటారు. మరుగున పడిన మానవత్వాన్ని బయటకు లాగి, మానవత్వం గల మనుష్యులుగా తీర్చిదిద్దటానికి బాబా కంకణం కట్టుకున్నారు. ఈనాడు మానవుడు ఎంతో విజ్ఞానాన్ని సంపాదిస్తున్నాడు. చంద్రమండలానికి చేరుకున్నాడు. నక్షత్రాలను పరిశోధిస్తున్నాడు. సముద్ర గర్భంలో స్వేచ్ఛగా విహరించి అమూల్యమైన విషయాలను కనుగొంటున్నాడు. ఆకాశమార్గంలో విహరిస్తున్నాడు. ఒక్క క్షణకాలంలో భూమండలాన్ని విధ్వంసం చేయటానికి అవసరమైన అణుబాంబులను తయారుచేస్తున్నాడు 'రిమోట్ కంట్రోలర్' ద్వారా ఎక్కడో ఉండి ఎక్కడనో ఉన్న వారిని చంపుతున్నాడు. మానవుని విజ్ఞానం నేడు మానవ సంహారం కోసం ఉపయోగపడుతున్నది గాని, మానవాభ్యుదయానికి ఉపయోగ పడటం లేదు. మానవుడు విజ్ఞానవంతుడై, మానవత్వమును మాత్రం కోల్పోతున్నాడు. పశుత్వ భావాలను విడనాడి పశుపతిగా ఎదగటానికి బదులు పశువుకన్నా హీనంగా ప్రవర్తిస్తున్నాడు. అందువలననే ఒక్కొక్క

సమయంలో "మానవులకంటే మృగములే మేలేమో!" అన్నారు బాబా. బాబా మాట సత్యమైన మాట. పశుపక్ష్యాదులకు మాటలు రావు గాని మాటలు వచ్చిన మానవుడు మాత్రం చెబుతున్నాడేగాని ఆచరణలో ఏ మాత్రం పెట్టటం లేదు. మానవత్వం మీద ప్రసంగాలు దంచుతున్నాడే గాని ఆచరణలో మానవత్వం ఏమాత్రం కనిపించడం లేదు. పశువుకు, మానవునకు ఒకే ఒక తేడా కనిపిస్తున్నది. పశువుకు మాటలు రావు. మానవులకు మాత్రం మాటలు వచ్చు. మాటలు వచ్చిన 'ద్విపాద పశువు' మానవుడు. ఆకలైనప్పుడు పశు పక్ష్యాదులు ఎంత దూరమైనా వెళ్ళి ఆహారం తినేసి వస్తాయి. వాటికి దాచుకోవటం తెలియదు. "దోచుకొని దాచుకునే వాడు ఒక్క మానవుడే" అంటారు బాబా. ఇది నూటికి నూరు పాళ్లు సత్యం. "పశుపక్ష్యాదులకు ఒక *Season (ఋతువు)* ఒక *Reason (కారణం)* ఉంది. కాని మానవునికి *No Season, NoReason*" అంటారు బాబా. ఆ మాటల వెనుక ఉన్న బాబా ఆవేదనను అర్థం చేసుకుంటే సమాజానికి ఎంతో మేలు చేసిన వారమవుతాం.

నైలు నదిలో ఎన్నో మొసళ్లు ఉంటాయి, అవన్నీ ఒడ్డున చేరి నోళ్లు తెరుచుకొని ఉంటాయి. వాటి పళ్ల మధ్య మాంసపు ముక్కలు యిరుక్కుని వాటిని బాధిస్తుంటాయి. చిన్న చిన్న ప్లోవర్ పక్షులు వచ్చి ఆ మొసళ్ల నోటిలో దూరి, వాటి పళ్ల మధ్యనున్న మాంసపు ముక్కలను తమ ముక్కులతో పొడిచి తినివేస్తుంటాయి. ఆ మొసళ్ళు ఆ చిన్ని పక్షులను తీసుకొని వచ్చి కలిసి ఆ మాంసపు ముక్కలను తింటుంటాయి. దీనిని బట్టి చూస్తే పశుపక్ష్యాదుల మధ్య పరస్పర సహకారం కనిపిస్తుంటుంది. కాని, నేడు మనుష్యుల మధ్య మాత్రం కనిపించటం లేదు, సహకారం లేకపోగా సహనం కోల్పోతున్నారు. ఒక మనిషి బాగుపడుతుంటే ఓర్వలేని వారెందరో! ఒక వ్యక్తి పైకి వస్తుంటే అసూయ చెందేవారు మరెందరో. అదే విధముగా ఒక సంస్థ మంచి పనులు చేస్తూ ప్రశంసలనందుకుంటుంటే

అసూయ చెందే సంస్థలు ఎన్నో! అంతేకాదు ఒకే సంస్థలో పనిచేసే వారి మధ్యనే అసూయా ద్వేషాలు విలయతాండవం చేస్తున్నాయి. ఈ జాడ్యం చిట్టచివరికి పవిత్రమైన ఆధ్యాత్మిక సంస్థలలో కూడా ప్రవేశించడం కడు శోచనీయం. మానవత్వం కోల్పోయిన తరువాత ఎంత విజ్ఞానం సంపాదించినప్పటికీ ఏమి ప్రయోజనం? ఈనాడు మానవత్వం లుప్తమైన మనిషి (Physical Body) గా మాత్రమే కనిపిస్తున్నాడు. బాబాగారు అన్నట్లుగా "మానవులకంటే మృగములే మేలేమో!" అనిపిస్తుంది.

**సేవ చేయునట్టి సేద్యపు పశువును**
**చేరి చితకగొట్టు చిత్రముగను**
**రాతి ఎద్దును చూచి**
**తానె భక్తితో పూజించు. 8**

"జీవుళ్ళను బాధిస్తారు. దేవుళ్ళను పూజిస్తారు. ఒక చంప జీవం ఉన్న ఎద్దును బాధిస్తూ, దేవాలయానికి వెళ్ళి జీవం లేని రాతి నందిని పూజిస్తారు. జీవం ఉన్న కోతి కనపడితే చాలు రాయితో కొడతారు. ఆంజనేయస్వామి పేర కోతిబొమ్మల (రాయి) కు కొబ్బరికాయలు కొడతారు." అని భగవాన్ బాబావారు ఒక పర్యాయం తమ ఆవేదనను వెలిబుచ్చారు.

రైతులు చెప్పినట్లుగా ఎద్దులు వింటాయి. బరువులు మోస్తాయి. బండిలాగుతాయి. పొలం దున్నుతాయి. ఆ విధంగా సేవ చేస్తున్న ఎద్దుల మీద మోయలేని భారం వేసి, బండి లాగలేక అవి పడుకుంటే, రైతులు ఆగ్రహంతో వాటిని చావచితక కొడుతారు. ఆ దెబ్బలకు తట్టుకోలేక, సర్వశక్తిని కూడగట్టుకొని ఆ బండిని లాగుతాయి. ఇంటికి చేరిన తరువాత ఆ రైతు స్నానం చేసి, శివాలయానికి వెళ్ళి రాతి ఎద్దు (నందిని) ను పూజిస్తాడు. జీవంలేని రాతి ఎద్దులను పూజించడం, జీవం

ఉన్న ఎద్దులను హింసించడం పరిపాటి. మానవత్వం, ప్రేమతత్వం లేని భక్తి అది నిజమైన భక్తి కాదంటారు బాబా.

"సర్వజీవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవిని నమస్కరించినా అది భగవంతునికే వర్తిస్తుందని 'గీత' మనకు బోధిస్తున్నది. "సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించినను బాధించినను అది భగవంతుని బాధించినట్లే అవుతుంది గదా! కనుక సమస్త భూతముల యెడల, సమస్త జీవుల యెడల ప్రీతితో ప్రవర్తించాలి. సమస్త జీవులను సమదృష్టితో చూడాలి. జీవుళ్ళను బాధించి, దేవుళ్ళను పూజిస్తే దైవం మెచ్చుకోడు. అట్టివారు దైవానుగ్రహమును పొందలేరు.

మానవతా విలువలను మానవాళిలో పెంపొందింప జేయటమే భగవాన్ బాబావారి లక్ష్యము. బాబా మహోన్నతమైన మానవతావాది. ఒక పర్యాయం బాబా వారు తమ ప్రసంగంలో *"Love all, Serve all; Help Ever, Hurt Never"* (అందరిని ప్రేమించు, అందరిని సేవించు; ఎల్లప్పుడూ సహాయం చేయి, ఎవరినీ బాధించకు) అనే అభ్యుదయ నినాదాన్ని యిచ్చారు. ఇంతకు మించిన మానవతావాదం, ఇంతకు మించిన సామ్యవాదం వేరొకటి లేదు. భగవాన్ బాబావారు 'పరిపూర్ణ మానవతావాది'.

## మత్సరము

**కోపవంతుని కూడ కూర్మితో కొనవచ్చు**
**పాము ప్రక్కనైన పండవచ్చు**
**మత్సరంబుగల మనిషితో కూడిన**
**మానవత్వము నాడు మంట యగును. 9**

అన్నారు బాబా. కోపానికి పరాకాష్ట అయిన దుర్వాస మహామునిని కూడా మృదుమధురమైన మాటలతో వశం చేసుకోవచ్చును. ఏదో విధంగా

కోపిష్టిని కూడా జయించవచ్చును. చాకచక్యమైన మాటలతో ఆగ్రహించే వాడిని కూడా అనుగ్రహింపచేసుకొనవచ్చును. మన ప్రవర్తన ద్వారా కోపవంతుని కూడా శాంతిపజేయవచ్చును. మన ప్రేమ పలుకులతో కఠిన శిలలనైనా, పాషాణ హృదయాలనైనా కరిగించవచ్చును. చిట్టచివరికి విషజంతువైన పాము ప్రక్కన కూడా పండ (పరుండ) వచ్చును (వత్తిడి కలుగకపోతే పాము కూడా కరవదు). అసాధ్యమైన దానిని కూడా ప్రేమ వాత్స్యములతో సాధ్యం చేసుకోవచ్చును గాని "మత్సరంబు గల మనిషితో కూడిన మానవత్వము నాడు మంటయగును" ఇది యదార్థం, వాస్తవం, అసూయ, ఈర్ష్య, క్రోధము, లోభము గల మనిషితో సహవాసం చేస్తే, మనిషిలో ఉన్న మానవత్వం కూడా మంటలో కలిసిపోతుంది. "*కామ, క్రోధ, లోభములే సాధకునికి పరమ శత్రువులు. ఈ మూడింటినీ సంహరించే నిమిత్తమే రామాయణ, భాగవత, భారతములు అవతరించాయి*" అని అన్నారు బాబా. కామం పెరిగి పెనవేసుకొని, ఉరిగా మారిపోయి, తనతోపాటు తన వంశాన్నే సర్వనాశనం గావించు కున్నాడు రావణుడు. పంచభూతములను సహితం తన వశము చేసుకొనిన హిరణ్యకశిపుడు క్రోధంతో సర్వనాశనం అయినాడు. లోభంతో ధర్మమూర్తులైన పాండవులకు సూది మోపే స్థలము కూడా యివ్వడానికి నిరాకరించి, తనతో పాటు తన కుటుంబాన్ని కూడా సర్వనాశనం చేసుకొనినాడు దుర్యోధనుడు. కనుక కామం, క్రోధం, లోభం -- ఈ మూడింటి ద్వారానే సర్వశక్తి వంతులైన రావణుడు, హిరణ్యకశిపుడు, దుర్యోధనుడు మొదలైనవారు సర్వనాశనం అయిపోయినారు. ఒకే ఒక దుర్గుణం ఒకే వ్యక్తిలో ఉంటేనే వీరు సర్వనాశనం అయినారే! పై మూడు దుర్గుణాలు ఒకేచోట ఒకే వ్యక్తిలో చేరితే, వాడు మాత్రమే కాదు పరిసరాలలో ఉండే వారందరూ కూడా సర్వనాశనం కావటం ఖాయం. కనుక అటువంటి దుర్గుణములకు నిలయమైన మత్సరము గల మనిషికి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. ఇదే వాస్తవమును 'వేమన'

కూడా చెప్పాడు.

పాము కన్న లేదు పాపిష్టి జీవంబు
అట్టి పాము చెప్పినట్టె వినును
ఖలుని గుణము మాన్ప ఘనులెవరు లేరు
విశ్వదాభిరామ వినుర వేమ.

పాముకు మించిన పాపిష్టి జీవం మరొకటి లేదు. అట్టి పాము కూడా నాగస్వరం వాయిస్తుంటే తన్మయత్వంతో నాట్యం చేస్తుంది కాని ఖలుని (నీచుని) గుణమును మాత్రం ఎవరూ మార్చలేరు. నీచ స్వభావం గల మనిషిని మార్చటం అసాధ్యం. ఒకవేళ అటువంటి నీచుని మార్చడానికి ప్రయత్నిస్తే, మార్చలేకపోగా మనలోనున్న మానవత్వం కూడా ఆనాటితో మంటలో కలిసిపోతుంది. కనుక మత్సరంబు గల మనిషికి దూరంగా ఉండటం ఉత్తమం.

**తేలు విషము కన్న తెంపరాకులకన్న**
**పదును కత్తి కన్న పాము కన్న**
**మత్సరంబుగల మనుజుండు ఇలలోన**
**కుత్సితుండు వాడె తుచ్ఛితుండు. 10**

భగవాన్ బాబావారు యింకా ఒక మెట్టు పైకి పోయి మత్సరంబుగల మనిషి యొక్క పరాకాష్ఠను చక్కగా వివరించారు. తేలు విషం, తెంపరాకులు, పదును కత్తి, పాముకన్నా మత్సరంబుగల మనుజుండు కుత్సిత స్వభావం గలవాడే కాదని, తుచ్ఛ స్వభావం గలవాడని పేర్కొనినారు. అంతకన్నా నీచ స్వభావంగల మనిషి మరొకరు ఉండరన్న మాట. తేలు స్వభావం కడు విచిత్రమైనది. పోతూ పోతూ త్రోవలో కనిపించిన మనిషిని కుడుతుంది. అడ్డంగా ఉన్న చెక్కను కుడుతుంది, చెంబును కూడా కుడుతుంది. తేలు విషమునకు చెంబు చిల్లిపడుతుంది. దాని సహజ స్వభావం అది. అందుకోసమనే కాబోలు 'తేలుకొండి'

స్వభావమురా వీడిది అంటారు. వృశ్చిక స్వభావమని నానుడి అంటే కొండెములు, చాడీలు చెప్పడం, అభాండాలు వేయడం, ఎదుటి వానిని చూచి ఓర్వలేకపోవడం, అసూయ, ద్వేషములతో బురద చల్లడం లాంటి దుర్గుణముల గల వ్యక్తిని తేలుకొండి మనస్తత్వం, వృశ్చిక స్వభావం గలవాడని అంటుంటారు ప్రజలు. ఇట్టివారు చాలా ప్రమాదం. ఇకపోతే తెంపరాకులు చాలా పదునుగా ఉంటాయట. ఆకులతో మనిషిని కొడితే చీరుకొనిపోయి రక్తం వస్తుందిట. ఆ ఆకులలో విషం కూడా ఉంటుందని ప్రతీతి. ఇకపోతే పదును కత్తి విషయం వేరే చెప్పనవసరం లేదు. పాము విషయం అంతకన్నా చెప్పనవసరం లేదు. ఈ నాలుగూ నాలుగే. అత్యంత ప్రమాదకరమైనవి. వీటన్నింటికన్నా ప్రమాదం మత్సరముగల మనిషి అంతకన్నా నీచ స్వభావంగల మనిషి. కుత్సిత స్వభావం గల మనిషి మరొకరు ఉండరన్నమాట. ప్రస్తుత మానవ ప్రవృత్తిని దృష్టిలో పెట్టుకొని భగవాన్ బాబావారు మానవుని ఐదు రకములుగా విభజించారు. 1. మానవ దైవత్వం, 2. మానవ మానవత్వం, 3. మానవ దానవత్వం, 4. మానవ పశుత్వం, 5. మానవ హీనత్వం. మానవుడు పై మెట్టుకు ప్రాకి దివ్యత్వమును పొందడానికి బదులు రానురాను దిగజారిపోతున్నాడు. మానవత్వాన్ని కోల్పోయి కడు హీనమైన, తుచ్ఛమైన స్థాయికి దిగజారిపోతున్నాడు. "జంతూనాం నరజన్మ దుర్లభం" అన్నారు మన పెద్దలు. అటువంటి ఉత్తమమైన మానవజన్మ ఎత్తికూడా దానిని సార్థకం చేసుకోలేకపోతున్నాడు. స్వార్థం, ఈర్ష్య, అసూయ, ద్వేషం, కామక్రోధ, లోభంలకు వశుడై పవిత్రమైన మానవ జన్మను సార్థకం గావించుకుంటున్నాడు

**కోకిల కూత కూయగ కాకులెల్ల**
**దాని పొడవంగ చూచుట కాంచలేదె**
**మంచివారిని చూచిన మత్సరించు**
**జగతి దుర్బుద్ధికిది సహజంబుకాద. 11**

దుఃఖములకు, విచారములకు; కష్టములకు, నష్టములకు; నిందలకు, నిష్ఠూరములకు, మనం ఏ మాత్రం లెక్క చేయనవసరం లేదు. చైతన్యుని అనేకమంది దూషిస్తూ వచ్చారు. దూషించిన కొద్దీ ఆనందంతో నాట్యం ఆడుతూ వచ్చాడు. *"ఎందుకు చైతన్యా! ఇంత ఆనందిస్తున్నావు? దూషణలు నీకు బాధ కలిగించడం లేదా?"* అని అడగగా *"అయ్యా! ఆ దూషణలు నాకు కాదు. గట్టిగా దూషిస్తే గాలిలో తేలిపోతాయి. తనలో తాను దూషించుకుంటే తనకే తగిలిపోతాయి. నా వరకు అవి ప్రయాణం చేయటం లేదు. కాబట్టి నేను ఆనందిస్తున్నాను."* అన్నాడు చైతన్యుడు.

ఒక పర్యాయం ఉద్దవుడు గోపికలతో *"అమ్మా! లోకమంతా మిమ్ములను విమర్శిస్తూ ఉన్నది. అత్తమామల ఆజ్ఞలను ఉల్లంఘించి, భర్తలను ధిక్కరించి, రేయింబవళ్ళు కృష్ణా! కృష్ణా! అంటూ పరుగెత్తుతున్నారు. అందరూ మిమ్మునిందిస్తున్నారు, విమర్శిస్తున్నారు."* అని అడుగగా *"ఓ ఉద్దవా! కాకులు కూస్తున్నాయని కోకిల తన గానమును మానుకుంటుందా? లోకులు కాకులు. కనుక ఈ కాకుల కూతలకు మేమేమాత్రం వెరువనవసరం లేదు. మేము కోకిలలాగే ఉంటున్నవారం. మేము భగవచ్చింతిన చేస్తున్నాం. హంసను చూచి కొంగలు పరిహసిస్తుంటే, హంసకు తగ్గే విలువేమిటి? ఏనుగు పోతుంటే కుక్కలు మొరుగు తుంటాయి. ఏనుగు వీటినేమైనా లెక్కచేస్తుందా? లేదు. మేము దైవాన్ని కోరుతున్నామే గాని, లోకాన్ని కోరడం లేదు. లోకాన్ని కోరినప్పుడు మేము భయపడాలి. దైవాన్ని కోరినప్పుడు మాకు భయమెందుకు? కాన అభయ స్వరూపుడైన దైవాన్ని మేము ఆశిస్తున్నాం"* అని గోపికలు సమాధానం చెప్పారు. కాబట్టి ఎవరేమను కున్నప్పటికినీ సత్యంపై మనం ఆధారపడాలి. సత్యమే మన ప్రాణం.

*"భీష్ములు కాకండి! విభీషణులు కండి!"* అని భగవాన్ బాబావారు ఒక పర్యాయం హెచ్చరించారు. అన్నీ తెలిసిన భీష్ముడు సత్యమును ధైర్యంగా చెప్పలేకపోయినాడు. కాబట్టే, దుష్ఫలితాల ప్రభావం అతను

కూడా అనుభవించవలసి వచ్చింది. సత్యమును ధైర్యంగా తన అన్న రావణాసురునికి చెప్పాడు. కాబట్టే విభీషణుడు బయటపడగలిగాడు. అసత్య ప్రభావం తాత్కాలికం. అయితే దాని వేగం మాత్రం సుడిగాలిలా ఉంటుంది. సత్యం శాశ్వతమైనది, చావులేనిది. అయితే దాని వేగం నిదానం. నిదానం ప్రధానం అన్నారు కదా! కనుక సత్యానిదే అంతిమ విజయం. మనం అవకాశవాదులం కాకూడదు, అసత్యమును ఎదిరించ లేని అర్భకులమూ కాకూడదు. అసత్యమును ఎదుర్కొంటూ సత్యమును ధైర్యంగా చెప్పగలిగిన ధీరులుగా తయారు కావాలి.

కోకిల కూత కూయటం మొదట పెట్టగానే కాకులు అసూయతో దానిని పొడవ ప్రారంభిస్తాయి. అదే విధంగానే మంచివారిని చూచి ఓర్వలేక కోకిలను కాకులు పొడిచినట్లుగా వీరు కూడా దుర్బుద్ధితో తలొక మాట అంటారు, నిందిస్తారు, అపహాస్యం చేస్తారు. కాకులు కూస్తున్నాయని వెరచి కోకిల తన గానమును మానుకోకుండా ఏవిధంగా కొనసాగి స్తుంటుందో, అదే విధంగా అపహాస్యం చేసేవారిని చూచి ఏమాత్రం భయపడక ధైర్యంగా ముందుకు సాగిపోవటం నేర్చుకోవాలి.

## అల్పబుద్ధి

**అల్పబుద్ధి నెంత నాదరించినగాని**
**కీడొనర్చు నెట్టి వాడికైన**
**విషము నున్న ఫణిని విపరీతము బెంచ**
**కాటువేయు నెంత ఘనుడినైన 12**

అన్నారు బాబా. అనుభవంలో ఈ విషయం అందరికీ అర్థమవుతుంది. అల్పబుద్ధిగలవానిని ఎంత గౌరవించినా, ఆదరించినా, ఆ గౌరవమర్యాద లను నిలబెట్టుకోలేడు. సహాయము అందించిన వాడికే కీడు తలబెడుతాడు.

వారి కడుపు నిండుతే చాలు. ఎదుటివాడు ఏమైపోయినా ఫరవాలేదు. తన స్వార్థం కోసం ఎదుటి వానిని బలిచేయుటానికి కూడా ఏమాత్రం వెరువడు. ఇట్టి వారి విషయంలో సామాన్యంగా 'పాముకు పాలు పోసినట్లు' అని అంటుంటారు. పాముకు పాలుపోసి ప్రేమతో పెంచినప్పటికీ, అది తన సహజ బుద్ధిని ఏదో ఒక రోజున ప్రదర్శిస్తుంది. విషం కక్కుతుంది. నిండుప్రాణాలను తీసివేస్తుంది. అందుకోసమనే "పగ" యొక్క పరాకాష్టను గురించి ఎవరైనా చెబితే "పాము పగ" తో పోలుస్తారు. ఇక్కడ అల్పబుద్ధి వాడిని పాముతో పోల్చారు బాబా. అల్పబుద్ధి అంటే సంకుచిత మనస్తత్వం. ఉదార స్వభావం ఏమాత్రం లేనివాడు. తన స్వార్థం కోసం ఎదుటివానిని నిర్దాక్షిణ్యంగా సర్వనాశనం చేయటానికి ఏమాత్రం సంకోచించనివాడు. ఇతరులను చూచి ఓర్వలేనివాడు. ఎదుటివారు బాగుపడుతుంటే అసూయతో చేయరాని ఘోరకృత్యములను చేసేవాడు. పాముతో స్నేహం చేయటం వలన కలిగే ప్రమాదం కన్నా, ఇటువంటి అల్పబుద్ధి గలవారితో స్నేహం చేయటం మరింత ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది. ఇదే వాస్తవమును వేమన కూడా చెప్పాడు.

అల్పజాతి వాని కధికారమిచ్చిన  
దొడ్డవారినెల్ల దోలి తిరుగు  
జెప్పుతినెడి కుక్క చెఱకు తీపెరుగునా  
విశ్వదాభిరామ వినుర వేమ.

అల్పునకు అధికారం ఇచ్చిన యెడల మంచివారికి వెంటనే ఉద్వాసన చెబుతాడు. సదుద్దేశ్యముతో అధికారమును వప్పజెప్పినవారికే కీడు తలబెడుతాడు. ఇక్కడ మంచి ఉపమానం చెప్పబడింది. చెప్పులను తినే కుక్కకు చెఱకు తీపి ఏమి తెలుస్తుంది? ఇక్కడ "అల్పజాతి" అనగానే కొందరు కులం, మతం ప్రసక్తి తీసుకొనివస్తున్నారు. ఇది సరియైన నిర్వచనం కాదు. "అల్పబుద్ధి" అని చెప్పుకోవటం సముచితం. అల్పబుద్ధి గలవారు ఏ కులంలో అయినా ఉంటారు. అదే విధంగా దొడ్డబుద్ధి గలవారు

కూడా అన్ని కులాలలో ఉంటారు. ఇక్కడ కులం కాదు ప్రధానం. వాల్మీకి ఆదిలో బోయకులంవాడు. మృగములను వేటాడి మాంసం తినే బ్రతికేవాడు. అతను ప్రపంచానికి 'రామాయణ మహాకావ్యము' ను అందించే వాల్మీకి మహర్షిగా పేరుగాంచాడు. ధర్మవ్యాధుడు అట్టడుగున ఉన్న కులంలో జన్మించాడు. అతని వృత్తి మాంసం అమ్మటం. అయితే అతను చెప్పిన నీతి సూక్తులు మహాభారతంలో 'ధర్మవ్యాధోపాఖ్యానం' పేరిట అత్యంత ప్రచారంలోనికి వచ్చి ఎందరినో ప్రభావితం చేసింది. కనుక ఇక్కడి 'అల్పజాతి' కి 'అల్పబుద్ధి' అని అర్ధం చెప్పుకుంటే బాగుంటుంది. కనుక "అల్పబుద్ధి" గలవారికి అధికారం వప్పజెబితే దొడ్డబుద్ధి గల వారిని కూడా బాధించుతారు. చెప్పులు తినే కుక్కకు చెఱకు తీపి ఏవిధంగా తెలియదో, అల్పబుద్ధి గలవానికి దొడ్డబుద్ధిలోని గొప్పతనం కూడా తెలియదు. కనుక అల్పబుద్ధి గలవానికి అధికారం వప్పజెబితే, ఆ రాజ్యం సర్వనాశనం అవుతుంది. దుష్టులకు ప్రోత్సాహం, శిష్టులకు నిరుత్సాహం యిచ్చినట్లవుతుంది.- అవినీతి, బంధుపక్షపాతం విలయతాండవం చేస్తాయి. నీతి నిజాయితీలకు తిలోదకాలివ్వ బడుతాయి. అశాంతి ప్రబలుతుంది. అరాచకం ఏర్పడుతుంది. కనుక అధికారం వప్పజెప్పే ముందే ప్రజలు విజ్ఞతను ప్రదర్శించాలి. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ఎంత ప్రయోజనముంటుందో అనాలోచితంగా, విజ్ఞతను ప్రదర్శించకుండా తొందరపడి చేసే పనుల వలన అంత ప్రమాదం ఉంటుందని గ్రహించాలి.

**కుసుమ మల్లెమాల కోతికి తగిలించి**
**పట్టుపీతాంబరాలతో పదిల పరచి**
**రత్న సింహాసనమున రమ్యంబుగా జేర్చ**
**వదలునా తన జాతి వక్రబుద్ధి. 13**

అన్నారు బాబా. పూలు పీతాంబరములతో చక్కగా, అందంగా

అలంకరించి రత్న ఖచిత సింహాసనంపై కూర్చుండబెట్టినప్పటికీ, కోతి తన సహజ చేష్టలను విడనాడదు. ఎదురుగా ఏ పండు అయినా కనిపిస్తే ఛంగున పైకి ఎగిరి ఆ పండును పట్టుకోవటానికి ప్రయత్నిస్తుంది. అదే విధంగా అల్పబుద్ధులు గలవానిని అందలం ఎక్కించినప్పటికీ ప్రయోజనం ఉండకపోగా ప్రమాదమును కూడా తీసుకుని తెచ్చిపెడుతాడు. అక్కడ కూడా తన అల్పబుద్ధినే ప్రదర్శిస్తాడు. తన సహజ సంకుచిత స్వభావాన్ని విడనాడడు. విశాలభావమును ప్రదర్శించలేడు. కనుక అధికారమును కట్టబెట్టేటప్పుడు ఆ వ్యక్తి సహజ లక్షణాలను కూడా గమనించాలి. అతని గత చరిత్రను పరికించాలి. అటుల గమనించకుండా, చూడకుండా, పైపై మెరుగులను మాత్రమే చూచి మోసపోయి, అధికారమును అప్పగిస్తే అంతా అస్తవ్యస్తంగా తయారవుతుంది. ఆ రాజ్యం అధోగతి పాలవుతుంది. తరువాత విచారిస్తే ప్రయోజనం ఉండదు. ఇదే భావమును సుమతీ శతకములో చెప్పబడింది.

కనకపు సింహాసనమున
శునకము గూర్చుండబెట్టి శుభలగ్నము నం
దొనరగ పట్టము గట్టిన
వెనుకటి గుణమేలమాను వినరా సుమతీ.

ఒక శుభముహూర్తము చూసి బంగారపు సింహాసనంపై, చక్కగా అలంకరించి కుక్కను కూర్చుండబెట్టినప్పటికీ, తన వెనుకటి నీచ గుణమును మాత్రం వదిలిపెట్టదు. కోతికి చంచలత్వం, కుక్కకు నీచత్వం - వాటి సహజ లక్షణాలు. స్థలం మారినప్పటికీ, స్థాయి పెంచినప్పటికీ వాటి సహజ గుణం మాత్రం మారదు. అదే విధముగా మూర్ఖుడైన వానిని, అల్పుడైన వానిని ఎంత మార్చాలని ప్రయత్నించినా ఆశించినా ప్రయోజనం మాత్రం ఉండదు. అల్పబుద్ధి గలవానికి అధికారం యిస్తే ఆశించిన ప్రయోజనం చేకూరకపోగా ప్రమాదం కూడా వాటిల్లుతుంది.

**కంచునందు మ్రోత ఘనముగా నుండును**
**కనకమందు మ్రోత కానబడదు**
**అల్పులందు నెందు ఆడంబరము మెండు**
**పయిన మెరుగు లేల భక్తునకును 14**

అన్నారు భగవాన్ బాబావారు. భక్తుల లక్షణాలు సలక్షణంగా ఉండాలని సచ్చింతనలతో, సద్భావనలతో, సదాలోచనలతో, సదా నిండి ఉండాలని ఆడంబరాలకు అతి దూరంగా ఉండాలని బాబావారి అభిప్రాయం. అంతే కాదు స్వచ్ఛమైన గుణం (Spotless character) మాత్రమే భక్తుని వ్యక్తిత్వాన్ని యినుమడింపజేస్తుందిగాని, పైపై ఆడంబరాలు, అలంకారాలు మెరుగులతో ఏ వ్యక్తీ శోభించడు, రాణించడు, బాహ్య సౌందర్యము శాశ్వతం కాదు. కాలక్రమమున అది క్షీణించి, అరిగి తరిగి, నశించి కాలగర్భంలో కలిసిపోతుంది. అంతఃసౌందర్యము మాత్రమే అతని వ్యక్తిత్వాన్ని పెంచివేస్తుంది. స్వచ్ఛమైన గుణం మాత్రమే శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలను ఆర్జించిపెడుతుంది. దానికి ఎప్పటికీ నశింపులేదు. కనుక అట్టి స్వచ్ఛమైన గుణమును స్వంతం చేసుకోవాలిగాని పైపై మెరుగులకు, పూతలకు, అలంకారములకు ప్రాధాన్యత యివ్వరాదని బాబావారి అభిప్రాయం.

ఈ పద్యంలో బాబావారు సచ్ఛీల సంపన్నులను కనకంతో పోల్చారు. ఆడంబరములకు ప్రాధాన్యత నిచ్చేవారిని కంచుతో పోల్చారు. అయితే కంచు ఖంగున మ్రోగుతుంది. బంగారం మ్రోత మాత్రం వినపడదు. అయితే బంగారమునకు ఉన్న విలువ కంచునకు లేదు. అదే విధముగా సచ్ఛీల సంపన్నుడై, నిరాడంబర జీవితాన్ని గడిపేవానికి ఉన్న విలువ, పైపై మెరుగులతో, అలంకారాలతో ఆడంబరంగా జీవితాన్ని గడిపేవానికి ఉండదు. "అష్టావక్రుడు" లాంటి కురూపి, మహావిద్వాంసుడు కావటం వలన రాజాధిరాజులతో మంచి సత్కారాలు అందుకోగలిగాడు.

కారణం ? అతని బాహ్య శరీరాన్ని చూసి కాదు, అతనిలో నున్న పాండిత్య ప్రతిభకు విలువ యిచ్చారు. పైపై మెరుగులు, పూతలు, అలంకారాలు చూచి కొంతకాలం కొంతమంది మోసపోవచ్చును, కాని అసలు రంగు ఎప్పుడో ఒకప్పుడు బయట పడక తప్పదు. అల్పులు మాత్రమే ఆడంబరాలకు ప్రాధాన్యతనిస్తుంటారని, నిజమైన భక్తులకు పైపై మెరుగులు అవసరం లేదని బాబావారు స్పష్టం చేశారు. కనుక అశాశ్వతమైన ఆడంబరాలకు విలువ యివ్వకుండా, పైపై పూతలకు, మెరుగులకు ప్రాధాన్యత నివ్వకుండా, స్వచ్ఛమైన గుణమును ప్రతి ఒక్కరూ స్వంతం చేసుకోవాలి. ఇదే భావమును వేమన కూడా ఈ క్రింది పద్యము ద్వారా సమాజానికి అందించాడు.

*"అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను*
*సజ్జనుండు పల్కు జల్లగాను*
*కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా*
*విశ్వదాభిరామ వినుర వేమ !"*

అల్పబుద్ధులు గలవాని పల్కులు పైకి ఆడంబరముగా ఉంటాయి. మనస్సు కలుషితమై మలిన భూయిష్టమై ఉంటుంది. ఆలోచనలు అల్పంగా ఉంటాయి. మాటలు మాత్రం కోటలు దాటుతాయి. సజ్జనుని పలుకులో సౌమ్యత, వినయం ఉట్టిబడుతూ ఉంటుంది. మనస్సు నిర్మలంగా, మెత్తగా, స్వచ్ఛంగా, విశాలంగా ఉంటుంది. అల్పుని భావాలు సంకుచితంగాను, సజ్జనుని భావాలు విశాలంగాను ఉంటాయి. కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగదు గదా !

**ఒక్కప్రొద్దు మాట కుక్క యేమెరుగును?**
**అటుకుల రుచి ఎద్దుకెటుల తెలియు?**
**ఖరముకేమి తెలియు గంధంబు వాసన?**
**అంధుడేమి యెరుగు చందు రూపు?** 15

దొరికినప్పుడల్లా తినటమే తెలుసు గాని, ఉపవాసము యొక్క ప్రాముఖ్యత కుక్కకేమి తెలుసు? గడ్డితిని బ్రతికే ఎద్దుకు అటుకులలోని రుచి ఏమి తెలుసు? బరువు మోసి బ్రతికే గాడిదకు గంధము యొక్క వాసన ఏమి తెలుసు? అదే విధంగ గ్రుడ్డివానికి చంద్రుని యొక్క అందచందములు ఏమి తెలుసు?

ఇదే భావమును వేమన కూడా ఈ క్రింది పద్యములో చక్కగా వర్ణించాడు.

"ఓగునోగుమెచ్చు నొనరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చు పరమలుబ్ధు
పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా?
విశ్వదాభిరామ వినురవేమ!"

అనగా పనికిమాలిన వానిని మూఢుడు మెచ్చుకొనును. పరమ లోభి అజ్ఞానిని మనసిచ్చి మెచ్చుకొనును. పంది బురదను మెచ్చుకొని నట్టుగా పన్నీరును మెచ్చుకొనునా? ఇది ఎంతో అనుభవంతో చెప్పిన మాట. ఏ స్థాయివారు ఆ స్థాయివారితో స్నేహం చేస్తుంటారు. వారి స్థాయిని పెంచటానికి ప్రయత్నించినా ప్రయోజనం ఉండదు. అక్కడ కూడా తమ అల్పబుద్ధినే ప్రదర్శిస్తుంటారు. శునకమును తీసుకుని వెళ్ళి కనకపు సింహాసనముపైన కూర్చోపెట్టినప్పటికినీ, వెనుకటి గునమును అది మానుకుంటుందా? మానుకోదు. అదే విధంగా బురదలో పొర్లాడే పందిని తీసుకొని వచ్చి పన్నీరుతో స్నానం చేయించినా, తిరిగి అది బురద గుంటలోకే పోతుంది. అదే విధంగా "మూర్ఖ జన చిత్తము దెల్ప నసాధ్యమేరికిన్".

ఇదే వాస్తవాన్ని సుమతి కూడా ఈ క్రింది పద్యములో చక్కగా విశదీకరించాడు.

"ఉత్తమ గుణములు నీచున
కెత్తెఱగున గలుగ నేర్చు నెయ్యెడలందా
నెత్తెచ్చి కరగపోసిన
నిత్తడి బంగారమగునె యిలలో సుమతీ"

నీచులు, మూర్ఖులు మంచివారితో స్నేహం చేసినప్పటికినీ వారిలోని మంచిగుణాలను గ్రహింపజాలరు. ఎట్లనగా బంగారముతో సమానమగు ఇత్తడిని తూచి, కరగించి (బంగారం కరగించి పోసిన మూసలో పోసినను) పోసినను అది బంగారం కాజాలదు గదా!

ఎంత ప్రయత్నించినా కుక్కతోక వంకరను తీయటం సాధ్యం కాదు. ఎంత ప్రయత్నించినా పంది బురదనే మెచ్చుతుంది గాని పన్నీరును మెచ్చదు. అదే విధంగా ఎంత ప్రయత్నించినా మూర్ఖుని మనస్సును మార్చుట అసాధ్యం. గ్రుడ్డివానికి చంద్రుని చూపించడానికి ప్రయత్నం చేస్తే ప్రయోజనం ఎంతటిదో, మూర్ఖుని మార్చడానికి ప్రయత్నిస్తే వచ్చే ప్రయోజనం కూడా అంతే.....

## దొడ్డబుద్ధి

**మోహమున మున్గియుండును మూఢబుద్ధి**
**ముక్తి యననేమొ తెలియదు ముగ్ధబుద్ధి**
**దుష్టులననేమొ యెరుగదు దొడ్డబుద్ధి**
**చెడ్డనే నిత్యము స్మరించు గొడ్డుబుద్ధి** **16**

ఈ మానవజన్మ పరంపరలకు మూలకారణం భవబంధాలను త్రుంచుకోలేక పోవటం, మోహమమకారములను పెంచుకోవటమే. మానవుడు తన కర్తవ్యకర్మలను విస్మరించి మోహంలో మునిగి మూఢుడైపోతున్నాడు. తనకు తోచదు, ఇతరులు చెబితే వినిపించుకోక

పోవటమే మూర్ఖుని ప్రధాన లక్షణం. అదే మూఢబుద్ధి. మోహక్షయమే మోక్షము కదా! ఎప్పుడైతే మానవుడు కామక్రోధలోభమోహముల నుండి బయటపడలేకపోతున్నాడో, అప్పుడు మోక్షమునకు దూరమై పునరపి జననం... పునరపిమరణంగా జీవితయాత్ర కొనసాగిస్తూ 'ముక్తి' అంటే ఏమిటో తెలుసుకోలేని అమాయక స్థితిలో అమూల్యమైన కాలమును వ్యర్థం గావించుకుంటున్నారు ముగ్ధజీవులు. ఇట్టి వారిది 'ముగ్ధబుద్ధి'

ఇకపోతే దురాలోచనలకు దూరంగా ఉంటూ, దుశ్చింతనలను దరికి చేరనీయకుండా, దుర్భావనలను మనస్సులోనికి రానివ్వకుండా, సర్వ వేళలా సదాలోచనలే చేస్తూ సద్బుద్ధితో కాలం గడుపుతుంటారు 'దొడ్డబుద్ధి' గలవారు. వీరికి లోకంలో చెడు అనేదే కనిపించదు. అంతా మంచిగానే కనిపిస్తుంది. ఇకపోతే మరికొంతమంది నిత్యమూ చెడునే ఆలోచిస్తూ, చెడునే స్మరిస్తూ, చెడ్డనే చూస్తుంటారు. ఇట్టివారిది పశులక్షణం. వీరికి మంచి అనేదే కనిపించదు. వీరి దృష్టి అంతా చెడుమీదకే పరిగెత్తుతుంది. వీరు నిత్యశంకితులు. ఇట్టివారిది 'గొడ్డుబుద్ధి' అన్నారు.

కనుక ప్రతిఒక్కరు 'దొడ్డబుద్ధి' పెంచుకొని, 'గొడ్డుబుద్ధి' కి తిలోదకాలివ్వాలి. 'తనదీ, తనవారు' అనే భవబంధాలను త్రుంచుకోవాలి. అప్పుడే మనలోనున్న అజ్ఞానం పటాపంచలై, అహంకారం దూరమై మోక్షం మనకు ప్రాప్తిస్తుంది.

## సద్గుణములు

**మనుజుడైనవాడు తన దుర్గుణమ్ముల**
**వరుస నొకటి యొకటి వదల వలయు**
**పశుగుణంబు వీడి పశుపతి కావలె**
**సత్యమైన బాట సాయి మాట. 17**

అన్నారు బాబా "జ్ఞానేన శూన్యః పశుభి స్సమానాః" జ్ఞాన రహితుడైనవాడు పశువుతో సమానం. కేవలం తినటం, త్రాగటం భోగభాగ్యములను అనుభవించడమే తప్ప, మరో విషయాన్ని గురించి ఆలోచించని వారందరూ పశువులతో సమానమే. ఇంద్రియ సుఖములే ప్రధానమని భావించేటటు వంటి వారందరూ పశువులుగా మారిపోతారు. ఆకార పశువులు (చతుష్పాద జంతువులు)గా కాదు. మానవాకారంలోనే ఉంటారుగాని, పశుత్వ భావాలు కలిగి ఉంటారన్నమాట. అసలు పశువుకు, మనిషికి తేడా ఏమిటి? పశ్యతీతి పశుః" అనగా కేవలం బహిర్ దృష్టి కలది పశువు. అంతర్దృష్టిని అభివృద్ధిపరచుకోవటానికి మనిషికి ఆలోచనా శక్తిని ప్రసాదించాడు భగవంతుడు. దానిని సద్వినియోగం చేసుకొనేవాడే నిజమైన మానవుడు. ఏ పని చేయవచ్చును? ఏ పని చేయకూడదు? అనే విచారణా శక్తి సహజంగా మానవులలో ఉంటుంది. పని చేయటం కాదు ప్రధానం. అది మంచి పనా? లేక అది చెడ్డపనా? విచారించి, తెలుసుకొని చేయాలి. గ్రుడ్డిగా తాత్కాలిక సుఖమును కోరి చేయకూడదు. *'భోగం రోగం'* అన్నారు కదా! ఆహారం దేహసంరక్షణకే గాని, ఆత్మసంరక్షణకు కాదంటూ *"Eat to Live, Not live to Eat"* (తినటానికి బ్రతకరాదు, బ్రతకటానికి తినాలి) అన్నారు బాబా. ఏదో విధంగా పొట్ట నింపుకోవటమే ప్రధానం కాదు. ఎన్నో జన్మల పుణ్యఫలం ఈ మానవజన్మ. దానిని సార్థకం చేసుకోవాలి. *"హరికి దాసులుకండి! సిరికి కాదు!"* అన్నారు బాబా. దుర్గుణాలకు దాసులు కాకూడదు, దైవానికి దాసులు కావాలి. మనలోనున్న దుర్గుణాలను ఒకదాని తరువాత ఒకదానిని పారద్రోలాలి. పశు లక్షణాలకు తిలోదకాలివ్వాలి. పశువులకు, మానవులకు తేడా ఉన్నదని నిరూపించాలి. పశుపక్ష్యాదులు సహితం భగవదానుగ్రహమును సంపాదించిన సంఘటనలు కోకొల్లలు, హనుమంతుడు వానరుడు అయినప్పటికీ శ్రీరాముని అనుగ్రహమును సంపాదించలేదా? 'ఉడుత శ్రీరాముని మెప్పును పొందలేదా? *గజరాజు, నాగరాజు, సాలెపురుగు, జటాయువు* - ఇవన్నీ

భగవదానుగ్రహంతో మోక్షమును సంపాదించలేదా? పశు పక్ష్యాదులే మోక్షానికి అవసరమైన అర్హతను సంపాదించినప్పుడు, వివేక విచక్షణ జ్ఞానాలు కలిగిన మానవుడు అట్టి అర్హతను, సంపాదించలేడా? సాధన ఉంటే సంపాదించగలడు అయితే ఈనాటి మానవుడు మానవత్వాన్ని విస్మరించి వానరత్వాన్ని పెంచుకుంటున్నాడు. ఒక్కొక్క సమయంలో కోతి కంటే హీనమవుతున్నాడు, పతనమవుతున్నాడు. ఈ పరిస్థితి మారాలి. ఉత్తమమైన మానవజన్మను సార్ధకం చేసుకోవాలి. మనలోనున్న పశుగుణాలను వీడి పశుపతిగా ఎదగటానికి అవసరమైన ప్రయత్నం చేయాలి. దుర్గుణాలకు తిలోదకాలిచ్చి సద్గుణాలను పెంచుకోవాలి. "హరిని వరిస్తే జీవితం తరిస్తుంది" అంటారు బాబా.

పరమాత్మకు 'పశుపతి' అని పేరు. పశుపతి అంటే జీవులకు అధిపతి అని అర్ధము. కనుక జీవుడు తనలోని పశుగుణములను విడనాడితే దుర్గుణములను దూరం గావించుకుంటే, తనయందున్న పశుత్వాన్ని జయించితే 'పశుపతి'గా మారిపోతాడు. మానవుడు 'మాధవుడు' అవుతాడు. నరుడు 'నారాయణుడు' అవుతాడు. జీవుడు 'శివుడు' అవుతాడు. అందువలననే "మానవత్వము నుండి దివ్యత్వానికి చేరుకోవటమే అసలైన ఆధ్యాత్మికం" అన్నారు భగవాన్ బాబా.

## దుర్గుణములు

క్రూరమృగము తెచ్చి కూర్మితో పెంచిన
ఆకలయ్యేనేని అదిరిపడును
దుర్గుణంబులు గల దుష్టుల సంఘంబు
క్రూరమృగముల కంటె ఘోరమగును. 18

అన్నారు బాబా. ఇది వాస్తవం, యదార్ధం. క్రూరమృగమైన పెద్దపులి

చిరుతపులుల యొక్క పసికూనలను తెచ్చి ఎంత ప్రేమతో పెంచి, పెద్దవి చేసినప్పటికినీ, ఆకలైతే అదిరి మీదపడును. పెంచిన వారిని సహితం చంపడానికి ఏ మాత్రం వెరువవు. అది క్రూర జంతువు యొక్క సహజ లక్షణం. అందువలన క్రూర జంతువులకు దూరంగా ఉండటం మంచిది. ఇక్కడ బాబాగారు మరో చక్కటి ఉదాహరణ కూడా చెప్పారు. "దుర్గుణంబులు గల దుష్టుల సంఘంబు క్రూర మృగముల కంటె ఘోరమగును" అన్నారు. మృగం భౌతిక శరీరమును మాత్రమే కాటు వేస్తుంది. దుర్జనులు, దుష్టులు భౌతికంగానే గాక మానసికంగా కూడా బాధపెడుతారు. దుర్జనుల సాంగత్యం, క్రూర మృగములతో సాంగత్యం కంటే మహా ప్రమాదభరితమైనది. దుర్గుణములు గల మానవుడు ఆకార మానవుడే గాని, ఆత్మీయ మానవుడు కాదు. మాటలు నేర్చిన మానవుడే గాని, హృదయం ఉన్న మానవుడు కాదు. కనుక అల్పబుద్ధులు, నీచ గుణములు, దుర్గుణములు, దుష్టబుద్ధులు గల మానవులను దరికి జేరిస్తే, క్రూరమృగముల వలన కలిగే ప్రమాదం కంటే ఎక్కువగా ఉంటుంది. అందువలననే దుష్టులకు దూరంగా ఉండాలంటారు. ఇదే భావమును వేమన కూడా చెప్పాడు.

హీనగుణము వాని నిలుసేరనిచ్చిన
ఎంతవానికైన నిడుము గలుగు
ఈగ కడుపుజొచ్చి యిట్టట్టు సేయదా
విశ్వదాభిరామ వినుర వేమ.

హీన గుణములు, అల్పబుద్ధులు కలిగిన వారిని ఇంటిలో ప్రవేశించడానికి అవకాశం ఇచ్చిన యెడల, ఎటువంటి సహృదయులకైనా బాధలు తప్పవు. "తిన్నింటి వాసాలు లెక్కపెట్టినట్లు" గా చేస్తారు. అది వారి సహజ ప్రవృత్తి. సహృదయంతో సహాయం అందించిన వారికే ప్రమాదం తెచ్చిపెట్టటం వారి సహజ లక్షణం. అన్నం పెట్టిన వారికే ద్రోహం తలబెట్టటం వారి ప్రవృత్తి. ఈగ కడుపులో చేరి ఎంతటి బాధను కలుగచేస్తుందో ఈ

దుర్జనులు, దుష్టులు ఇంటిలో చేరి అంతటి బాధను కలుగజేస్తారు. కనుక ఇటువంటి నీచ స్వభావంగల వారిని దరికి చేరనీయరాదు.

**కొలది కొలదిగ పుట్టును తొలుత చెదలు**
**కొఱికి తినివేయు త్వరలోన కొయ్యనంత**
**దుర్గుణంబులు సూక్ష్మమై తొలుచు తొలుత**
**పిదప నాశంబు చేయునే పెద్దనైన 19**

అన్నారు బాబా. చెదలు యొక్క ప్రభావం ఎంతటిదో ముఖ్యంగా గృహిణులకు బాగా తెలుసు. ఇంటిలో చెదపురుగు చేరిందంటే చాలు. మొదట ఆ చెదకు పుస్తకాలు సర్వనాశనమైపోతాయి. తరువాత బీరువాలు, ఆ తరువాత ఇంటివాసాలు, కడ్డీలు, దూలాలు అన్నీ ఆహుతి అవుతాయి. చూడటానికి ఆ చెదపురుగు 'నలుసు' లాగే ఉంటుంది. రోజుకు కొన్ని వేలు పుట్టుకొని వస్తాయి. చూడ చిన్నవి, వాటి శక్తి మాత్రం అపరిమితం. అంత చిన్న పురుగులు అంత పెద్ద దూలాన్ని ఎలా తిన్నాయా? అని పిస్తుంది. దూలం యొక్క ఆకారం అదే విధంగా పైకి చూడటానికి బాగానే ఉంటుంది. లోపల డొల్ల చేస్తాయి. మనకు తెలియకుండానే ఏదో ఒక రోజున ఆ పెద్ద దూలం విరిగి క్రిందపడుతుంది. ఇంటి కప్పు కూలుతుంది. ఎన్ని మందులు స్ప్రే చేసినా ప్రయోజనం ఉండదు. చచ్చేవి చస్తూనే ఉంటాయి. పుట్టేవి వేల సంఖ్యలో పుడుతూనే ఉంటాయి. వేటితోనయినా దేనితోనయినా పోరాడవచ్చును గాని, ఈ చెదపురుగులతో మాత్రం పోరాడటం బహు కష్టం. అదే విధంగా దుర్గుణాలు ఆదిలో చూడటానికి చాలా చిన్నవిగానే కనిపిస్తాయి. వాటి ప్రభావం మాత్రం ఊహించని రీతిలో ఉంటుంది. అసూయ, ఈర్ష్య, ద్వేషం, క్రోధం, లోభం లాంటి దుర్గుణాల శక్తి ఎంతటిదో ఆదిలో ఎవరూ ఊహించలేరు, గ్రహించలేరు. అయితే ఆ దుర్గుణాలు ఎంతటి మహనీయులనైనా పతనం చేస్తాయి. ఎటువంటి మహా సంస్థలనైనా సర్వనాశనం చేస్తాయి. "ఈ

అసూయ అనే రోగమునకు మందే లేదు. భయంకరమైన కాన్సర్ నివారణకు కూడా ఒక ఔషధం ఉంటున్నది. కాని ఈ అసూయ అనే రోగమును నివారించుటకు ఏమాత్రం వీలులేదు. ఈ అసూయకు *No reason, No season"* అన్నారు బాబా. ఇది యదార్థం. ఈ అసూయకు మించిన రోగం వేరొకటి లేదు. కనుక ఇటువంటి దుర్గుణాలను ఆదిలోనే త్రుంచివేయాలి. *"Prevention is better than cure"* అన్నారు గదా! చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనం ఉండదు. పై దుర్గుణాలు అసలు మనలో ప్రవేశించకుండానే ముందుగా జాగ్రత్తపడాలి. ఒకమారు ప్రవేశిస్తే చాలు. వాటిని పారద్రోలటం బహు కష్టం. అవి ఎంతటి వారినైనా తేలికగా వశం చేసుకుంటాయి. ఇదే విషయమును వేమన కూడా చక్కగా వర్ణించాడు.

వేరు పురుగు జేరి వృక్షంబు జెరచును
జీడపురుగు జేరి చెట్టు జెరచు
గుత్సితుండు చేరి గుణవంతు జెరచురా
విశ్వదాభిరామ వినుర వేమ.

చెట్టు వేరులో పురుగు చేరితే ఎంతటి మహా వృక్షమయినా నిలువునా ఎండిపోతుంది. చీడపురుగు గనుక ఆకులలో చేరితే, ఆకులన్నీ ఎండి జలజల రాలిపోతాయి. చెట్టు మొండెమై అందవిహీనంగా కనపడుతుంది. అదే విధంగా కుత్సిత స్వభావం గలవాడు అనగా దుర్గుణములు గలవాడు గుణవంతుని కూడా పాడుచేస్తాడు, చెడగొడతాడు. కనుక దుష్టులను, దుర్జనులను ఎంత దూరంగా ఉంచుతే అంత మంచిది.

**గుణము లేని సుతుడు గురిలేని విద్యలు**
**నీతిలేని జాతి నిష్ఫలంబు**
**శాంతిలేని జీవి శశిలేని నిశి సుమీ**
**వినుము భారతీయ వీరసుతుడ. 20**

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఈ పద్యంలో చక్కటి ఉపమానం చెప్పారు. గుణరహితుడైన కుమారుడు, లక్ష్యములేని విద్యలు, నీతిలేని జాతి, శాంతిలేని జీవి శశిలేని నిశితో సమానమని బాబా చెప్పారు. అంటే చంద్రుడులేని కాళరాత్రితో సమానమన్న మాట. అటువంటివారు వుండికూడా ఏమాత్రం ప్రయోజనం లేదన్నమాట. గుణరహితుడైన కుమారుడు, అతని తండ్రి యొక్క సుగుణములను కూడా పాడుచేసిన వాడవుతాడు. అనగా అటువంటి గుణరహితుని వలన తండ్రి కూడా అప్రదిష్ట పాలవుతాడు. ఇదే వాస్తవమును ఈ క్రింది సుమతి శతక పద్యము కూడా చాటుచున్నది.

*"కొరగాని కొడుకు పుట్టిన*
*గొఱగామియ కాదు, తండ్రి గుణములఁ జెఱచున్*
*చెఱకు తుద వెన్ను పుట్టిన*
*జెఱకున దీపెల్ల చెఱచు సిద్ధము సుమతీ"*

చెఱకునకు వెన్ను పుట్టిన యెడల, ఆ చెఱకు నందలి తీపినంతయు పాడుచేయును, అదేవిధముగా పనికిమాలిన కొడుకు తండ్రి యొక్క సుగుణములనే పాడుచేయును. ఇకపోతే ఒక పవిత్ర లక్ష్యము లేకుండా, ఒక ఆదర్శము పెట్టుకొనకుండా చదివే చదువులు సమాజ శ్రేయస్సుకు ఏమాత్రం ఉపయోగపడవు. *"నీతియే నీ జాతి, అది వదలితివో, నీవు కోతికంటే హీనుడవవుతావు"* అన్నారు బాబా. ఇది ఎంతో వాస్తవం. నీతి గలవాడే నిజమైనమనిషి. నీతిగల జాతియే నిజమైన జాతి. నీతిగల మానవునియందే నిజంగా వ్యక్తిత్వం వికసిస్తుంది. *"జాతి గౌరవంబు నీతిపై నిలుచును, నీతి లేకయున్న జాతి చెడును"* అన్నారు బాబా. కనుక ఏ జాతి బాగుపడాలన్నా ఆ జాతి ప్రజలు నీతివంతులై వుండాలి. వారి ప్రవర్తన నిజాయితీతో కూడినదై ఉండాలి.

*"శాంతిలేని జీవి శశిలేని నిశి"* అన్నారు బాబా. మానవునికి కేవలం డబ్బుతో శాంతి లభించదు. సంపదలు శాంతిని చేకూర్చవు. శాంతి

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఈ పద్యంలో చక్కటి ఉపమానం చెప్పారు. గుణరహితుడైన కుమారుడు, లక్ష్యములేని విద్యలు, నీతిలేని జాతి, శాంతిలేని జీవి శశిలేని నిశితో సమానమని బాబా చెప్పారు. అంటే చంద్రుడులేని కాళరాత్రితో సమానమన్న మాట. అటువంటివారు వుండికూడా ఏమాత్రం ప్రయోజనం లేదన్నమాట. గుణరహితుడైన కుమారుడు, అతని తండ్రి యొక్క సుగుణములను కూడా పాడుచేసిన వాడవుతాడు. అనగా అటువంటి గుణరహితుని వలన తండ్రి కూడా అప్రదిష్ట పాలవుతాడు. ఇదే వాస్తవమును ఈ క్రింది సుమతి శతక పద్యము కూడా చాటుచున్నది.

*"కొరగాని కొడుకు పుట్టిన*
*గొఱగామియ కాదు, తండ్రి గుణములుఁ జెఱచున్*
*చెఱకు తుద వెన్ను పుట్టిన*
*జెఱకున దీపెల్ల చెఱచు సిద్ధము సుమతీ"*

చెఱకునకు వెన్ను పుట్టిన యెడల, ఆ చెఱకు నందలి తీపినంతయు పాడుచేయును, అదేవిధముగా పనికిమాలిన కొడుకు తండ్రి యొక్క సుగుణములనే పాడుచేయును. ఇకపోతే ఒక పవిత్ర లక్ష్యము లేకుండా, ఒక ఆదర్శము పెట్టుకొనకుండా చదివే చదువులు సమాజ శ్రేయస్సుకు ఏమాత్రం ఉపయోగపడవు. *"నీతియే నీ జాతి, అది వదలితివో, నీవు కోతికంటే హీనుడవవుతావు"* అన్నారు బాబా. ఇది ఎంతో వాస్తవం. నీతి గలవాడే నిజమైనమనిషి. నీతిగల జాతియే నిజమైన జాతి. నీతిగల మానవునియందే నిజంగా వ్యక్తిత్వం వికసిస్తుంది. *"జాతి గౌరవంబు నీతిపై నిలుచును, నీతి లేకయున్న జాతి చెడును"* అన్నారు బాబా. కనుక ఏ జాతి బాగుపడాలన్నా ఆ జాతి ప్రజలు నీతివంతులై వుండాలి. వారి ప్రవర్తన నిజాయితీతో కూడినదై ఉండాలి.

*"శాంతిలేని జీవి శశిలేని నిశి"* అన్నారు బాబా. మానవునికి కేవలం డబ్బుతో శాంతి లభించదు. సంపదలు శాంతిని చేకూర్చవు. శాంతి

లేని వానికి ఎంత సంపద ఉన్నప్పటికీ ప్రయోజనం శూన్యం. అటువంటి వాని జీవితం అంధకార బంధురమే అవుతుంది. అది కాళరాత్రితో సమానం. చంద్రుడులేని చీకటిరాత్రిలో ప్రయాణం చేయటం ఎంత కష్టమో, మనశ్శాంతి లేకుండా జీవితం గడపటం కూడా అంత కష్టమే అవుతుంది. మనస్సుకు శాంతి లేకపోతే దుఃఖాలు మనల్ని వెంటాడుతూనే ఉంటాయి. శాశ్వతంగా అవి మనలో కాపురం చేస్తుంటాయి. ఒక్క చిత్తశుద్ధి వలననే శాంతి ఉదయిస్తుంది. త్యాగము వలననే చిత్తశుద్ధి కలుగుతుంది. కర్మఫలమును నిష్కామబుద్ధితో త్యజించుటయే త్యాగం. అందువలననే "త్యాగాత్ శాంతి" అన్నారు త్యాగము వలననే శాంతి చేకూరగలదు. కనుక ప్రతి వ్యక్తి తన జీవితాన్ని త్యాగమయం చేసుకోవాలి. లేకపోతే ఆత్మశాంతిలేని జీవితం అంధకార బంధురమే అవుతుంది.

**దానధర్మము లేక దయయు సత్యము లేక**
**మానసమున మంచినీతి లేక**
**చెడు గుణంబులతోడ చెరలాడుచున్నట్టి**
**నరుడు ఇలను చెడును పరము చెడును. 21**

ఈ పద్యములో భగవాన్ బాబావారు దానము, ధర్మము, దయ, సత్యము, నీతి మొదలగు సద్గుణములకు తిలోదకాలిచ్చి; దుర్గుణములను పట్టుకొని వ్రేలాడే నరుడు ఇహపరములలో ఎందుకూ పనికిరాకుండా చెడిపోతాడని హెచ్చరించారు.

"అదాన దోషేణ భవేద్దరిద్రః" ఈ జన్మలో దానం చేయనివాడు వచ్చే జన్మలో దరిద్రుడై పుడుతాడు. ఈనాడు లౌకిక ప్రపంచంలో ధనవంతుడు చాలా గొప్పవాడుగా పరిగణించబడుతున్నాడు. కాని ఆధ్యాత్మిక మార్గంలో ధనం గొప్పది కాదు. 'ధనము కంటె దానమే గొప్పది' అన్నారు బాబా. దానమే చేయకున్న ధనమునకు విలువేలేదన్న మాట. దానము చేసేవారికి Income Tax Exemption కూడా ఇస్తుంది.

దొంగలుకూడా దానకర్ణులను వదిలేస్తారు. సమాజం అట్టి వారిని గౌరవిస్తుంది. కనుక ప్రతి ఒక్కరూ తాను సంపాదించిన సొమ్ములో కొంత భాగము విధిగా దానం చేసి తీరాలి. మొదటి వారసుడైన ధర్మమునకు 'ధనమును' దానము చేయని యెడల మిగతా ముగ్గురు వారసులైన దొంగ, అగ్ని, ప్రభుత్వములు కోపోద్రిక్తులవుతారు. దొంగ దొంగిలించుతాడు. అగ్ని అకస్మాత్తుగా భస్మం చేస్తుంది. ప్రభుత్వం పన్నుల ద్వారా కాజేస్తుంది. కనుక ప్రతి ఒక్కరూ ధనమును ధర్మ కార్యములకు కొంత వెచ్చించి తీరవలసిందే.

రెండవది ధర్మం. 'ధర్మం' అంటే ఏదో దాన ధర్మాలు చేయటం అనే పరిమితమైన దృక్పథంతో ఈనాడు చాలామంది ఆలోచిస్తున్నారు. "ధారయతీతి ధర్మః" జగత్తును ధరించినటువంటిది. విశ్వవ్యాపకమైన తత్త్వం ఇది. ధరిస్తుంది, భరిస్తుంది. కనుక దీనికి 'ధర్మం' అనే పేరు కలిగింది. ధర్మమే ప్రజలను ధరిస్తుంది. అనగా వారి సుస్థిరతకు, అభివృద్ధికి కారణభూతమవుతుంది. 'సత్యం వద, ధర్మం చర' అన్నారు. సత్యమును చెప్పాలి. ధర్మమును ఆచరించాలి. అయితే ఈనాడు మనలో చాలామంది అధర్మాన్ని ఆచరించడంవలన ధర్మం మనల్ని రక్షించడం లేదు. ధర్మ అర్థ కామ మోక్షములు చతుర్విధ పురుషార్థములు. దీనిలో ధర్మము మొదటిది. ఈ నాల్గు పురుషార్థములను సమన్వయ దృష్టితో సాధించినప్పుడే మనిషి జీవితము పరిపూర్ణం. ఆనందమయం, ఆదర్శప్రాయం అవుతుంది. అర్థ, కామాలను అదుపు చేసేది ధర్మం. ధర్మబద్ధంగా కర్మలనాచరించాలి. అప్పుడే మోక్షమునకు అర్హులమవుతాం. "ధర్మో రక్షతి రక్షితః". 'ధర్మాన్ని రక్షించేవారిని ధర్మమే రక్షిస్తుంది' అనే ఆర్యోక్తిని విస్మరించకండి! విశ్వసించకండి! ధర్మమును ఆచరించండి!

మూడవది 'దయ'. ఇది మానవునిలో ఉండవలసిన ఉత్తమ సద్గుణం. ఎదుటివాని కష్టములను చూచినప్పుడు నీ హృదయం ద్రవించాలి. అట్టి దానినే 'దయ' అంటారని చెబుతూ "దయ గల

హృదయమే దైవమందిరం" అన్నారు బాబా. నిరుపేదల కష్టములను చూచి వలవల ఏడ్చేవాడే మహాత్ముడంటారు స్వామి వివేకానంద. దయకూడా ఒక రకమైన శీలమే. అందువలననే దానగుణం గలవారిని 'దయాశీలి' అని అంటారు. దయలేనివాడు దానవుడుగా ప్రవర్తిస్తాడు, హృదయము లేనివాడు పశువుగా ప్రవర్తిస్తాడు. దయ, కరుణలు దైవీగుణాలు. కనుక అటువంటి ఉత్తమ సద్గుణాలను ప్రతి ఒక్కరూ అలవరచుకోవాలి.

నాల్గవది సత్యం. "సత్యం నాస్తి పరోధర్మః" సత్యం కన్న పరమధర్మం లేదు. ఈనాడు లోకంలో చాలామంది 'సత్యం' అన్నా 'నిజం' అన్నా ఒకటేనని, తేడాలేదని భావిస్తున్నారు. యదార్థంగా ఈ రెండూ ఒకటికాదు. భగవాన్ బాబా వారు ఒక పర్యాయం దీనిని గురించి చక్కటి వివరణ యిచ్చారు. నీవు చూచినప్పుడు ఒక వ్యక్తి తలకు ఒక రుమాలును కట్టుకొని ఉండవచ్చు. లేక కంటి అద్దాలు పెట్టుకొని ఉండవచ్చు. అది అప్పటికి మాత్రమే నిజము. రెండవ పర్యాయం అదే వ్యక్తిని చూచినప్పుడు, ఆ రుమాలుగాని, కండ్ల అద్దములుగాని లేకపోవచ్చును. అనగా తాత్కాలికముగా నీవు చూచినది, విన్నది, అనుభవించినటువంటిదే నిజమని చెప్పవచ్చును. కాని 'సత్యం' అంటే త్రికాలములయందు మార్పు చెందనట్టిది. దేశకాలమాన పరిస్థితులను బట్టి అది మారదు. అందువలననే "త్రికాల భాజ్యం సత్యం" అన్నారు. సత్యము యొక్క అంతరార్థం తెలుసుకుందాం. సత్+ఇ+యం = సత్యం. 'సత్' అనగా ప్రాణము. 'ఇ' అనగా అన్నము. 'యం' అనగా సూర్యుడు. మానవత్వానికి ప్రాణం అత్యవసరం. ప్రాణం నిలబెట్టుకోవటానికి అన్నం అవసరం. అన్నింటికి సూర్యుడు అవసరం. ఈ త్రిపుటికి భగవంతుడు అవసరం. కనుక సత్యమే దైవము' (Truth is God). ఒక్క మాటలో చెప్పాలంటే మార్పు చెందనటువంటిదే నిజమైన సత్యం. మార్పు చెందనటువంటిది దైవత్వము మాత్రమే. అదియే ఆధ్యాత్మిక సత్యము.

"సత్యం జనవిరోధాయ, అసత్యం జనరంజనం" సత్యం చెబితే కొన్ని కొన్ని సందర్భాలలో జనానికి విరోధమవుతాం. అసత్యం అతి మధురంగా, అనందంగా, ఉల్లాసంగా ఉంటుంది. అలా అని సత్యం చెప్పకుండా ఉండటం మంచిదా ? కాదు. ఏమి చేయాలో పెద్దలు నుభవంతో ఈ క్రింది శ్లోకం చెప్పారు.

"సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్ సత్యమప్రియం
ప్రియంచ నా నృతం బ్రూయాత్
ఏషః ధర్మః సనాతనః"

అనగా సత్యమును పలుకవలెను. ప్రియమైన దానిని చెప్పవలెను. సత్యము అప్రియంగా చెప్పరాదు. ప్రియము గదాయని అసత్యమైనచో చెప్పరా ఇది సనాతన ధర్మము. యదార్థమైనప్పటికి, వాస్తవమైనప్పటికి, సత్యమ అయినప్పటికీ కటువుగా కుండబ్రద్దలు కొట్టినట్లు, నిర్మొహమాటంగా మాట్లాడరాదు. ఆ విధంగా పెడసరంగా మాట్లాడితే ఎదుటివా కోపం (offend) వచ్చే ప్రమాదం కూడా ఉంటుంది. బాధపడత కూడాను. సత్యం చెప్పడం వలన ఎదుటివాని మనస్సు దెబ్బతింటు, అసలు సత్యమును చెప్పరాదనే స్థాయికి మాత్రం పోరాదు. ఏ దుములోనూ అతిగా ప్రవర్తించరాదు. కనుక ఎదుటి వాని మనస్సు నొంచకుండా, మృదువుగా, నెమ్మదిగా సత్యం చెప్పడం నేర్చుకోవాలి. సుస్ఫూర్తితో వ్యవహరించాలి.

ఐదవ పాదం: నీతిలేని వాడు కోతితో సమానం. శీలం లేనివాడు చిల్లి కుండతో స. జాతికి నీతి ముఖ్యం. మనిషికి మాట ముఖ్యం. ఈనాడు మాటకు వలేదు. నోటికి అదుపు లేదు. మానవునిలో నీతి లోపించడం వలన స్పనమై పోతున్నాడు. పతనం కావటం తేలిక. పైకిరావటం మాత్రం. మనిషి మనీషిగా మారాలి, మానవుడు మాధవుడు కావాలి, పశుపతి కావాలి, మనిషిలో నైతిక, ఆధ్యాత్మిక,

శీలసంపత్తులు ఇనుమడించినప్పుడే ఇది సాధ్యమవుతుంది.

అయితే ఈనాడు సద్గుణాలకు నిలయుడు కావలసిన మానవుడు, దుర్గుణాలకు బానిస అవుతున్నాడు. నీతి నిజాయితీలకు తిలోదకాలిస్తున్నాడు. అసుర గణాలను పెంచుకుంటున్నాడు, సద్గుణాలకు స్వస్తి చెబుతున్నాడు, మానవతా విలువలను మంట కలుపుతున్నాడు ఇహము లేదు పరము లేదు. ఉభయభ్రష్టుడవుతున్నాడు. ఉత్తమోత్తమమైన మానవజన్మను నిరర్థకం గావించుకుంటున్నాడు. ఇది మారాలి. మానవుడు సచ్ఛీల సద్గుణ సంపన్నుడు కావాలి.

## నీతి

**ధనము వచ్చును పోవును ధరణి యందు**
**నీతి ధర్మాలు నిలుచును నిజముగాను**
**నీతిధర్మాలు హృదయాన నింపుకొన్న**
**సార్థకంబగు మానవ జన్మ భువిని** **22**

అన్నారు బాబా. ధనం శాశ్వతం కాదు. అది ఎప్పుడు వస్తుందో, ఎవరి వద్దకు వస్తుందో, ఎంతకాలముంటుందో ఎవరూ చెప్పలేరు. నీతి ధర్మాలు మాత్రమే శాశ్వతం. ఒక పర్యాయం మనిషిలో నీతి ప్రవేశిస్తే అనగా నీతి వంతుడైతే అతనికి ~~ఎనలేని కీర్తి~~ ప్రతిష్ఠలు వస్తాయి. జీవితం సార్థకమవుతుంది. *"Money comes and goes, But morality comes and grows"* (డబ్బు వస్తుంది, పోతుంది; కాని నీతి వస్తుంది, పెరుగుతుంది) అన్నారు బాబా. నీతిగలవాడే నిజమైన మనిషి. నీతికి మించిన ధనం వేరొకటి లేదు. నీతిలేని వాడు కోతితో సమానం. శీలం లేనివాడు చిల్లికుండతో సమానం. హృదయం లేనివాడు పశువుకన్నా హీనం. నీతిగల మానవునియందే వ్యక్తిత్వం వికసిస్తుంది. మానవుడు

తనలోని నైతిక వ్యక్తిత్వమును అభివృద్ధి పరచుకున్నప్పుడే దివ్యత్వమనే ఆత్మశక్తిని అనుభవించగలడంటారు బాబా. నీతి మానవుని ఉన్న స్థాయి నుండి ఉన్నత స్థాయికి గొనిపోయే రాజమార్గము. బాబావారు నైతిక విలువలకు అత్యున్నతమైన ప్రాధాన్యత నిస్తారు. మానవునికి ఎన్ని రకములైన భౌతిక సంపదలు ఉండినప్పటికీ, నైతిక బలం లేకపోతే ఏమాత్రం రాణించడు, శోభించడు. ఈనాడు మానవునిలో నీతి లోపించడం చేతనే పతనమైపోతున్నాడు. కేవలం నైతిక మార్గమే చాలదు. తికానికి తోడు ఆధ్యాత్మికం కూడా చేర్చాలంటూ బాబా ఒక చక్కటి దాహరణ చెప్పారు. మైకు చక్కటి కండీషన్‌లో ఉండినప్పటికీ కరెంటు పోతే పలుకదు. కరెంటు ఉండినప్పటికీ మైకు కండీషన్‌లో లేకపోతే ప్రాజనం లేదు. కనుక Positive మరియు Negative లు రెండునూ చ్చేుడే మైకు పలుకుతుంది. అవియే నైతిక ఆధ్యాత్మికములంటారు బా నీతి నిజాయితీలు రెండూ రెండు నేత్రాలవంటివి. కనుక నీతి నిజశీలను పెంపొందించుకొని, వాటిని హృదయంలో నింపుకొని, ధర్మంగా నడిచే మానవుని జన్మయే సార్థకమవుతుంది. ధనం ప్రధా-దు, గుణం ప్రధానం. కేవలం ధనబలం, భుజబలం, నైతిక బలమ్ము పెంపొందించుకొని ఈ మానవ జన్మను సార్థకం చేసుకో.

తి గౌరవంబు నీతిపై నిలుచును
లేకయున్న జాతి చెడును
గల్గు జాతి నిజమైన జాతిరా
ఓ భారతీయ వీర సుతుడా! 23

అన్నారు బా.క జాతి విలువ ఆ జాతి యొక్క సంపద మీదనే ఆధారపడి వు ఒక దేశం యొక్క విలువ ఆ దేశము యొక్క సైనిక శక్తి మీద-ారపడి వుండదు. ఒక దేశం యొక్క గొప్పదనం

ఆ దేశం యొక్క విశాల భూభాగం మీదనే ఆధారపడి ఉండదు. ఒక జాతి యొక్క ప్రతిష్ట ఆ జాతి యొక్క జనాభా మీదనే ఆధారపడి యినుముడించదు. జాతి గౌరవం ఆ దేశ ప్రజల నైతిక ప్రవర్తన మీద ఆధారపడి ఉంటుంది. "ప్రాణమునకు నీతి సారము. జీవితమునకు ఆదర్శము నీతి. నీతి లేకున్న జాతి చెడును. నీతియే నీ జాతి. అది వదలితివో నీవు కోతి కంటే హీనుడవవుతావు." అంటారు బాబా. నీతి లేనివాడు కోతి కంటే హీనుడే. కాని కోతి కూడా కొంతవరకు ఆదర్శమును అందిస్తున్నది. డార్విన్ శాస్త్రజ్ఞుడు "నేను లేక నీవు లేవు" అన్నాడు దీనిని గ్రహించడం చాలా కష్టం అయితే దీనిని కోతి సత్యముగా నిరూపిస్తూ వచ్చిందంటూ, కోతి మనోభావాలను చక్కగా విపులీకరించారు బాబా "ఓ మానవా! నేను లేక నీవు లేవు. ఆకారం ధరించిన నీ మనస్సే నే[illegible] కనుక జగత్తును మురిపింపజేసి; దైవాన్ని మరపింపచేసేది నేను. క[illegible] ఓ మానవా! నీ మనస్సే కోతినైన నేను. కానీ నీ కంటే ఉత్తముణ్ణి. [illegible] రామ సేవ చేశాను. నీవు కామ సేవ చేసినావు. నేను రామదాసుడ[illegible] చేత కాముడు నాకు దాసుడు. కాముడు రాక్షసుడు, రా[illegible] భగవంతుడు. చెట్టు, ఉడుత, పిట్ట - మేమంతా రామ సేవ చేసిన[illegible]. కాని మానవుడు చేసినదేమి? సీతను కష్టాలపాలు చేసినది. [illegible]ని అవస్థలపాలు చేసినది నీవే. నాకైనా క్షణమైన స్థిరముండునేమో [illegible]నీకు అదీ లేదు." అని కోతి మనోభావనలు వివరిస్తూ బాబా "మాన[illegible] కంటే కోతే మేలు" అన్నారు. వ్యక్తికి, సమాజమునకు, జాతికి, [illegible]నకు నీతి లేకున్న పతనమునకు దారి తీయును. ~~ఈ~~నాడు నీతి[illegible]ంచడం చేతనే మానవుడు క్షీణించుచున్నాడు. జాతికి నీతి ముఖ్[illegible] ఏ జాతి అయినా బాగుపడాలంటే ఆ జాతి ప్రజల ప్రవర్తన మీ[illegible]ధారపడి ఉంటుంది. నీతి లేనివాడు ఎంత గొప్ప మేధావి అయిన[illegible]ంత గొప్ప సైంటిస్టు అయినా, ఎంత గొప్ప రాజకీయనాయకుడైనా ప్ర[illegible]నం లేదు. అటువంటివారి వలన ఆ దేశమునకు ఏమాత్రం మం[illegible]రకపోగా,

అప్రదిష్ట వచ్చి తీరుతుంది. కనుక ప్రతి ఒక్కరూ నీతి నిజాయితీలను పెంపొందించుకొని జీవితమును సార్థకం చేసుకోవటంతోపాటు, జాతి గౌరవమును కూడా యినుమడింపచేయాలి.

**నీతి నియమాలు నరునకు ఖ్యాతి గూర్చు**
**బాల్యదశయందె యివ్వి పట్టుబడును**
**ఇట్టి రీతుల తెలిపెడు నట్టి జనుల**
**నేరి అధ్యాపకుల నొనరించరయ్య 24**

ఈ పద్యంలో భగవాన్ ఎట్టి అధ్యాపకులను ఎంపిక చేయాలో చెప్పారు. నీతి, నియమాలు (Morals & Principles) వ్యక్తి కీర్తి ప్రతిష్ఠలను పెంచివేస్తాయి, ఖ్యాతిని చేకూరుస్తాయి. ఇవి అంత తేలికగా ఎప్పుడు పడితే అప్పుడు అబ్బేవి కావు. వెల ఇస్తే బజారులో లభ్యమయ్యే వస్తువులు అంతకన్నా కావు. దీనికి సమయం సందర్భం అంటూ ఉన్నాయి. "శైశవేభ్యస్త విద్యానాం" బాల్యదశయందే ఇవి పట్టుబడుతాయి. అప్పుడే వీటిని అభ్యసించాలి. అప్పుడు నేర్చుకున్నవి అలవరచుకున్నవి మాత్రమే జీవితాంతం బాగా గుర్తుంటాయి. మనతో ఉంటాయి, మనల్ని సరియైన మార్గాన నడిపిస్తుంటాయి. మధ్యలో నేర్చుకున్నవి, అలవర్చుకున్నవి మధ్యలోనే పోతాయి. కనుక ప్రతి ఒక్కరూ అటువంటి అమూల్యమైన బాల్యదశను సద్వినియోగ పరచుకోవాలి. లౌకిక విద్యతోపాటు ప్రతి విద్యార్థి నీతినియమాలను కూడా అలవరచుకుంటే "విద్యావినయ శోభితుడు" అవుతాడు. సమాజంలో ఉత్తమ పౌరుడుగా జీవించడానికి అవసరమైన అర్హతను, యోగ్యతను సంపాదించిన వాడవుతాడు తద్వారా మంచిపేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. అట్టివారు ఉన్నతమైన పదవుల నధిష్ఠించగలుగుతారు.

నీతి నియమాలుగల మానవునియందే వ్యక్తిత్వం వికసిస్తుంది. క్రమబద్ధమైన, నియమబద్ధమైన జీవితాన్ని గడిపేవారికి మాత్రమే వ్యక్తిత్వ వ్యక్తీకరణ అధికారం ఉంటుంది. నైతిక వ్యక్తిత్వమును అభివృద్ధిపరచు

కొన్నప్పుడే, దివ్యత్వమనే ఆత్మశక్తిని కూడా అనుభవించవచ్చునంటారు బాబా. విచక్షణ ప్రతిబింబమే నీతి. మానవుని పవిత్ర నడతలతో కూడిన దివ్యమైన మాధుర్య సారమే 'నీతి' అంటారు బాబా. నీతి నియమాలు లేని మనిషికి సమాజంలో ఏ మాత్రం గౌరవముండదు.

అసలు ఇటువంటి అమూల్యమైన నీతులు ఎవరు బోధించాలి? ఇంటి వద్ద తల్లిదండ్రులు, విద్యాలయాలలో అధ్యాపకులు. అయితే ఈనాడు వీరిరువురూ తమ బాధ్యతలు గుర్తించవలసిన స్థాయిలో గుర్తించక పోవటం వలన విద్యార్థులలో క్రమశిక్షణారాహిత్యం పెచ్చు పెరిగి పోతున్నది. కనిన తల్లిదండ్రులను ఎలాగో మార్చలేము కాబట్టి, ఎంపిక చేసే ఉపాధ్యాయుల విషయములలోనయినా ముందుగా జాగ్రత్త పడాలి. అందువలననే భగవాన్ బాబావారు స్థాపించిన విద్యాలయాలలో అధ్యాపకుల Selection విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుంటారు. ఎవరిని పడితే వారిని తీసుకోరు. భగవాన్ బాబావారు Duty, Discipline, Devotion లకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. ఇవి విద్యార్థులలోకన్నా ఉపాధ్యాయులలో తప్పనిసరిగా ఉండవలసిన సద్గుణము అని బాబావారి అభిప్రాయం. ఉపాధ్యాయులు క్రమశిక్షణతో తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించకపోతే విద్యార్థులు చెడిపోతారు. ఉపాధ్యాయులలో నీతి నియమాలు లోపిస్తే, విద్యార్థులు కూడా అదే విధంగా తయారవుతారు. అందువలన బాబావారు తరచుగా ఉపాధ్యాయుల శిక్షణా తరగతులను నిర్వహిస్తూ, వారికి నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక విలువలను ప్రబోధిస్తుంటారు. ఈ పద్ధతిని అన్ని విద్యాలయాలవారు అనుసరిస్తే బాగుంటుంది. విద్యార్థులు బాగుపడాలంటే ముఖ్యంగా అర్పణభావం (Dedication) తో పనిచేసే అధ్యాపకులను విద్యాలయాలలో నియమించాలి. ప్రతి విద్యాలయంలో విధిగా Moral Classes ను నిర్వహిస్తూ, విద్యార్థులలో నైతిక విలువలను పెంపొందించే ప్రయత్నం కూడా జరగాలి.

# ఐకమత్యము

**చీమ స్వార్థంబు కల్గిన జీవి కాదు**
**పెక్కు చీమలు గుమిగూడి మెక్కుచుండు**
**దాని కున్నట్టి బుద్ధి యీ మానవులకు**
**కలుగదేమిటి చిత్రమీ కలియుగమున 25**

అన్నారు బాబా. ఒక చిన్న బెల్లం ముక్కను ఒక చీమ చూస్తే అది మాత్రమే తినదు. కొన్ని వందల చీమలను చేర్చి అన్నీ కలిసి మోసుకొని పోయి కలిసి తింటాయి. నాలుగు ఎంగిలి మెతుకులను చూచిన కాకి తానొక్కటి తినదు. "కా.... కా....." అని పది కాకులను చేర్చి కలిసి తింటాయి. అయితే మానవుడు మాత్రం తద్విరుద్ధంగా ప్రవర్తిస్తాడు. ఏదైనా ఒక వస్తువు బజారులో దొరుకుతే, ఎవరికీ చెప్పకుండా తానే దానిని సంగ్రహించి, దాచి పెట్టుకుంటాడు. పరులకు చూపించడు. చెప్పడు, పెట్టడు. చీమలలో కాకులలో ఉన్న ఉదారబుద్ధి, సంఘీభావం మానవులలో ఏమాత్రం కనిపించడం లేదు. ఒక పర్యాయం బాబావారు *"కాకులు, చీమలలో ఉన్నది ఐకమత్యం. కాని ఈనాటి మానవులలో ఆ Unity (ఐకమత్యము) లేకుండా పోయింది. Purity (పవిత్రత) అంతకన్నా లేదు. Divinity (దివ్యత్వం) అసలే లేదు. నేడున్నదల్లా Community (కులం) మాత్రమే"* అని తమ ఆవేదనను వెలిబుచ్చారు. బాబా కోరేది ఐక్యమత్యం. మానవులంతా ఒకే కులమని బాబా విశ్వాసం సర్వమత సమన్వయం బాబా అభిమతం, ఐక్యమత్యమే మహా బలం. ఇట్టి ఏకత్వమనే నిత్య సత్యాన్ని అనుభవించుటకు ప్రయత్నించాలంటారు బాబా. *"మా కులం... మా కులం..... మీ కులం.... ఏ కులం? గంగదేకులం? నిప్పుదేకులం? గాలిదేకులం? వీటికి కులాలే లేవే? కనుక మన కులం మానవ కులం. మన జాతి మానవ జాతి. అందరూ మానవులే. ఈ సత్యాన్ని మనం*

గుర్తించాలి. దేహాన్ని బట్టి - కులాలు, మతాలు, తెగలు, వర్ణాలు వచ్చాయి గాని, నిజంగా ఆత్మకు ఎట్టి కులం లేదు. ఉన్నది ఒకే కులం. అదే మానవత్వం, అదే దివ్యత్వం, అదే దైవత్వం" అని అంటారు. కుల పిచ్చితో కుమ్ములాడుకుంటున్న ఈ రోజులలో, మతాల పేరిట మారణహోమం చెలరేగుతున్న ఈ దుర్దినాలలో బాబా సందేశం ఆలకించి, ఆచరిస్తే నిజంగా జాతీయ సమైక్యతను సాధించినవారమవుతాం, వివిధ జాతుల మధ్య, దేశాల మధ్య శాంతియుత వాతావరణమును నెలకొల్పినవారమవుతాము. కనుక ప్రతి ఒక్కరు ఇటువంటి విశాల భావాలను పెంపొందించుకోవాలి.

## మూర్ఖుడు

**తుప్పు పట్టిన దానిని తుడువవచ్చు**
**పొట్టు విత్తనముల విడగొట్టవచ్చు**
**కోరి అజ్ఞానమును తరుమంగవచ్చు**
**కాని మూర్ఖుని సంధింపకాదు సుమ్మి 26**

అన్నారు బాబా. బాగా తుప్పుపట్టిన పాత్రను సహితము, చింతపండు పెట్టి బాగా తోమిన యెడల, నల్లని తుప్పు పోయి, ధగధగ మెరుస్తుంది పాత్ర. వడ్లను రోటిలో వేసి త్రొక్కిన గాని, మిషన్‌లోపోసి ఆడించిన గాని, పై పొట్టు పోయి తెల్లని బియ్యం మనకు లభ్యమవుతుంది. అదే విధంగా ప్రయత్నముతో మనిషిలో ఉన్న అజ్ఞానమును పారద్రోలి జ్ఞాన జ్యోతులను వెలిగించవచ్చును గాని మూర్ఖుల మనస్సును మాత్రం మార్చటం దుర్లభం. సామాన్యంగా దొరకని వస్తువులను కూడా అతి కష్టంతో సాధించవచ్చును. చేయనలవి కానికార్యములను కూడా ఏదో విధంగా సాధించవచ్చును గాని మూర్ఖుని చిత్తమును మాత్రం మార్చలేము. మూర్ఖుడనగా ఎవరు? తనకు తోచదు, ఎవరైన చెబితే వినడు.

మొండితనం మూర్ఖుని ప్రధాన లక్షణం. "మూర్ఖజన చిత్తము దెల్పనసాధ్యమెరికిన్" అంటూ భర్తృహరి చక్కటి ఉదాహరణతో మూర్ఖుని విషయం వివరించాడు.

తివిరి యిసుమునఁ దైలంబు దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖుల మనము రంజింపరాదు.

కటికి ఇసుకనుండి కూడా, ఏదైనా యంత్ర సహాయంతో కష్టపడి చమురు తీయవచ్చును. ఎండమావుల యందు కూడా నీరు త్రాగవచ్చును. అడవులలో తిరిగి తిరిగి ఏదో ఒక రోజున కుందేటి కొమ్మును కూడా సాధించవచ్చును గాని మూర్ఖుని మనస్సును సమాధాన పెట్టుట మాత్రం ఎవరికీ శక్యము కాదు. అసాధ్యమైన పనిని కూడా ధైర్యంతో, పట్టుదలతో, వివేకంతో సాధించవచ్చును గాని, మూర్ఖుని మనస్సును మాత్రం మార్చలేము. ఈ భూ ప్రపంచములో దేనినైనా సాధించవచ్చును గాని మూర్ఖునిలో మాత్రం పరివర్తన తీసుకొనిరాలేం. కనుక మనం అటువంటి మూర్ఖ శిఖామణులకు దూరంగా ఉండటమే మంచిది.

## ఖలుడు

**మదగజంబు బట్టి మరి అంకుశము మందు**
**మహిషములను తోల బడిత మందు**
**వ్యాధి తోల మందు వరరసాయనమది**
**ఖలుని మార్చ మందు కలదె భువిని.** 27

మదించిన మత్తేభము (ఏనుగు) నకు మందు అంకుశం. మృగములలో కెల్ల భారీకాయం కలిగిన మదించిన ఏనుగును చిన్న అంకుశంతోనే లొంగతీసుకొనవచ్చును. బాగా బలిసిన దున్నపోతులను కూడా బడితను చూపించి అదిలించి నడిపించవచ్చును. దీర్ఘ వ్యాధితో బాధపడే వ్యాధిగ్రస్తుడికి దివ్య ఔషధము నిచ్చి అతని వ్యాధిని నివారించ వచ్చును. కాని దుర్మార్గుని, దుష్టుని, నీచుని (ఖలుని) మార్చటం మాత్రం అసాధ్యం. ఈ జగత్తులో ఖలుని మార్చటానికి మందే లేదని భగవాన్ బాబావారు చెప్పారు.

"*ఖలుని గుణము మాన్పు ఘనులెవరు లేరు*" అని వేమన కూడా ఏనాడో చెప్పాడు. విషజంతువైన పాము కూడా నాగస్వరం వాయిస్తుంటే తన్మయత్వంతో పడగవిప్పి నాట్యం చేస్తుంది. సర్కస్‌లో రింగ్ మాస్టర్ కొరడాను చూపించి, భయపెట్టి, క్రూరమృగమైన పులిని, పిల్లిగా ఆడించగలుగుతాడు. చిన్ని అంకుశం చూపించి మావిటీవాడు ఏనుగు చేత అడవిలో దూలాలను మోయించగలుగుతాడు. బడితను చూపించి రైతు దున్నపోతుచేత బండి లాగించగలుగుతాడు. వైద్యుడు ఔషధ మిచ్చి వ్యాధిని నయం చేయగలుగుతాడు గాని ఈ జగత్తులో ఖలుని (నీచుని, దుర్మార్గుని, దుష్టుని) మార్చగలవారు మాత్రం లేరు. కనుక దుష్టులకు దూరంగా ఉండటం మంచిదంటారు అనుభవజ్ఞులు. నీచ స్వభావం గలవారిని దరికి చేరనీయరాదంటారు విజ్ఞులు.

## పాపి

**కలిమి కలుగునాడు కైలాసపతినైన**
**ధిక్కరించి పాపి తిరుగుచుండు**
**కలిమి తొలగి చనిన కనపడు లోకంబు**
**వినుము భారతీయ వీరసుతుడ** 28

ఈ పద్యములో భగవాన్ బాబావారు కలిమిలేముల స్థితిని చక్కగా వర్ణించారు. సామాన్యంగా కలిమి కలిగినప్పుడు కళ్లు పైకిపోతాయి. అప్పటివరకు వెంటనున్న వారు కనిపించరు. పేదరికంలో ఉన్నప్పుడు సహాయం చేసిన వారిని లెక్కపెట్టరు. చిట్టచివరికి భగవంతుని కూడా లక్ష్యపెట్టరు. "కలవారింటి ఆడపడుచుకు కాకరకాయ కానరాదు" అనే సామెత ఎంతో అనుభవంతో చెప్పబడింది. కలిమి కలిగినప్పుడు కైలాసపతిని కూడా లెఖ్ఖచేయరు. అంతా నా ప్రతిభ వలననే సంపాదించ గలిగానని విర్రవీగుతుంటారు. దురదృష్టవశాత్తు కలిమి తొలగి చనిన వెంటనే కళ్ళమీద నున్న పొర తొలగిపోతుంది. అప్పుడు జ్ఞానోదయ మవుతుంది. అప్పుడు కనిపిస్తుంది లోకము.

ఇదే వాస్తవమును ఈ క్రింది పద్యంలో వేమన స్పష్టం చేశాడు.

"ధనమెచ్చిన మదమెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధనముడిగిన మదముడుగును
మదముడిగిన దుర్గుణంబులు మానును వేమా"

ధనంతో మదం, మదంతో దుర్గుణాలు పెరుగుతాయి. ధనముడిగితే మదముడుగుతుంది. మదముడిగితే దుర్గుణాలు దూరమవుతాయి. ఇది సహజం. ఇదే వాస్తవమును వేమన మరో పద్యంలో చెప్పాడు.

"తనకు లేనివాడు దైవంబు దూరును
తన్ను గల్గనేని దైవమేల
తనకు దైవమునకు తగులాట మెట్టిదో
విశ్వదాభిరామ వినురవేమ"

కలిమి లేనప్పుడు దైవమును దూషిస్తారు. కలిమి తగిలినప్పుడు ఆ దైవమును గురించి ఆలోచించనే ఆలోచించరు. ఇది మూర్ఖుల లక్షణం.

ఇది విజ్ఞత లక్షణం అంతకన్నా కాదు. కలిమికి పొంగరాదు, లేమికి క్రుంగరాదు. ఇదే విజ్ఞుల లక్షణం.

## లోభి

సౌఖ్యమనుభవింప చాలని లోభికి
ఎంత కలిమియున్న నేమి ఫలము ?
నీరు గతుకు కుక్క ఏరెంత పారిన
ప్రీతి చెందబోడు పిసినిగొట్టు 29

ఈ పద్యంలో భగవాన్ బాబావారు చక్కటి ఉపమానం పేర్కొనినారు. అసలు లోభి (Miser) అంటే ఎవరు ? ఎంత ఉన్నా తాను అనుభవించడు అనుభవించే వారిని చూచి ఓర్వలేడు. తాను తినడు, ఇతరులకు పెట్టడు. ఇటువంటి లోభికి ఎంత సంపద ఉన్నా ఏమి ప్రయోజనం ? నదిలో ఎంత నీరు పారుతున్నా, కుక్క ఆ నీటిని త్రాగదు, పీల్చదు, నీటిలో నాలుక పెట్టి గతుకుతుంది. అదే విధంగా పిసినిగొట్టు వద్ద సంపద ఉన్నా దానిని ఆనందంగా అనుభవించి ప్రీతి చెందడు, సంతుష్టి పడడు, సంతృప్తి నొందడు. ఆ సంపదను అనుభవిస్తే ఎక్కడ తరిగిపోతుందేమోననే భయంతో, అనుభవించకుండా, ఖర్చు చేయకుండా దానికి కాపలా కాస్తుంటాడు. "లోభి సొమ్ము లోకుల పాలు" అనే సామెత ఎంతో అనుభవంతో చెప్పబడింది. లోభి దాచిన సొమ్ము ఏదో ఒక రోజున దొంగలు దొంగిలించవచ్చు, లేక అగ్నికి ఆహుతి అయినా కావచ్చును. పన్నులు విధించి ప్రభుత్వం స్వాధీనం చేసుకోవచ్చును, ఒకవేళ లోకులు కాజేసినా ఆశ్చర్యపడనవసరంలేదు. నీరు ఏరై పారుతున్నా కుక్క గతుకుతునే ఉంటుంది. అదేవిధంగా లోభి లేక పిసినిగొట్టు వద్ద ఎంత సంపద ఉన్నా దానిని తిని అనుభవించి, ఆనందించక చూచి లొట్టలు వేస్తుంటాడు. ఇదే

భావము భాస్కరశతకములోని ఈ క్రింది పద్యములో కూడా వివరించబడింది.

*"అతి గుణహీనలోభికిఁ బదార్థము గల్గిన లేకయుండినన్*
*మితముగఁగాని కల్మిగల మీఁదటనైన భుజింప డింపుగా*
*సతమనినమ్మ దేహమును సంపద; నేఱులునిండి పాఱినన్*
*గతుకగఁ జూచుఁ గుక్క తన కట్టడ మీఱక*
*నెందు భాస్కరా !"*

తనకు లేనప్పుడు తక్కువగా తినటం సహజమే, ఉన్నప్పుడు కూడా కడుపునిండా తినకుండా కేవలం మంచినీటితో కడుపు నింపుకొనే వాడిని "లోభి" అని అంటారు. తాను తినక, ఇతరులకు యివ్వక యావత్ సంపదను కూడబెట్టు లోభికి ఏ మాత్రం మనశ్శాంతి కూడా ఉండదు. ఆ సంపద కూడా ఏదో ఒకరోజున, ఏదో ఒక రూపంలో హరించుకొని పోతుంది. *'లోభికి మూట నష్టి'. 'లోభికి నాలుగందాల నష్టం'* అనే సామెతలు కూడా ఎంతో అనుభవంతో చెప్పబడినవే.

# కోపములు

**కోపము కలిగిన వానికి**
**ఏ పనియు ఫలింపకుండ ఎగ్గులు కలుగున్**
**పాపము పనులన్ చేయుచు**
**ఛీ పొమ్మనిపించుకొనుట చేకూరును సుమీ.** 30

"తన కోపమే తన శత్రువు" అన్నాడు సుమతి. శాస్త్ర విజ్ఞానం ద్వారా ఆలోచిస్తే, ఒక పర్యాయము కోపానికి గురియైతే మూడు నెలల్లో మనం అన్నం తినటం ద్వారా లభించిన శక్తి హరించుకొనిపోతుందట.

కోపంతో ఉన్న తల్లి తన బిడ్డకు పాలిస్తే, ఆ పాలు తన బిడ్డను చంపివేయగల శక్తివంతమైన విషంగా మారుతాయట. కోపం గనుక వస్తే శరీరం వేడెక్కుతుంది. రక్తప్రసరణ వేగం పెరుగుతుంది. నరాల బలహీనత కూడా ఏర్పడుతుంది.

బాగా కోపం వస్తే మనల్ని మనమే మరచిపోతాము. ఏమి మాట్లాడుతామో మనకే తెలియదు. ఏమి చేస్తామో అంతకన్నా తెలియదు. కొన్ని కొన్ని సందర్భాలలో మన గౌరవ ప్రతిష్ఠలకే భంగం వాటిల్లుతుంది. 'కోపాగ్ని' అన్నారు గదా! కోపమును అగ్నితో పోల్చారు. ఎంతో శ్రమించి, కష్టపడి సంపాదించుకొన్న దివ్యశక్తులన్నీ 'కోపాగ్ని' వలన క్షణంలో భస్మీపటలం అయిపోతాయి. కోపము వలన విజ్ఞతను కోల్పోతాము. కోపము వలననే విశ్వామిత్రుడు ఎంతో నష్టపోయినాడు. ఇదే వాస్తవమును ఈ వేమన శతక పద్యము కూడా చాటుచున్నది.

*"కోపముననను గనత కొంచమై పోవును*
*కోపముననను మిగుల గోడుగలుగు*
*గోపమడచెనేని గోర్కెలు నీడేరు*
*విశ్వదాభిరామ వినురవేమ."*

కోపం పాపానికి సోపానం, తాపానికి మూలం. ఆవేశం తెస్తుంది, అనర్థాలను తెచ్చిపెడుతుంది, అపకీర్తిపాలు జేస్తుంది. అయితే తప్పుచేస్తే కోపం రావటం సహజం. అయితే అది తీవ్రంగా మారక మునుపే విచక్షణతో దానిని అరికట్టే ప్రయత్నం చేయాలి. కోపాగ్నిని చల్లార్చటానికి 'మౌనం' ఒక్కటే సరియైన మందు. కోపం వచ్చినప్పుడు కండ్లు మూసుకొని కొంతసేపు మౌనం వహిస్తే తీవ్రత తగ్గుతుంది. ప్రశాంతంగా ఆలోచించ గలుగుతాం.

# సంకల్పములు

అల్పజీవియు మంచి సంకల్పమున్న
గొప్ప గౌరవాదరము గైకొనగలడు
ఉడుత బుడుత రాముని ప్రేమ నొందలేదె
ఇంతకన్నను వేరెద్ది ఎఱుక పఱతు 31

అన్నారు బాబా. సంకల్పం ప్రధానం. అది సత్సంకల్పమై ఉండాలి. మంచి సంకల్పం చిన్న జీవిలో ఉన్నా మంచి పేరు ప్రతిష్ఠలను తెచ్చుకుంటుంది. గొప్పవాని మనస్సులో చెడు సంకల్పం జేరితే, అది అపకీర్తినే తెచ్చిపెడుతుంది. ఇక్కడ ఆకారం ప్రధానం కాదు. అది సత్సంకల్పమా? లేక అది దుస్సంకల్పమా? సత్సంకల్పం అల్పజీవిలో కలిగినా గొప్ప గౌరవాదరాభిమానములను తెచ్చిపెడుతుంది. దుస్సంకల్పం ఎంతటి మేధావిలో చేరినా, ఎంతటి గొప్పవానిలో చేరినా, అతని గౌరవ మర్యాదలు ఆనాటితో మంటకలిసిపోతాయి. భగవాన్ బాబావారు యిక్కడ చక్కటి ఉదాహరణ చెప్పారు. ఉడుత చాలా చిన్న జంతువే అయినప్పటికీ శ్రీరామచంద్రుని ఆదరాభిమానములను పొందినది. ఉడుత చేసిన పని చాలా చిన్నది అయినప్పటికీ మంచి సంకల్పంతో పని చేసింది. శ్రద్ధాభక్తులను ప్రదర్శించింది. శక్తివంచన లేకుండా కృషిచేసింది. శ్రీరాముడు సముద్రంలో వారధి కట్టాలని నిర్ణయించుకున్నాడు. కోతులు అండగా నిలిచాయి. అక్కడికి ఉడుత కూడా వెళ్ళింది. నీళ్లలో మునగడం, ఇసుకలో దొర్లడం, వారధి కట్టే చోటుకు వెళ్ళి వంటికి అంటిన ఇసుకను విదిలించడం చేసేది. ఆ విధంగా నిత్యమూ ఉదయం నుంచి సాయంత్రం వరకు చేసిదిట. శ్రీరాముడు దీనిని గమనించాడు. ఉడుత యొక్క కర్తవ్య పరాయణత్వాన్ని మెచ్చుకొని ఉడుతను దగ్గరకు తీసుకొని ప్రేమతో

నిమిరాడుట. అప్పటినుంచే ఉడుత శరీరంమీద శ్రీరాముని చేతివ్రేళ్ళ చారలు బడ్డాయని చెబుతుంటారు. 'ఉడుతా భక్తి' అనే సామెత ఆనాటినుంచే ప్రచారంలోనికి వచ్చి ఉండవచ్చును. ఉడుత చేసింది బహు స్వల్పం. రోజల్లా శ్రమపడినా ఉడుత చేరవేసిన ఇసుక తట్టెడుకన్నా ఎక్కువ ఉండదు. ఎంత పనిచేసిందనేది ప్రధానం కాదు. ఎంతటి శ్రద్ధాభక్తులతో చేసిందనేది ప్రధానం. కనుక మన ఆలోచనలు, మన సంకల్పాలు మంచివిగా, పవిత్రమైనవిగా, స్వార్ధరహితంగా ఉంటే మన మాటలూ, మన చేతలూ వాటినే అనుసరించి మనకు మంచి గౌరవాదరాభిమానములను తెచ్చిబెడుతాయి. అయితే ఈనాడు తద్విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు.

**దుష్టసంకల్పముల చేత దుఃఖితుడగును**
**సత్యసంకల్పముల చేత సాధువగును**
**సకల సంకల్ప శూన్యుడే శాంతినొందు**
**సత్యమును తెలుపుబాట శ్రీ సాయి మాట** 32

'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' బంధమునకు, మోక్షమునకు మన మనస్సే కారణం. మంచిచెడ్డలకు, సుఖ దుఃఖములకు మన మనస్సే మూలం. సర్వ సంకల్పములకూ మూలం మన మనస్సే. "సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్తి" అంటారు బాబా. సంకల్పము యొక్క శక్తి కఠినమైన రాతి కంటె మరింత కఠినంగా ఉంటుంది. మన అదృష్టం, మన దురదృష్టం మన సంకల్పములపైననే ఆధారపడి ఉంది. దుష్ట సంకల్పములచేత మానవుడు దుఃఖితుడగును. ఉత్తమస్థాయి నుండి అధమ స్థాయికి త్రోయబడును. సత్సంకల్పముల చేత మానవుడు సాధుగుణములను అలవరచుకొనును. ఉన్న స్థాయి నుండి ఉన్నత స్థాయికి కొనిపోబడును.

సత్సంకల్పములు, సదాలోచనలు, సద్భావములను అభివృద్ధి పరచుకున్నప్పుడు మానవుని యొక్క మనస్సు పరిశుద్ధమైనదిగా ఉంటుంది.

పరిశుద్ధమైన, నిర్మలమైన మనస్సు ఉండినప్పుడే పరిశుద్ధమైన, పవిత్రమైన కర్మలు ఆచరిస్తారు. పరిశుద్ధమైన, పవిత్రమైన కర్మల వలన పరిశుద్ధమైన, పవిత్రమైన ఫలితమే మనకు ప్రాప్తిస్తుంది.

"సంకల్పమనే బీజమును నాటి కర్మలనే ఫలమును పొందుతున్నాము. కర్మబీజమును నాటి స్వభావమనే ఫలమును పొందుతున్నాము. శీలమనే బీజమును నాటి అదృష్టమనే ఫలమును పొందుతున్నాము. సంకల్పము మొదలుకొని అదృష్టము వరకూ మానవుని యొక్క ప్రభావము ఈ విధంగా ప్రసరిస్తూ వస్తుంది. కనుక మన అదృష్టాదృష్టములు మన సంకల్పములపైననే ఆధారపడి ఉన్నాయి" అని అంటారు బాబా.

మనస్సు నిర్మలం, బుద్ధి నిశ్చలంగా ఉన్నప్పుడు సరియైన సముచితమైన నిర్ణయాలను గైకొనగలుగుతాము. సత్ఫలితాలను అందుకోగలుగుతాం. ఒకవేళ మన మనస్సు మలినమైతే మన భావాలు దుర్భావనలు అవుతాయి. మన ఆలోచనలు దురాలోచనలవుతాయి. దుష్ఫలితాలను అందిస్తాయి.

'సంకల్పమే ప్రధానమైన సూత్రం, సంకల్పమే మానవునకు ప్రధానమైన ప్రాణం" అంటారు బాబా. మానవుడు పరుల యొక్క కీడు కోరి అనేక దుష్టసంకల్పములు గావించుకుంటాడు. అవి ఎదుటివానికి కీడు చేసిన్పటికినీ, అంతకంటే పదింతలు తిరిగివచ్చి తనకే కీడు చేస్తాయి. ఈ సత్యము మానవుడు గుర్తించలేకపోతున్నాడు. సర్వులయందూ ఉన్న దివ్యత్వాన్ని గుర్తించలేక, ఎదుటి వ్యక్తిని హీనమైన రీతిగా హింసించడానికి ప్రయత్నిస్తున్నాడు మానవుడు. పరులను బాధిస్తున్నాడనుకుంటున్నాడు గాని పరమాత్మనే బాధిస్తున్నాడు. ఈ వాస్తవాన్ని విస్మరిస్తున్నాడు.

అసలు శాంతి అంటే ఏమిటి ? తనలోని తప్పులను, ఎవరు వేలెత్తి చూపినా, ఏమాత్రం ఉద్రేకపడక సంతోషంగా కృతజ్ఞత నందించేది

'శాంతి'. ఇది సర్వసంకల్ప రహితునకే సాధ్యపడుతుంది. అనగా ప్రేమతో హృదయం విచ్చుకున్నప్పుడే ఇది సాధ్యపడుతుందంటారు బాబా. *"ఇంద్రియ నిగ్రహమే నిశ్చల శాంతి నిచ్చును. శాంతి ప్రశాంతిని తెచ్చును. ప్రశాంతియే పరంజ్యోతి"* అన్నారు బాబా. 'ప్ర' అనగా వికసింపజేయుట. 'శాంతి' అనగా కామక్రోధ రాహిత్యము. కామక్రోధరాహిత్యమును వికశింపజేయుటే 'ప్రశాంతి' అంటారు బాబా. యిది శాంతి బాహ్య ప్రపంచంలో దొరికేది కాదు. దానిని మన హృదయమునందే వెదికి సంపాదించుకోవచ్చును. *"శాంతి కావాలంటే సంకల్ప శూన్యులు కావాలి. అందరిలో నున్న ఆత్మస్వరూపం ఒక్కటేనన్న సత్యాన్ని గుర్తించాలి. భేదభావమనే భ్రాంతితోపాటు దేహభ్రాంతిని కూడా దూరం చేసుకోవాలి"* అంటారు బాబా.

కనుక దుష్ట సంకల్పాలను దూరం గావించుకొని, సత్సంకల్పాలను అభివృద్ధి పరచుకోవటానికి ప్రయత్నిస్తూ, చిట్టచివరికి సంకల్ప శూన్యస్థితికి చేరుకొని మనశ్శాంతిని పొందుదాం. ప్రపంచ శాంతికి తోడ్పడుదాం.

## మంచి నడత

**మంచికాలము పదవులు మంచి బ్రతుకు**
**కోరుచుందురు మనుజులు కోరబోరు**
**మంచిబుద్ధులు జ్ఞానంబు మంచి నడత**
**ఇంతకన్నను వేరెద్ది ఎఱుక పఱతు** 33

అన్నారు బాబా. ఈనాడు మానవులు అర్హత ఉన్నా లేకపోయినా ఉన్నత పదవులను ఆకాంక్షిస్తున్నారు, బాగా సంపాదించి సంపన్నులు కావాలని కోరుకుంటున్నారు. దీనికోసం చేయరాని పనులు చేస్తున్నారు, అక్రమ,

అనాచార, అవినీతి పద్ధతులను అనుసరిస్తున్నారు. సద్బుద్ధి, సత్ప్రవర్తన పెంపొందించుకోవటానికి ఏమాత్రం ప్రయత్నించటం లేదు, జ్ఞానసముపార్జనకు ఈషణ్మాత్రం కృషి సల్పడంలేదు. తాత్కాలిక సుఖములను కోరుకుంటున్నారేగాని, శాశ్వతమైన ఆనందమును అభిలషించడంలేదు. కారణం ? సద్బుద్ధి సత్ప్రవర్తన అలవడటం బహుకష్టం. జ్ఞానసముపార్జన అంత తేలికకాదు. "జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః" జ్ఞానహీనులైనవారు పశువులతో సమానం జ్ఞానవిజ్ఞానములతో సమానమైనది ప్రపంచంలో మరొకటిలేదు. "న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" అన్నది భగవద్గీత. ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానముగా పవిత్రమైనది లేనేలేదు. ఈ ప్రపంచములో అతి ప్రియమైన వస్తువులు ఎన్నో ఉన్నాయిగాని, పవిత్రమైనవి మాత్రం చాలా తక్కువ. అట్టి పవిత్రమైన జ్ఞానమును, మానవునికి వెలుగును ప్రసాదించేటటువంటి పరమోత్కృష్టమైన జ్ఞానమును జీవితకాలంలో ప్రతి వ్యక్తి సంపాదించి తీరాలి. జ్ఞానమే జీవులకు చరమ లక్ష్యం. అట్టి పవిత్రమైన లక్ష్యమును విడనాడి, తాత్కాలికమైన సుఖములను కోరుకొని ధన సంపాదన వ్యామోహంలో పడిపోతున్నారు మానవులు. జీవితం మంచుగడ్డ వంటిది. అది క్షణానికి కరిగిపోతుంటుంది. అది కరగకముందే జాగ్రత్త పడాలి. మానవ జీవిత ప్రయాణానికి మార్గమే కాకుండా, గమ్యాన్ని కూడా సూచిస్తున్నారు భగవాన్ బాబా. సద్బుద్ధి, సత్ప్రవర్తన మాత్రమే మానవ జీవిత లక్ష్యమని భగవాన్ బాబావారు పలు పర్యాయములు హెచ్చరిస్తున్నారు. కనుక అటువంటి ఉన్నత విలువలను అలవరచుకొని జీవితాన్ని ప్రతి ఒక్కరూ సార్థకం చేసుకోవాలి.

# మంచి మాట

దేవ దేవుని సేవకె దేహ మమరె
కనుక దేవుని దాసుడై మనగవలయు
విషయదాసులు కాకుడు వసుధలోన
సత్యమును చూపు బాట శ్రీ సాయి మాట. 34

అన్నారు బాబా. ఈ సృష్టి స్థితిలయలకు మూలకారకుడైన దేవదేవునికి సేవ చేయడానికే ఈ దేహం ఏర్పడింది. కనుక ఇటువంటి పవిత్రమైన మానవ జన్మను సద్వినియోగం చేసుకోలేకపోతున్నాం. విషయ వాంఛలకు దాసులమైపోతున్నాం. దైవమునకు దాసులం కాలేకపోతున్నాం, దూరమవుతున్నాం. "పరోపకారార్థ మిదం శరీరం" అని పురాణాలు ఘోషిస్తున్నాయి. పరోపకార నిమిత్తమే ఈ శరీరం ఏర్పడింది. "మానవ సేవే మాధవ సేవ" అన్నారు. కనుక తోటి మానవులకు సేవ చేసినచో మాధవుని సేవించినట్లే అవుతుంది. "సర్వజీవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవికి నమస్కరించినా కేశవుని (భగవంతుని) కే వర్తిస్తుంది. ఏ జీవికి సేవచేసినా భగవంతునికి సేవ చేసినట్లు అవుతుంది. "భగవన్నామం చేసే పెదవుల కంటే, పరోపకారం చేసే చెయ్యి గొప్ప" అన్నారు బాబా. కనుక ఎన్ని లౌకిక విద్యలు నేర్చినప్పటికీ, పరోపకార బుద్ధిని అలవరచుకొనని యెడల ప్రయోజనం శూన్యం. పరోపకారమనగా ఎట్టి ఫలాపేక్షను ఆశించకుండా పరులకు నిస్వార్థ బుద్ధితో సేవచేయటం పరులకు సేవ చేయడమంటే పరమేశ్వరుని పూజించడమే అవుతుంది. "పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనమ్" దీనిని విస్మరించరాదు. అష్టాదశ పురాణములు దీనినే బోధిస్తున్నాయి. మానవాభ్యుదయానికి పరోపకార బుద్ధిని అందరూ పెంపొందించుకోవాలి. "ఒకరికి ఉపకారం చేయటానికి వీలుకాకపోతే నోరుమూసుకొని కూర్చోవాలి. అపకారం మాత్రం

చేయకూడదు. అపకారం చేయకుండా ఉండటమే గొప్ప ఉపకారం. నీవు పరులకు చేసిన ఉపకారం, పరులు నీకు చేసిన అపకారం మరచిపోవాలి. పరోపకార బుద్ధి మానవత్వ జ్యోతిని ప్రకాశింప జేస్తుంది" అని అంటారు బాబా. పరులకు మనం చేసిన ఉపకారం మన మనస్సులో ఉంటే, ఎప్పుడో ఒకప్పుడు వారి నుండి ప్రత్యుపకారమును కోరాలనిపిస్తుంది. అప్పుడు వారు మనకు ఉపకారం చేయకపోతే బాధపడుతాం, నిందిస్తాం, క్రోధమును పెంచుకుంటాం. కనుక మనం పరులకు చేసిన ఉపకారమును వెంటనే మరచిపోవాలి. ఇకపోతే పరులు నీకు చేసిన అపకారమును కూడా మరచిపోవాలి. కారణం ? పరులు నీకు చేసిన అపకారం గుర్తుంటే, నీలో కక్ష సాధించాలనే మనస్తత్వం ప్రబలుతుంది. కనుక పరులు నీకు చేసిన అపకారమును కూడా వెంటనే మరచిపోవడం ఉత్తమం. నిస్వార్థబుద్ధితో పరులకు సేవచేయటమే నీ ధర్మం. ఇదే భావమును ఈ శ్లోకం చాటుతున్నది.

పరోపకారాయ ఫలంతి వృక్షాః
పరోపకారాయ వహంతి నద్యః
పరోపకారాయ దుహంతి గావః
పరోపకారార్థ మిదం శరీరమ్.

పరోపకారము కొరకు వృక్షములు ఫలములనిచ్చుచున్నవి. పరోపకారము కొరకు నదులు ప్రవహించుచున్నవి. పరోపకారము కొరకు గోవులు పాలను యిచ్చుచున్నవి. పరోపకారము కొరకే సజ్జనుల సంపదలు వినియోగపడుచున్నవి. వృక్షములు, నదులు, గోవులు ఎట్టి స్వార్థం లేకుండా ప్రజలకు ఉపయోగపడుతుంటే, అన్నీ తెల్సిన మానవుడు, విజ్ఞానవంతుడనని విర్రవీగుతున్న మానవుడు మాత్రం ఇతర జీవరాసులకు ఉపయోగపడనవసరం లేదా ? ఎవరికివారు ఆత్మవిమర్శన చేసుకొని పరోపకార బుద్ధిని పెంపొందించుకోవాలి.

**మంచిమాట వినరు మనసిచ్చి చెప్పిన**
**చెడ్డమాట ముందు చెవిని పడును**
**ఇట్టివారు నన్ను ఎఱుంగ నేర్తురే**
**ఎట్టి తెలివియున్న నేమి ఫలము ? 35**

అన్నారు బాబా. సహజంగా సామాన్యులను చెడ్డే ముందు ఆకర్షిస్తుంది. మంచిమాట మనసుకు ఎక్కదు. పైపెచ్చు నీతి వాక్యములను బోధించే వారిని అవహేళన చేస్తుంటారు. చేతకాక నీతులు బోధిస్తుంటారని, అట్టివారి యెడల నిర్లక్ష్య వైఖరిని ప్రదర్శిస్తుంటారు. ఈ విధంగా ప్రవర్తించే వారిలో తెలివితేటలు లేవని భావించరాదు. తెలివి వక్రించడం వలన ఆ విధంగా ప్రవర్తిస్తుంటారు. తెలివి కాదు ప్రధానం, గుణం ప్రధానం కావాలి. ఈనాటి ఆధునిక మానవుడు నీతి నిజాయితీలను లెక్కచేయకుండా, దగ్గరి దారులలో, వక్రమార్గములలో, సునాయాసంగా ఫలితాలను సాధించాలని తాపత్రయపడుతున్నాడు. ఈ రోజులలో మంచితనం మీద, దైవంమీద విశ్వాసం సన్నగిల్లుతున్నది. అందువలన చెడుమార్గమును అనుసరిస్తున్నాడు మానవుడు. ఈనాడు మానవుడు ప్రేయస్సునే ముందుగా కోరుతున్నాడు గాని, శ్రేయస్సును కోరటం లేదు. ప్రేయస్సు అంటే భౌతిక భోగభాగ్యములు. శ్రేయస్సు మానవుని నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక అభ్యున్నతిని చూపించే ఉత్తమ గమ్యం. అయితే సామాన్యులు సహజంగా భోగభాగ్యాలలోనే సుఖమున్నదని భావించి, అక్రమార్జన ద్వారా సంపదను పెంచుకొని కూడా మనశ్శాంతి లేక, నిదుర పట్టక బాధపడుతుంటారు. ఇందుకు చక్కటి ఉదాహరణ సంపన్న పాశ్చాత్య దేశాలు. సంపద ఒక్కటే శాశ్వతమైన శాంతిని చేకూర్చలేదని భావించి, అట్టి శాంతికోసం అన్వేషిస్తూ పునీతమైన భరత ఖండమునకు వస్తున్నారు. దురదృష్టవశాత్తు ఈనాడు భారతీయులు సంపదలోనే సుఖమున్నదని భావించి, అట్టి సంపదను సంపాదించు కోవటానికోసం విదేశాలకు పరుగులు పెడుతున్నారు. సంపదలోనే ఆనందం

లేదని గ్రహించినవారు ఇక్కడకు వస్తున్నారు. ఇది ఈనాటి విచిత్ర పరిస్థితి. మంచి మాటలు విననివారు, చెడ్డమాటలకే ప్రాముఖ్యత నిచ్చేవారు "ఇట్టివారు నన్ను ఎఱుఁగ నేర్తురే" అన్నారు బాబా.

ఈనాటి తరం వారికి తెలివితేటలు తక్కువేమి లేవు. మంచి తెలివి గలవారే అయితే చాలామందిలో ఒక చిన్న అవలక్షణం మాత్రం ఉన్నది. మంచి మా చెబితే తలకెక్కదు. చెడ్డమాట చెప్పకుండానే చెవిలో పడుతుంది. చాలామంది మంచిని గాంచలేరు. చెడును మాత్రం వెంటనే వేలెత్తి చూపగలుగుతారు. మంచిని మాత్రం గ్రహించలేరు. చెడును స్వీకరించడానికి ఏమాత్రం వెనుకాడరు. ఇటువంటి అజ్ఞానులు సృష్టికర్తను ఎరుంగలేరు. సృష్టి రహస్యమును తెలుసుకోలేరు.

దుర్భావనలు, దుశ్చింతలు, దురాలోచనలు చేసేవారికి జగత్తంతా అదే విధంగా కనిపిస్తుంది. మనం ఏ రంగు కంటి అద్దాలు పెట్టుకుంటామో జగత్తంతయూ అదే విధంగా కనిపిస్తుంది. మంచి వారికి చెడు కనిపించదు. చెడ్డవారు మంచిని గాంచలేరు. మంచివారు సర్వదా చెడులో కూడా మంచిని చూడటానికే ప్రయత్నిస్తుంటారు. చెడ్డవారు మాత్రం సదా రంధ్రాన్వేషణే వారి లక్ష్యంగా పెట్టుకుంటారు. ఇటువంటి వారికి మంచిని చూచే శక్తి ఉండదు. ఎవరైనా చెబితే వారి మాట వినరు, వారికి వినిపించదు. మంచి సహవాసం కన్నా, చెడు సహవాసమే త్వరగా పిల్లలకు అబ్బుతుంది. కనుక చిన్ననాటి నుండి పిల్లల ప్రవర్తన విషయంలో పెద్దలు కడు జాగ్రత్తగా ఉండాలి. ఒక్క తెలివితేటలే ముఖ్యం కాదు. గుణవంతులుగా కూడా తీర్చిదిద్దాలి. దుష్టులకు, దుర్మార్గులకు దూరంగా ఉంచాలి. సన్మార్గమున నడిపించాలి. అటువంటి సత్ప్రవర్తనా సచ్ఛీల సంపన్నులకు మాత్రమే దైవ కృప ఉంటుంది. దైవానుగ్రహం లభిస్తుంది.

పరుల తిట్టినంత పాప ఫలంబబ్బు
విడువదెన్నటికిని విశ్వమందు
పరులు పరులు కాదు పరమాత్ముడేయగు
సత్యమైన బాట సాయి మాట 36

అన్నారు భగవాన్ బాబా. నరునికి సేవచేసినచో నారాయణుని అర్చించి నట్టే పరులకు సేవచేయడమంటే పరమేశ్వరుని పూజించినట్లే అవుతుంది. 'మానవసేవే మాధవసేవగదా!' కనుక పరులను తిట్టగూడదు, పరులకు అపకారం అంతకన్నా చేయగూడదు. పరులకు ఉపకారం చేయాలి. సహకారం అందించాలి. ఉపకారం చేసిన వారికి సహకారం అందించడంలో లేదు గొప్పతనం. అపకారం చేసే వారికి కూడా ఉపకారం చేయువాడే ఉత్తముడు. అనవసరంగా పరులను నిందిస్తే పాపం వస్తుంది. ఆ పాపఫలం మనల్ని ఎన్నటికి విడువదు, వెంటాడుతునే ఉంటుంది. "పరులు పరులు కాదు పరమాత్మయే" అన్నారు బాబా. ఇది అత్యున్నతమైన తత్త్వజ్ఞానము (Philosophy) పరమాత్మ ఆత్మస్వరూపుడై అందరిలో ఉన్నాడు గనుక ఎవరిని తిట్టినా, దూషించినా పరమాత్మను దూషించినట్లే అవుతుంది. భారతీయ ధర్మంలో ఒక్క మానవునికే గాక సమస్త ప్రాణికోటికి అత్యున్నతమైన, గౌరవప్రదమైన స్థానం ఇవ్వబడింది. ముఖ్యంగా భగవద్గీతలో యింకా ఒక మెట్టు పైకిపోయి 'సర్వమానవ సౌభ్రాతృత్వం' (Fraternity) తోనే సంతృప్తి చెందక 'సర్వాత్మదృష్టి'ని కూడా అలవరచు కోవాలని చెప్పబడింది. సమస్త ప్రాణులు భగవత్స్వరూపులు, నారాయణ స్వరూపులు గనుక. భగవంతునిపై భక్తి, జీవరాసుల యెడ ద్వేషం కలిగి యున్నచో ఆ భక్తికి అర్థమేలేదని, అది భగవంతునికి గావించబడు ఉపచారము కాదు, అపచారమేనని భగవద్గీత బోధిస్తున్నది.

"సర్వజీవ తిరస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించి నను, బాధించినను భగవంతుని బాధించినట్లేయగును. కనుక సర్వభూతదయ పరమోత్కృష్టమైన ధర్మము, "ఈశ్వర స్సర్వభూతానాం"

సమస్త జీవరాసులు పరమాత్మ అంశములే అన్నిటియందు ఉండినది ఒకే ఆత్మ అయినప్పుడు మనతో కలిసి మెలసి జీవిస్తున్న మనుజులు పరమాత్మ స్వరూపులుగాదా? ఈ అత్యున్నతమైన తత్త్వజ్ఞానమును ప్రతి వ్యక్తి జీర్ణం చేసికొననివాడు అసూయాద్వేషాలకే తావుండదు. శాంతియుత సహజీవనము (Peaceful Co-Existence) ను గడప గులుగుతారు. అందువలన పరులను పరమాత్మ స్వరూపులుగా భావించి గౌరవించటం నేర్చుకోవాలి.

**కాలు జారిన మరలింపగలరుగాని**
**నోరు జారిన మరలింపలేరు సుమ్మి**
**మాట జారినయట్టి యా మానవులను**
**దక్ష సేతుంగ దగునె యీ పృథ్విలోన** 37

అన్నారు బాబా. కాలు జారితే తీసుకోవచ్చునుగాని, నోరు జారితే తీసుకోలేము. కనుక తొందరపడి ఇష్టం వచ్చినట్లు మాట్లాడరాదు. మాట్లాడే ప్రతి మాట ఆచితూచి మాట్లాడటం నేర్చుకోవాలి. "మాటకు ఖర్చులేదుగాని విలువ ఎక్కువ" అంటారు బాబా. పూర్వకాలంలో మాటకు ఉండే విలువ నోటుకు కూడా ఉండేది కాదట. 'నోటు' అంటే అర్థం డబ్బు. మరొక అర్థం, అప్పు తీసుకున్నవారు వ్రాసి యిచ్చే కాగితమును కూడా 'నోటు' అని అంటారు. పూర్వకాలంలో మూట (డబ్బు) కన్నా మాటకు ఎక్కువ విలువ నిచ్చేవారు. కనుక మాట్లాడే ప్రతిమాట సౌమ్యంగా, మృదువుగా ఉండాలి. కరకుగా, కోపం వచ్చేదిగా ఉండరాదు. ప్రియముగా, హితముగా మాట్లాడటం నేర్చుకోవాలి. మాట్లాడటం కూడా ఒక కళే (Art), దానిని ప్రతి ఒక్కరూ అభ్యసించి, ఆచరణలో పెట్టాలి. ఈ విషయమై మన పూర్వీకులు అనుభవంతో చెప్పిన ఈ శ్లోకమును ప్రతి ఒక్కరూ అర్థం చేసుకొని ఆచరణలో పెట్టటం మంచిది.

"సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియం
ప్రియం చ నానృతం బ్రూయాత్
ఏషః ధర్మః సనాతనః"

అనగా సత్యమును పలకవలెను. ప్రియమైన దానిని చెప్పవలెను. సత్యమైనను అప్రియంగా చెప్పరాదు, ప్రియముగదా యని అసత్యమైననూ చెప్పరాదు. ఇది సనాతనమైన ధర్మము. యదార్థమైనప్పటికీ, వాస్తవ మైనప్పటికీ, సత్యమే అయినప్పటికీ, కటువుగా, కుండ బద్దలుకొట్టినట్లు నిర్మొహమాటంగా మాట్లాడరాదు. ఆ విధంగా పెడసరంగా మాట్లాడితే, ఎదుటివాళ్ళ మనస్సును నొప్పించే (Offend) ప్రమాదం కూడా ఉంటుంది. కనుక ఎదుటివాని మనస్సు నొప్పించకుండా మృదువుగా, నెమ్మదిగా సత్యం చెప్పటం నేర్చుకోవాలి. బాణంకన్నా వాడి గలది మాట. మాటలతో మూటలను కొనవచ్చు. మాటలచేత మన్ననలనూ పొందవచ్చు, మాటలచేత మాన్యాలను సంపాదించవచ్చు. మాటే భూషణం మాటే దూషణం. కనుక అటువంటి విలువ అయిన మాటను తేలికగా జారిన యెడల వచ్చే ప్రమాదం ఊహించరానిది. వచ్చే ప్రమాదమును గురించి ఆలోచించ కుండా, అనాలోచితంగా మాట్లాడేవారిని ఏమాత్రం క్షమించరాదు. భగవద్గీత కూడా యిదే వాస్తవమును బోధిస్తున్నది.

"అనుద్వేగ కరం వాక్యం
సత్యం ప్రియహితం చయత్
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే"

మాట్లాడటంకూడా ఒక తపస్సే, దీనినే 'వాచిక తపస్సు' అన్నారు.

**పెద్దలన్నమాట పెరుగన్నమునుబోలు**
**స్వీకరించవలెను చిత్తమందు**
**అట్లు చేయకున్న హానియే కలుగును**
**ఉన్నమాట తెలుపుచున్న మాట** 38

అన్నారు బాబా. అయితే ఈనాడు చాలామంది పెద్దల మాటలను లెక్క చేయటంలేదు. గురువాజ్ఞలను శిరసావహించటంలేదు. తల్లిదండ్రుల మాటలను అసలే వినటంలేదు. దైవాన్ని సహితం హేళన చేయటానికి ఏమాత్రం వెరువటం లేదు. "*మాతృదేవోభవ! పితృదేవో భవ! ఆచార్యదేవోభవ!*" అనే పవిత్ర సంప్రదాయానికి తిలోదకాలిస్తున్నారు. అందువలన ఈనాడు 'యువత' పెడమార్గమున పడుతున్నది. ఈ విషయమై ఒక పర్యాయం భగవాన్ బాబావారు చక్కటి సందేశమిచ్చారు. "*పెద్దల వాక్యాలు విందులు కావు మందులు. విందులలో ఏ పదార్థమునైనా వదలివేయవచ్చును.. గాని, భవరోగాన్ని నివారించే ఈ మందు అడుగువట్టినా, అందులో నీరుపోసైనా ఉపయోగించాలిగానీ వదలిపెట్టరాదు*" అని అంటారు బాబా. పెద్దల వాక్యములు మందులతో సమానం. రోగం వచ్చినప్పుడు సరియైన మందు వేయాలి. నిర్లక్ష్యం చేస్తే రోగం ముదిరి అసలు ప్రాణానికే ముప్పువాటిల్లుతుంది. అదే విధంగా పెద్దల సలహాలను పాటించనివారి గతి అధోగతే. యాదవకులంవారు "*గర్గుడు*" (యాదవుల కులగురువు) అనే మహనీయుని అవహేళన చేయటం వలన యాదవ కులమే సర్వనాశనం అయిపోయింది. పెద్దల మాటను వినకుండా నిండు సభలో ద్రౌపదిని అవమాన పరచడం వలన యావత్ కౌరవ వంశమే నామరూపాలు లేకుండా సర్వనాశనం అయిపోయింది. సకల శాస్త్ర కోవిదుడైన రావణబ్రహ్మకు అదే గతి పట్టింది. వారు నాశనం అవటమే కాక వారిని నమ్ముకున్నవారు కూడా నాశనం అయినారు. ఈ విషయమై మరొక సందర్భంలో భగవాన్ బాబా చక్కగా

చెప్పారు. "భవరోగాలన్నిటికీ సరియైన మందు భగవన్నామమే. భగవన్నామాన్ని హృదయపూర్వకంగా ఉచ్ఛరిస్తూ, పెద్దలను గౌరవించి అందరియందు దైవభావాన్ని పెంచుకొని, ఏకాత్మభావంతో జీవించినప్పుడే మీరు ఆదర్శమూర్తులుగా తయారవుతారు" అని అంటారు బాబా. కనుకనే "పెద్దలన్నమాట పెరుగన్నమునుబోలు" అన్నారు. అందువలన అనుభవజ్ఞులైన పెద్దల మాటలను ప్రతి ఒక్కరూ ఆలకించి, ఆచరణలో పెట్టాలి. అట్లా చేయపోతే హాని కలుగుతుంది.

## సత్కార్యములు

**పనులయందలి పుణ్య పాపములబట్టి**
**అనుభవముదీర జీవులు అవనిబుట్టు**
**కనుక సత్కార్యములు చేయగలిగిరేని**
**దైవమే తోడుగా నుండు ధరణియందు** 39

మానవుడు గత జన్మలో చేసిన పుణ్యపాప కర్మలననుసరించి ఈ జన్మలో తగిన ఫలమును అందుకుంటున్నాడు. గత జీవితం (Past Life) యొక్క ప్రాప్తియే దీనికి మూలకారణం. పూర్వం నాటిన విత్తనమే ఈనాడు మొక్కగా మొలుస్తున్నది. భవిష్యత్తులో చెట్టుగా పెరిగి ఫలముల నందిస్తున్నది. కనుక ఎట్టి కర్మనో, అట్టి ఫలితం; ఎట్టి విత్తనమో, అట్టి ఫలము. కనుక మంచి ఫలమును పొందాలనుకుంటే మంచి కర్మలనాచరించాలి. సత్కార్యములను చేసిన యెడల సత్ఫలితాలను పొందగలుగుతాం. భగవంతుడు కూడా అట్టి సత్కార్యములు చేసేవారికి తోడుగా, నీడగా ఉంటాడు. అసలు ఏవి సత్కార్యములు ? సమిష్టికి ఉపయోగపడేవి, సమాజ శ్రేయస్సుకు, సమాజ పురోభివృద్ధికి ఉపయోగపడేవి మరియు దేశ ఔన్నత్యమును పెంచేందుకు చేసే కార్యములన్నీ సత్కార్యములే.

కాయము కర్మాచరణ నిమిత్తమే వచ్చింది. కర్మలు సత్కర్మలుగా ఆచరించినప్పుడు జన్మము సార్ధకమవుతుంది. సత్కర్మలు ఆచరించినప్పుడే సద్భావనలు మనలో వచ్చి చేరుతాయి. అహంకారమును దూరం చేసి, ఆసక్తిని అణగద్రొక్కి కర్మను ఆచరిస్తే అది యజ్ఞరూపమును ధరిస్తుంది. యజ్ఞమన్ననూ, యోగమన్ననూ ఒక్కటే అంటారు బాబా. కనుక కర్మలద్వారానే కాలమును సార్ధకం చేసుకోవాలి. కాలకర్మ కారణ కర్తవ్యములన్నీ కాయముతోనే కూడి ఉంటున్నాయి గదా !

## సేవ

**దేశ సేవకుండు దేశ నాయకుడైన**
**స్వార్ధరహిత సేవ చేయగలడు**
**పదవి కాంక్షవాడు పరిశుద్ధ హృదయుడు**
**చెప్పరయ్య మీరు ఒప్పుకొనెద** 40

అన్నారు బాబా. బాబావారు సేవకు అత్యధిక ప్రాధ్యాతనిస్తారు. అందులో గ్రామసేవకు మిక్కిలి ప్రాధాన్యతనిస్తారు. *"గ్రామసేవ బినా నిర్వాణ నహీ"* అన్నారు బాబా. గ్రామాలు భారతావనికి పట్టుగొమ్మలు గదా ! *'సేవకుడు కానివాడు నాయకుడు కాలేడు. కింకరుడు కానివాడు శంకరుడు కాలేడు'* అని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. ఇది చమత్కారం కాదు. వాస్తవం, యదార్ధం. దేశ సేవకుడైనవాడు అధికారంలోనికి వస్తే నిస్వార్ధసేవ చేస్తాడు. అయితే ఈనాడు అధికారమును హస్తగతం చేసుకోవటాని కోసం అనేక అక్రమ, అనాచార, అవినీతి మార్గములను అనుసరిస్తున్నారు. చేయకూడని, చేయరాని పనులు చేస్తున్నారు. ధన సహాయంతో ఉన్నత పదవులను అలంకరిస్తున్నారు. ఈనాడు పదవిని పొందటానికి ధనం ప్రధానమైన పెట్టుబడి అవుతున్నది. అధికారం చేజిక్కించుకున్న తరువాత, తాము ఎన్నికల రంగంలో పెట్టుబడిగా పెట్టిన సొమ్మును తిరిగి

రాబట్టటానికోసం అనేక అవినీతి మార్గముల ననుసరిస్తున్నారు. అవకాశం దొరికినప్పుడు ఖర్చుచేసిన సొమ్ముకు అనేకరెట్లు సంపాదిస్తున్నారు. ప్రభుత్వ సొమ్మును కొల్లగొడుతున్నారు. అభ్యుదయ కార్యక్రమాలకు ఖర్చుచేయవలసిన సొమ్ములో చాలా భాగం, అధికారంలో నున్న వ్యక్తుల చేతులలోనికే పోతున్నది. కనుక ఆశించిన ప్రగతి మాత్రం కనిపించటం లేదు. వ్యక్తుల జేబులు మాత్రం నిండుతున్నాయి. దీనిని ఆసరాగా తీసుకొని సంఘ విద్రోహ శక్తులు ప్రభుత్వ సంపదను దోచుకుంటున్నాయి. చిట్ట చివరికి దేశ ఆర్థిక ప్రగతి కుంటుబడుతున్నది. ధరలు తారాస్థాయినందుకుంటున్నాయి. సామాన్య మధ్యతరగతి ప్రజలు నానా యిక్కట్లకు గురి అవుతున్నారు. ఇది ఒక విషవలయంగా తయారైంది. మానవుని మనుగడకే ప్రమాదం వాటిల్లుతున్నది. ఇంకా కొంతమంది పేరు ప్రతిష్ఠలకోసం సేవ చేస్తున్నట్లు నటిస్తున్నారు. సేవాకార్యక్రమాలకు ఖర్చుపెట్టు సొమ్ము కన్నా ప్రచారం, ఆర్భాటాలకు ఎక్కువ ఖర్చుచేస్తున్నారు. "సేవ-అనేది ఎవరినీ ఆకర్షించుటకు చేసే Art కాదు. మన సేవ Heart నుండి రావాలి. Art is External, Heart is internal. అప్పుడే Self Satisfaction (ఆత్మతృప్తి) ఉంటుంది. చెప్పేది చెయ్యాలి. చేసిందే చెప్పాలి" అంటారు బాబా. బాబా చాలా Practical Man. మాట్లాడే ప్రతి మాట వెనుక మానవత్వం, ప్రేమతత్త్వం ప్రతిబింబిస్తుంటుంది. అంతేకాదు వారి ప్రతి మాటలో Art ఉట్టిపడుతూ ఉంటుంది. ఆ మాటల వెనుక Love తొణికిసలాడుతూ ఉంటుంది. అది వారి Heart నుండి వస్తుందిగాని Lips నుండి కాదు. అదే వారి ప్రత్యేకత. బాబా కోరేది నిష్కామ సేవ. ధనమున్నదిగదాయని డబ్బిచ్చి సేవాకార్యక్రమాలు జరిపించటానికి అంగీకరించరు బాబా. శ్రమదానం ద్వారా సేవ చేయాలంటారు బాబా. సేవ అంటే చాలామంది 'సత్కర్మ' (Good Work) అని భావిస్తుంటారు. బాబా దీనిని అంగీకరించరు సేవ అనేది దైవము యొక్క పని (God's Work) అని భావించి చేయాలంటారు బాబా.

ఇటువంటి అత్యున్నతమైన, పవిత్రమైన భావనను బాబా తమ భక్తులలో కలుగజేస్తున్నారు. దైవకార్యం చేస్తున్నాననే భావన మనసులో ఉండినప్పుడు సేవ నిష్కామకర్మగా మారుతుంది.

*"Service to Humanity is Service to Divinity"* "మానవసేవయే మాధవసేవగా భావించి చేసినప్పుడు మాధవుణ్ణి మానవునిలోనే చూడగలుగగల్గుతాం" అంటారు బాబా. మాధవుని చూడాలంటే మొట్టమొదట మానవుని యందున్న మానవత్వాన్ని ముందు గుర్తించాలంటారు బాబా. మానవత్వాన్ని గుర్తించకుండా మాధవుణ్ణి దర్శించడం కష్టం. చాలామంది పర్వదినాలలో 'అన్నదానం' (Poor Feed-ing) చేస్తున్నామని చెబుతుంటారు. స్వామి దీనిని అంగీకరించరు. 'నారాయణసేవ' చేస్తున్నామనే భావనతో పేదలకు, బీదలకు అవిటి వారికి ప్రేమతో అన్నం పెట్టాలంటారు బాబా. కారణం ? ప్రతి జీవిలో భగవంతుడు ఆత్మస్వరూపుడై ఉన్నాడు. ఆ భావన మనలో కలిగినప్పుడు మనం చేసే పని పవిత్రమైనదవుతుంది. స్వామి ఆశించేది సానుభూతితో కూడిన సేవ కాదు. నైతిక సానుభూతికన్నా అన్ని విధాలా ఉన్నతమైనది ఆధ్యాత్మిక ప్రేమ. సేవలోని ఆధ్యాత్మిక అనుభూతిని, ఆనందమును సేవ చేసేవారు, సేవ పొందేవారు పంచుకొనినప్పుడు సేవ, యోగముగా మారుతుందంటారు బాబా. "సంఘసేవయే సర్వేశ్వరుని సేవగా విశ్వసింపుడు. సమాజమును భగవంతుని విశ్వరూపముగా తలంచుడు. పేరు ప్రతిష్ఠలకు ప్రాకులాడక, ద్వేషభావములకు చోటివ్వక, వ్యక్తిత్వమును వెనుకకు నెట్టి, శక్తి సామర్థ్యముల కొలది సంఘసేవకు కంకణం కట్టుడు" అని అంటారు బాబా. ఈ మాటలు సంఘ సేవకులకు మంచి హెచ్చరిక. ముఖ్యంగా దేశనాయకులైన వారు ఈ మాటలను ఆచరణలో పెడితే ఆ దేశం సస్యశ్యామలమవుతుంది. అయితే ఈనాడు చాలామంది నాయకులు పదవికి యిచ్చిన ప్రాధాన్యత సేవకు యివ్వటంలేదు. అందువలననే

దేశం అనేక యిక్కట్లకు గురి అవుతున్నది. బాబా మాటలను ఆచరణలో పెడితే ఆ దేశం సర్వతోముఖంగా అభివృద్ధి గాంచుతుంది.

**కోమలత్వంబు నిస్వార్థ గుణము కలిగి**
**సేవచేయుట నిజమైన సేవయగును**
**స్నేహభావంబుతోగూడి సేవ చేయ**
**శాంతి ధామంబు చేరుట సత్యమయ్య. 41**

అన్నారు బాబా. ఈ పద్యములో సేవకు ఉండవలసిన కొన్ని ప్రధాన లక్షణాలను వివరించారు. సేవ జీవితమునకు, ఆనందమును, రుచిని కలిగించే లవణం వంటిది. సేవలోనే ఉన్నది పవిత్రత. సేవ ద్వారా ప్రేమ అనుభూతిలోనికి వస్తుంది. హృదయ విశాలత పెరుగుతుంది. సేవ ద్వారా భగవంతుని మెప్పును కూడా పొందవచ్చును. సేవచేసి లక్ష్మి తరించింది. సేవకుడుగా, నమ్మిన బంటుగా హనుమంతుడు ప్రశంసల నందుకున్నాడు. *"సేవను గురించి ఉపన్యాసం చెప్పుటకంటే సేవచేసి చూపించటంలోనే ఉన్నది గొప్పతనం"* అని అంటారు బాబావారు.

ఇతరులను నొప్పించకుండా ఒప్పించడంలోనే ఉన్నది విశేషం. ఇతరులకు ఏమాత్రం బాధ కలుగకుండా, మృదుమధురమైన మాటలతో ఎదుటివారిని ఆకర్షించడంలోనే ఉన్నది గొప్పతనం. ముఖ్యంగా సేవచేయటానికి కంకణధారులైనవారి హృదయం కోమలంగా, మనసు నవనీతంగా ఉండాలి. అప్రియమైన, కటువైన మాటలను ఉపయోగించి మందలించకుండా, ప్రియమైన, కోమలమైన మాటలతో అతి సున్నితంగా మందలించటం అభ్యాసం చేసుకుంటే ఎంతటి కఠిన హృదయాలనైనా జయించవచ్చును. కోమలత్వం సేవకుడి సొత్తుకావాలి. నిర్మలత్వం నాయకుడి స్వంతం కావాలి. అప్పుడే సేవకుడు నాయకుడవుతాడు, నాయకుడు అధికారానికి అర్హుడవుతాడు.

ఇకపోతే సేవకునిలో ఉండి తీరవలసిన రెండవది *'నిస్వార్థ గుణం'.* ఫలితమును ఆశించి సేవ చేయరాదు. చాలామంది రాజకీయ నాయకులు ఓట్లను దృష్టిలో పెట్టుకొని ప్రజలకు సేవచేస్తున్నట్లు నటిస్తుంటారు. ఇదికాదు నిజమైన సేవ. కుంటివారికి, గ్రుడ్డివారికి, నిస్సహాయులకు, పేదలకు, బీదలకు, దీనులకు మనకు చేతనైనంత సహాయం చేయాలి. వీరందరూ భగవంతుని బిడ్డలేననే భావంతో సేవ చేయాలి. వారందరూ దైవస్వరూపులే అనే భావం మనలో కలగాలి. అది ఎప్పుడు కలుగుతుంది? మనలో పాతుకొనిపోయిన స్వార్థం, క్రోధం, అసూయలాంటి అసుర గుణములను తొలగించి, వాటి స్థానంలో నిస్వార్థం, ప్రేమ, దయ, స్నేహమనే సద్గుణాలకు అవకాశం కల్పించినప్పుడు ప్రతి జీవిలో దైవాన్ని దర్శించగలుగుతాం. ఎట్టి ఫలి॰ాన్ని ఆశించకుండా సేవచేయగలుగుతాం.

స్నేహభావంతో, ప్రేమభావంతో తోటి వారి కష్టసుఖాలలో పాలుపంచుకొని చేసే సేవకుమించిన ఆధ్యాత్మిక సాధన వేరొకటిలేదు. ప్రేమ యొక్క పరాకాష్ట సేవ. సేవయొక్క స్ఫటిక రూపం త్యాగం. *"నువ్వు ధ్యానంలో ఉన్నాసరే, నీ సహాయం కోసం ఎవరైనా వస్తే, తక్షణం వెళ్ళి చేయగలిగినంత సేవ చేయి!"* అంటారు బాబా. సేవచేసే వారిని బాబా అమితంగా ప్రేమిస్తారు, అనుగ్రహిస్తారు. స్వామి కోరేది నిస్వార్థ సేవను మాత్రమే.

# త్యాగము

**పుణ్యకర్మలచేత భువిని త్యాగముచేత**
**ప్రేమ భావములను పెంపుచేసి**
**దానవత్వమడచి దైవచింతన చేసి**
**నిత్యజీవితంబు నెరపుడయ్య** 42

అన్నారు బాబా. సతతమూ పుణ్యకర్మల నాచరిస్తూ, సర్వ జీవరాసుల యెడల ప్రేమను పెంపొందించుకుంటూ, దానవత్వ ప్రవృత్తిని అణచిపెట్టి, నిత్యమూ దైవచింతనలో నిమగ్నులై త్యాగభావమును అలవరచుకొని జీవితమును గడుపవలెనని భగవాన్ బాబావారు బోధిస్తున్నారు. త్యాగం, అలవరచుకోవలసిన ప్రధానమైన సద్గుణం. త్యాగమంటే దానధర్మాలు చేయటమేనని చాలామంది భావిస్తుంటారు. త్యాగానికి దానానికి ఎంతో వ్యత్యాసమున్నది. దానం అంటే తనకున్న సంపదలో ఎంతో కొంత ఇతరులకు యివ్వడం. దానం చేయడం వలన ఎవరూ, ఎన్నడూ తన సర్వస్వాన్ని కోల్పోరు. *'అదాన దోషేణ భవేద్దరిద్రః'* దానం చేయకపోవటం వలననే జీవుడు మరో జన్మలో దరిద్రుడై జన్మిస్తాడు. ఇంకా ఒక మెట్టు పైకిపోయి తన న్యాయమైన అవసరాల నిమిత్తమై ఉంచుకొని మిగతాదంతా దానం చేయువాడు సమాజంచేత ఉత్తమోత్తముడుగా పరిగణించ బడుతాడు. *"దేయం దీనజనాయచవిత్తం"* దీనులకు దరిద్రులకు తనకున్న దానిలో కొంత యిచ్చి సాయము చేయవలెనని శాస్త్రములు హెచ్చరిస్తున్నాయి. ఆ విధంగా చేయకుండా అక్రమ అనాచర అవినీతి పద్ధతుల ద్వారా కోటికి పడగెత్తి కూర్చున్న దురాశాపరునికి, లోభికి ఎప్పుడో ఒకప్పుడు అధోగతి దాపురించక తప్పదు. పైపెచ్చు అటువంటి వారికి ఏమాత్రం మనశ్శాంతి కూడా ఉండదు. కనుక త్యాగము, ప్రేమ మొదలగు సద్గుణములను పెంచుకొని, పుణ్యకర్మల నాచరిస్తూ, నిత్యము దైవచింతనలో కాలం గడపటం ఉత్తమోత్తమం. ఆ విధంగా చేయని యెడల మనం సంపాదించిన సంపదను వారసులు దొంగిలిస్తారని ఈ క్రింది శ్లోకం స్పష్టం చేస్తున్నది.

*చత్వారో విత్తదాయాదా :*
*ధర్మభూపాగ్ని తస్కరాః*
*జ్యేష్టభ్రాతవ మానేన త్రయః*
*కుప్యన్తి సోదరాః.*

ధనమునకు నల్గురు వారసులు కలరు. 1. ధర్మము 2. రాజు 3. అగ్ని 4. దొంగ. ఇందులో పెద్ద వారసుడు ధర్మము. పెద్ద వారసునికి పెద్ద వాటా రావలెను. అనగా ధర్మమునకు ఎక్కువ డబ్బు వినియోగించవలెనని అర్థము. ఆ విధంగా దానధర్మాలకు వినియోగపెట్టక అవమానపరచిన యెడల మిగిలిన ముగ్గురు సోదరులైన రాజు, అగ్ని, దొంగలు కోపోద్రిక్తులై చెలరేగెదరు. అధిక సంపన్నుల రూపంలో రాజు, (ప్రభుత్వం) ఆ సంపదను స్వాధీనం చేసుకుంటాడు. అగ్ని ప్రమాదములు సంభవించి ఆస్తి నష్టమవుతుంది. దొంగలు పడి దోచుకుంటారు. కాబట్టి ప్రతి వ్యక్తి తన సంపాదనలో కొంత భాగమును విధిగా దానధర్మాలకు వినియోగించాలి. పశు పక్ష్యాదులకు కూడా పెట్టాలి. దానధర్మాలకు వినియోగించిన డబ్బు ఇహమునందు, పరమునందు కూడా తిరిగి వస్తుంది. స్నేహితులకు వినియోగించు ద్రవ్యము ఇహమునందు మాత్రమే తిరిగి వస్తుంది. భోగముల కొరకు దుర్వినియోగం చేయు ద్రవ్యము ఇహమునందుగాని, పరమునందుగాని తిరిగి రాదు. మేడ మెట్లలో అత్యున్నతమైన ఆఖరి మెట్టు త్యాగం. తనకు అమిత ప్రియమైన వస్తువులను సహితం నవ్వుతూ నవ్వుతూ ఏమాత్రం సంకోచించకుండా ఇతరులకు యివ్వగలిగిన వానినే నిజమైన 'త్యాగి' అని అంటారు. "త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్" త్యాగం చేయటం వలననే శాంతి చేకూరుతుందని "గీత" బోధిస్తున్నది. త్యాగం చేయటమంటే కేవలం తన సంపదను మాత్రమే యివ్వటం కాదు. విషయ సుఖములను, కర్మఫలములను, అహంకార మమకారములను, కర్తృత్వమును త్యాగం చేసిన యెడల పరమ శాంతిని అనుభవిస్తాడు. *"త్యాగరాజులుకండి! భోగరాజులు కాకండి!"* అని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. ఇది చమత్కారం కాదు. ప్రతి ఒక్కరూ నిస్వార్థ హృదయులు కావాలి. త్యాగధనులు కావాలి. నిత్యజీవితంలో త్యాగం ఒక భాగం కావాలి. అప్పుడే జీవికి శాంతి చేకూరుతుంది.

**భావమందు తుచ్ఛ వాంఛలు వీడుడు**
**త్యాగమగును అదియె యోగమగును**
**ఆస్తి ఆలి వదలి అడవికేగుట కాదు**
**సత్యమైన బాట సాయి మాట. 43**

అన్నారు బాబా. త్యాగము అంటే ఆస్తి, ఆలి వదలి అడవికేగుటయే యని చాలామంది భావిస్తుంటారు. తపస్సు అనగానే అన్నాహారములు వర్జించి, ఆకులలములు తినుచూ, ఎండనకవాననక, కాకులు దూరని కీకారణ్యములో తల క్రిందబెట్టి, కాళ్ళు పైకిపెట్టి వత్సరముల తరబడి శరీరాన్నికష్టపెట్టటమనే అభిప్రాయం చాలామందిలో ఉన్నది. తనయందు అంతర్భూతమై ఉన్న రజస్తమోగుణములను తపింపజేసి నిర్మూలన మొనర్చుటయు, ఇంద్రియాల యందలి మాలిన్యమును తొలగించుయే "తపస్సు" అని "గీత"లో పేర్కొనబడింది. 'త్యాగేనై కే అమృతత్వ మానశుః' త్యాగము చేయుట వలననే మోక్షము సిద్ధించునని ఉపనిషత్తులు చెబుతున్నాయి. మన భావమందు, మనస్సునందు పేరుకొనిపోయిన తుచ్ఛ వాంఛలను నిర్మూలనం గావించుటే నిజమైన త్యాగమని, అదియే యోగమని భగవాన్ బాబావారు ప్రబోధిస్తున్నారు. భోగభాగ్యములలోనే "సుఖం" ఉన్నదని చాలామంది భావిస్తుంటారు. అది తాత్కాలిక సుఖము మాత్రమే. శాశ్వతమైన ఆనందం కాదు. భోగ భాగ్యములు శాంతి చేకూర్చవు త్యాగం వలననే మానవునికి శాంతి చేకూరుతుంది. కర్మ ఫలమును నిష్కామ బుద్ధితో త్యజించుటయే త్యాగం. అట్టి త్యాగం వలననే చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి వలన శాంతి లభిస్తుంది. కనుక ప్రతి వ్యక్తి తన జీవితాన్ని త్యాగమయం చేసుకోవాలి. అన్నిరకముల ధనము కన్నా 'త్యాగధనం' చాలా గొప్పది. అట్టి త్యాగధనమును సంపాదించినవాడే ధన్యుడు. అతడే ఇహపరములయందు శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను పొందగలుగుతాడు. కనుక ప్రతి ఒక్కరూ త్యాగనిరతిని అలవరచుకొని జీవితాన్ని సార్థకం చేసుకోవాలి.

బ్రతికినన్ని నాళ్ళు ఫలము లిచ్చుటెకాదు
చచ్చికూడ చీల్చి యిచ్చు తనువు
త్యాగ భావమునకు తరువులే గురువులు
ఉన్న మాట తెలుపుచున్న మాట. 44

అన్నారు బాబా. త్యాగంకూడా ఒక రకమైన శీలమే. ప్రతి వ్యక్తీ అలవరచుకోవలసిన సద్గుణములలో అతి ప్రధానమైనది త్యాగం. సత్యమే జీవిత పరమావధిగా భావించి, పరోపకారమే ధర్మంగా నెంచి, మృత్యువునకు కూడా ఏమాత్రం భయపడక, ధర్మసంస్థాపనార్థం, తన జీవిత సర్వస్వాన్ని సమర్పించుకొనువారే నిజమైన త్యాగశీలురు. మన ఇతిహాస పురాణము లను పరికిస్తే అట్టి త్యాగశీలురు కోకొల్లలు. శిబి చక్రవర్తి, బలిచక్రవర్తి, దధీచి, కర్ణుడు మొదలైన త్యాగశాలురు ఎందరో కనిపిస్తారు. భారతదేశం త్యాగధనులకు పుట్టినిల్లు 'త్యాగభావమునకు తరువులే గురువులు' అని బాబావారు చక్కగా చెప్పారు. ప్రజల నుండి ఎట్టి ప్రతిఫలాన్ని కోరకుండా కాయలను, పండ్లను యిస్తాయి చెట్లు. "చచ్చి కూఢ చీల్చి యిచ్చు తనువు" అన్నారు బాబా. ఎండిపోయిన తరవాత వంట చెఱకుగా ఉపయోగ పడుతాయి చెట్లు. అంతేకాదు తలుపులు, దర్వాజాలు ఇంకా అనేక వస్తువులు చేయించుకోవటానికి కూడా ఉపయోగపడుతాయి చెట్లు. బ్రతికి ఉన్నప్పుడూ మానవులకు ఉపయోగపడి, చచ్చిపోయిన తరువాత కూడా ఉపయోగపడేవి చెట్లు మాత్రమే. వృక్షములు, నదులు, పశుపక్ష్యాదులే గనుక లేకపోతే మానవజాతి మనుగడే లేదు. కనుకనే "తరువులు గురువులు" అన్నారు బాబా. మానవుడు ప్రకృతి నుండి నేర్చుకోవలసినది ఎంతో ఉన్నది. "దానమివ్వని చేయి కన్న ఫలము నిచ్చే చెట్టు మిన్న" ఇది విస్మరించరాని నగ్న సత్యం.

# సత్యము

కనుల కగుపడు దృశ్యంబు గాంచి మీరు
సత్యమిదియని యెంచక సంబరమున
తెరను దాగిన సత్యంబు తెలిసికొనగ
విశ్రమింపక నాతోడ వెడలి రండు. 45

అన్నారు బాబా. సత్యరూప తత్త్వాన్ని తెలిసికోవటానికి తన వెంట తరలి రండని మనల్ని ఆహ్వానిస్తున్నారు బాబా. "సత్యాన్న ప్రమదితవ్యమ్" ఎటువంటి పరిస్థితులలోను సత్యమునుండి చలించవలదని ఉపనిషత్తులు చెబుతున్నాయి. కనుక దృఢచిత్తులకు అంతా జయమే. సత్యమేవ జయతే' సత్యమే జయిస్తుంది. అట్టి విశ్వాసంతో సత్యపథంలో ముందుకు సాగిపోతే దైవకృపకు పాత్రులమవుతాం.

"సత్యమే విశ్వవ్యాపకమైన ఆత్మశక్తి. సత్యాన్ని ఆలంబనంగా చేసుకొనకపోతే మానవజీవితం సంసార సముద్రంలో చుక్కాని లేని నావలాగా గమ్యాన్ని చేరుకోలేక నీటమునిగిపోతుంది" అని అంటారు బాబా. కనుక ఆదర్శవంతమైన జీవితమును అందించుటకు సత్యము నిత్యజీవితంలో భాగం కావాలి.

సత్యం కేవలం నాలుకతో మాత్రమే పలికేది కాదు. త్రికరణ శుద్ధితో పలికేది సత్యం. "మాటకు ప్రాణం, సత్యం, కోటకు ప్రాణం సైన్యం, జాతికి ప్రాణం నీతి. నోటుకు ప్రాణం వ్రాలు" అన్నారు. కనుక మొట్ట మొదట సత్యవాక్కును పాటించాలి. ఇచ్చినమాటను నిలబెట్టుకోవాలి. సత్యవాక్పరిపాలన అత్యంత పరమోత్కృష్ట ధర్మమని ఆచరణ ద్వారా నిరూపించాడు శ్రీరామచంద్రుడు. ఇచ్చిన మాటను నిలబెట్టుకోవటం కోసం, తన భార్యాబిడ్డలను కోల్పోయి కాటి కాపరిగా మారినాడు, సత్య హరిశ్చంద్రునిగా పేరు తెచ్చుకున్నాడు.

సుఖాన్ని, దుఃఖాన్నీ; మట్టినీ, మాణిక్యాన్నీ; మనిషినీ, మానునూ ఒకే దైవత్వ దృష్టితో చూచే సమత్వమే సమదర్శనం. అదే సత్యం. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని దర్శించటం ఆధ్యాత్మిక సత్యం. పంచభూతాలకు పరమ కారణం పరమాత్మ. అట్టి కారణమైన పరమాత్మ శాశ్వతుడు, అనంతుడు. నశించే పాంచభౌతిక ప్రకృతి సత్యం కాదు, నిత్యమైన పరబ్రహ్మమే సత్యం. కాబట్టి మానవుడు అజ్ఞానంతో ఆవరించబడిన ఆత్మను సత్యజ్ఞానంతో శోధించి, సాధించి, దివ్యుడు కావటానికి యత్నించాలంటారు బాబా.

"సత్యం అన్నింటికంటే ఉత్తమమైన నీతి. మరే ఇతర మార్గాల ద్వారా దేశానికి మేలు చేకూర్చలేము. అయితే సత్యాన్ని పాలించడం అగ్ని పరీక్షలాంటిది. బంగారం రాటు తేరాలంటే అగ్నిలో మండిస్తాం. సత్య పరీక్ష కూడా ఇట్టిదే" అంటారు బాలగంగాధర తిలక్.

# ప్రేమ

**ప్రేమరూపము బ్రహ్మంబు ప్రేమమయము**
**ప్రేమ ప్రేమతో సంధింప నీమమగును**
**కాన ప్రేమను పూర్తిగా కలిగియున్న**
**అద్వితీయము చెందగ నర్హుడగును. 46**

భగవంతుడు ప్రేమస్వరూపుడు. నిర్మలమైన ప్రేమయొక్క శక్తి అద్వితీయము. ప్రేమయే ప్రాణము, ప్రాణమే ప్రేమ. (Love is Life, Life is Love) ప్రేమ నేత్రములతో చూడదు. హృదయముతో చూస్తుంది. ప్రేమ పలుకులతోపలకదు, దయతో పలుకుతుంది. దయ, కరుణ, ప్రేమ- ఇవి భిన్న పదములే కాని వేరుకాదు. ప్రేమతత్త్వము హృదయమునుండి ఆవిర్భవించినటువంటిది, ప్రేమ అమృత మైనటువంటిది, ఆనందమైనటు

వంటిది, అనంతమైనటువంటిది. ఇట్టి ప్రేమ గల హృదయం అనంత విశాలమైనటువంటిది. ప్రేమచేత సాధించలేనిదంటూ ఈ జగత్తులో వేరొక్కటి లేదు. సర్వమునూ ప్రేమచేత సాధించవచ్చును.

నిష్కామ ప్రేమ, నిర్గుణమైన ప్రేమ, నిష్కపటమైన ప్రేమ భగవంతుణ్ణి బంధిస్తుంది. స్వార్థప్రేమ, సంకుచితమైన ప్రేమ కేవలం లోకమునే బంధింపజేస్తుంది. భగవంతునికి భక్తునికి మధ్య పరస్పర సంబంధం పవిత్రమైన ప్రేమయే. భగవంతుని ఎంతగా ప్రేమిస్తావో, భగవంతుడు నిన్ను అంతగా అనుగ్రహిస్తాడు.

*"జ్యోతికి ప్రాణాన్ని యిస్తుంది తైలము, ప్రేమ జీవితానికే వెలుగు నిస్తుంది"* అంటారు బాబా. భగవాన్ బాబావారు ప్రేమకు పెద్దపీట వేశారు. దేవునియందు చూపే ప్రేమ పూజ్యభావమిళితమైనది. దానినే 'భక్తి' అన్నారు. భగవంతునిపై ఉండు ప్రేమను సర్వులయందును ప్రసరింప చేయటమే సరియైన సమాజసేవ అంటారు బాబా.

సత్య, ధర్మ, శాంతి అహింసల యందు, ప్రేమ అంతర్వాహినిగా ఉంటుంది. ప్రేమ కనిపించేది కాదు, అనుభవించేది, అనుభూతిని పొందేది.

*"Love gives by giving and forgiving (పరులకు పెడుతూ పాపాన్ని క్షమించడంవలన ప్రేమ పెరుగుతుంది) Self lives by getting and forgetting (అందినదల్లా స్వాహా చేస్తూ, చేసిన మంచిని మరచిపోతూ ఉండటం వల్ల స్వార్థం వృద్ధి చెందుతుంది)"* అంటారు బాబా. ప్రేమ అనేటటువంటి పుష్పమును మనం వికసింపచేసుకొనినప్పుడు 'క్షమ' అనే పుష్పం సహజంగా మనకు లభిస్తుంది.

'ప్రేమ' ఒక గుణం కాదు. అది ఒక జీవన విధానం. సత్యధర్మ శాంతులు మూడూ ఒక ఎత్తు. ప్రేమ ఒక్కటే ఒక ఎత్తు. మొదటి మూడూ జీవుణ్ణి దేవుణ్ణిగా మార్చడానికి ఉపయోగపడతాయి. 'ప్రేమ' దైవత్వంలో జీవించడానికి తోడ్పడుతుంది. సత్య, ధర్మ, శాంతి - ఈ మూడూ మూడు కాళ్ళవంటివి. దీనిపైన ఉండినటువంటి చెక్కయే యీ ప్రేమ. ఈ 'ప్రేమ'

అనే చెక్క ముక్కాలి పీటే కాదు. సత్యధర్మశాంతులు సత్త్వరజస్తమో గుణములు. ఈ మూడు గుణములకు అతీతమైనటువంటిది ప్రేమ.

"మనయొక్క హృదయమే ప్రమిద. మన మనసే ఇందులో వత్తి. మన భక్తి ఇందులో తైలము. వైరాగ్యమే దీనికి నిప్పు పెట్టె. ప్రేమయే ఈ జ్యోతి స్వరూపము. ఈ ప్రేమజ్యోతి లేనప్పుడు మానవుడు అజ్ఞానాంధకారములో మునిగిపోతాడు. కనుక ప్రేమ ప్రతి ప్రాణికి ప్రధానమైనటువంటిది" అని అంటారు బాబా. కనుక ప్రేమ ద్వారానే పరమాత్మను దర్శించండి. భగవదానుగ్రహమును పొందండి !

*"Love is God, Live in Love (ప్రేమయే దైవం, ప్రేమలో జీవించు) అంతేకాదు Make others live in love (ఇతరులనుకూడా ప్రేమలో జీవించునట్లు చేయి!)* ఇదే ఈనాడు మనం చేయవలసిన పని" అంటారు బాబా.

## స్నేహము

**మట్టితో చేరి ఇనుమున పట్టు తుప్పు**
**అగ్నితో చేరి ఇనుము నదియు వీడు**
**సాహచర్యముచే నిట్లు జరుగుచుండు**
**సత్యమైనట్టి బాట శ్రీ సాయిమాట. 47**

ఇనుము మట్టితో కలిసి ఉన్నప్పుడు దానికి తుప్పు పడుతుంది. నిప్పుతో కలిస్తే దాని తుప్పు తొలగుతుంది. సహవాసమే ఈ రెంటికీ కారణం. మట్టితో కలిసినప్పుడు ఇనుముకు తుప్పు పట్టింది. అదే విధంగా చెడు స్నేహం చేస్తే చెడ్డవారవుతారు. తుప్పు పట్టిన ఇనుమును అగ్నిలో కాలిస్తే, పైన ఉన్న తుప్పు తొలగి ఇనుము ప్రకాశిస్తుంది. అదేవిధంగా మంచివారితో సహవాసం చేస్తే చెడు వైదొలగి మంచి పెంపొందుతుంది. చెడుకు, మంచికీ రెంటికీ సంగమమే కారణం. దుస్సంగం వలన దుర్బుద్ధి

పెరుగుతే సత్సంగం వలన సద్బుద్ధి పెరుగుతుంది. మానవుడు అధమ స్థాయికి దిగజారటానికి దుస్సంగం కారణమైతే, ఉన్నత స్థాయికి ఎదుగడానికి సత్సంగం కారణమవుతుంది.

మనం సంపదలతో విలసిల్లుతుంటే, *'హలో! హలో!'* అనే స్నేహితులు చాలామంది చుట్టూ చేరుతారు. *'ఇంద్రుడూ! చంద్రుడూ!'* అంటూ మనల్ని పొగడుతూ స్తుతిస్తుంటారు. మాటలు చెప్పి మనవద్దనున్న మూటలను మాయం చేస్తారు. దుర్జన సాంగత్యంలో పడి దురలవాట్లకు బానిసలవుతాం. మన దగ్గర సంపదలు తరిగిపోతే, అప్పటి వరకు వెంట తిరిగిన వారిలో చాలామంది దూరమైపోతారు. కంటికి కనపడక మటుమాయమవుతారు. కష్టకాలంలో కూడా ఛాయవలె ఎవరు విడవకుండా అంటిపెట్టుకొని ఉంటారో వారే నిజమైన 'మిత్రులు'. అట్టివారిదే నిజమైన స్నేహం. కనుక దుస్సంగమునకు ఎంత దూరంగా ఉంటే అంత శ్రేయస్కరం.

మంచివారి స్నేహం మనలో అహంకారాన్ని తగ్గిస్తుంది. అవగాహనను పెంపొందిస్తుంది; అసహనాన్ని తగ్గిస్తుంది. సహనాన్ని పెంపొందిస్తుంది; మన జీవనగతిని తీర్చిదిద్దుతుంది. భగవంతుని చేరడానికి మార్గాన్ని సుగమం జేస్తుంది. సత్సంగం మనలో సంస్కారాన్ని పెంపొందిస్తుంది.

సత్సంగం చాలా శక్తివంతమైనది. అయస్కాంతము ఇనుమును ఆకర్షించినట్లు. సత్సంగము అందరినీ ఆకర్షిస్తుంది. *'Laziness is rust and dust, relisation is best and rest'* సోమరితనమే తుప్పు ధూళి. ఆత్మసాక్షాత్కారము ఉత్తమోత్తమమైన దంటారు బాబా. ఇనుము మట్టితో కప్పబడితే తుప్పు ఆవరిస్తుంది. ఇనుము తన శక్తిని కోల్పోతుంది. అదే విధంగా సోమరితనం విద్యార్థులను ఆవరిస్తే వారి తెలివితేటలు బండబారి పోతాయంటారు బాబా. *"మానవునిలో విశిష్టమైన దివ్యత్వం ఉండినప్పటికినీ, దానిని తెలుసుకోలేక, అత్యల్పమైన భావములు తనలో*

ప్రవేశపెట్టుకోవటం చేత మానవత్వాన్ని స్వతఃసిద్ధంగా కోల్పోతున్నాడు" అని బాబా చెబుతూ ఒక చిన్న ఉదాహరణ చెప్పారు. ఇనుప ముక్కను మట్టిలో వేస్తే కొంతకాలానికి Dust (దుమ్ము) పట్టి Rust (తుప్పు) గా మారుతుంది. ఆ Rust (తుప్పు) పట్టటంచేత ఇనుము శక్తి అంతా Burst (బ్రద్దలై) అయిపోతుంది. ఈ Burst (బ్రద్దలైనపుడు) అయినప్పుడు దానిని అగ్నిలో వేసి Test చేయాలి. (అనగా అగ్నిలో కాల్చాలి). ఈ Test చేసినప్పుడు దానిపైనున్న మాలిన్యం (తుప్పు) అంతా పోయి ప్రకాశవంతమైన ఇనుముగా రూపొందుతుందని చెబుతూ అదేవిధంగా మానవుడు కూడా అజ్ఞానమనే 'మాయ'లో పడి తనలోనున్న దివ్యత్వాన్నే విస్మరిస్తున్నాడు. తన శక్తిని తాను గుర్తించుకోలేకపోతున్నాడు. ఈనాడు మానవుడు అల్పత్వాన్ని ఆశించి, ఆధికత్వాన్ని విస్మరించి, మానవత్వాన్నే కోల్పోతున్నాడు. కనుక మొట్టమొదట మీలోనున్న అల్పభావాలను దుఃఖవిచారములను జ్ఞానాగ్నిలో వేసి, కాల్చి అల్పజీవులని భావించక, ఆత్మస్వరూపులుగా విశ్వసించమంటారు బాబా.

**మంచివారు మేలు మరువక యుందురు**
**కష్టకాలమందు కాచియుంద్రు**
**కామధేనువొసగు కడు క్షీరములెకాని**
**విషము నెట్లొసగు విమల చరిత్ర. 48**

చేసిన మేలును మరువని వారు కృతజ్ఞులు, మంచివారు. చేసిన మేలును మరచేవారు కృతఘ్నులు, చెడ్డవారు. అభివృద్ధిలోనున్నప్పుడు అందరూ మిత్రభావమునే చూపుతుంటారు. స్వప్రయోజనం కోసం స్నేహమును ప్రదర్శించుతూ ఉంటారు. కాని కష్టకాలం దాపురించినప్పుడు మాత్రం నిజమైన మిత్రులు తప్ప అందరూ దూరమవుతారు. పైపెచ్చు అభాండాలు, అపనిందలు కూడా మోపటానికి ఏ మాత్రం వెరువరు. కష్టకాలంలో కూడా ఛాయవలె ఎవరు విడవకుండా, ఇంటా, వెంట, జంట,

అంటిపెట్టుకొని ఉంటారో, అట్టివారే నిజమైన 'మిత్రులు'. అట్టివారిదే నిజమైన స్నేహం. ఆపదలు సంభవించినప్పుడు, సంపదలు కోల్పోయి నప్పుడు, ఊహించనటువంటి ప్రమాదములు ఏర్పడినప్పుడు అసలు మిత్రుడెవరో అర్థమవుతుంది. అప్పటివరకు అమిత ప్రాణస్నేహితులుగా ఉంటూ వెంబడి తిరిగే వారిలో చాలామంది దూరమై పోతారు. కంటికి కనపడకుండా మటుమాయమవుతారు. నిజమైన మిత్రుడు, ప్రాణ స్నేహితుడు తప్ప మిగతావారందరూ అదృశ్యమై పోతారు. మనకు సంభవించిన సుఖదుఃఖములలో సరిసమానంగా పాలు పంచుకుంటూ ఎవరు వెంబడి ఉంటారో వారే నిజమైన మిత్రులు.

ఇదే భావమును భర్తృహరి సుభాషితములలోని ఈ క్రింది పద్యము చాటుచున్నది.

"అఘము వలన మఱల్చు హితార్థకలితుఁ
జేయు గోప్యంబు దాచు బోషించు గుణము
విడువఁడా పన్ను లేవడి వేళనిచ్చు
మిత్రుడీ లక్షణంబుల మెలగుచుండు."

అనగా పాపపు పనులనుండి మఱల్చుట, మంచి పనులు చేయుటకు పురిగొల్పుట, రహస్యములను దాచుట, మంచి గుణములను మాత్రం వెల్లడిచేయుట, ఆపదలు సంభవించినప్పుడు విడచిపోకుండుట, లేనప్పుడు అవసరమైన దానినిచ్చుట మొదలైనవి నిజమైన మిత్రుని లక్షణములు. "మాతా మిత్రం పితా చేతి స్వభావాత్త్రితయం హితం" "తల్లిదండ్రుల తరువాత సహజంగా ప్రేమించుచూ మేలుకోరేవాడు మిత్రుడు". అనే ఆర్యోక్తి కూడా కలదు. అటువంటి ప్రాణస్నేహితుడు లాంటి మిత్రుడు దొరకటం అందరూ నోచుకోలేరు.

ఇక్కడ ఈ పద్యములో భగవాన్ బాబావారు మంచి స్నేహితుని కామధేనువుతో పోల్చారు. కామధేనువు అడిగినన్ని పాలు యిస్తుంది గాని,

విషం యివ్వదుగదా ! అంతేకాదు 'కామధేనువు' అనగా కోరిన కోరికలను నెరవేర్చునది అని అర్థము. అదేవిధంగా నిజమైన స్నేహితుడు మన మంచినే కోరుతాడు కాని చెడును ఏమాత్రం కోరడు.

# క్షమ

క్షమ సత్యము క్షమ ధర్మము
క్షమ యోగము క్షమ మహింస క్షమయజ్ఞమగున్
క్షమ సంతోషము క్షమ దయ
క్షమయే ఆధారమగును సర్వంబునకున్ 49

అన్నారు బాబా. ప్రతి మానవుడు తన జీవితంలో ప్రధానంగా సాధించవలసిన సద్గుణం 'ఓర్పు'. ఇది చదువుకుంటే వచ్చేది కాదు, గురువు బోధిస్తే అబ్బేది కాదు. బజారులో లభ్యమయ్యే వస్తువు అంతకన్నా కాదు. దీనిని నిరంతర సాధన వలన మాత్రమే సాధించవచ్చును.

"క్షమగవచంబు" క్షమను కవచంతో పోల్చాడు భర్తృహరి. క్షమ అనగా ఓర్పు. అవమానాదులు సంభవించినప్పుడు, కష్టంవల్ల దుఃఖము కలిగినప్పుడు, కోపతాపములకు ఎట్టి అవకాశం ఇవ్వకుండా ఈ 'ఓర్పు' అనే సద్గుణం అడ్డుగోడలా ఉండి మానవుణ్ణి రక్షిస్తుంది. 'ఓర్పు' అనే కవచం గల వ్యక్తిని భౌతికమైన కష్టములు ఏమీ చేయలేవు, మనలను ఎవరైనా, ఏమన్నా చులకనగా మాట్లాడినా, పరుషంగా తిట్టినా మనకు పోయేది ఏమీ లేదు. అంత మాత్రమున మన విలువ ఏమాత్రం తగ్గదు, కాని మనకుండవలసిన ఓర్పు కనుక మనకుంటే మనలను ఎవ్వరూ ఏమీ చేయలేరు. కనుక అటువంటి అభేద్యమైన క్షమాకవచమును ప్రతి ఒక్కరూ సంపాదించి తీరాలి.

ఈ ఓర్పును కోల్పోయినట్లయితే, ఎంతోకాలం కష్టించి, శ్రమించి, కృషిచేసి సంపాదించిన మంచి పేరు ప్రతిష్టలు ఒక్క క్షణంలో భస్మీపటలం అయిపోతాయి. ఈ సద్గుణం లోపించినందువలన ఎంతోమంది మహా తపస్సంపన్నులు ఎందుకూ పనికిరాకుండా భ్రష్టులై పోయినారు. రాజాధిరాజులు తమ రాజ్యములనే కోల్పోయినారు, పండితులు పతనమైపోయినారు. ఓర్పు మానవతా గుణం. ఇది మానవునకు ప్రధానమైన అందమైన నగ వంటిదంటారు బాబా.

సాధనయందు, పవిత్రమైన కార్యములయందు, పరులను దూషించే మాటలయందు మనము ఓర్పును సాధించాలి. ఆధ్యాత్మిక మార్గమునకు, ఆత్మతత్త్వమునకు అడ్డు తగిలేదానిపైన మనము ఓర్పును సాధించాలి. ఓర్పును సాధించినప్పుడే నిత్యసత్యమైన ఆత్మతత్త్వము అవగతమవుతుంది. సాధకునకు ఓర్పు ప్రధాన సోపానమంటారు భగవాన్ బాబా.

17 పర్యాయములు తనపై దండెత్తి వచ్చిన మహమ్మద్ ఘోరీని క్షమించి వదలిపెడతాడు పృథ్వీరాజ్. కానీ ఘోరీ కృతఘ్నుడుగా మారిపోయి కుట్రలు పన్ని జయచంద్రుని సహాయంతో, పృథ్వీరాజ్‌ను పట్టుకొని, అతని కండ్లను పెరికించి వేస్తాడు. ఇలాంటి త్రాచుపాము స్వభావము కలిగినవారియందు "క్షమ"ను ఉపయోగించరాదంటారు బాబా. మన ఓర్పు ఇలాంటి కృతఘ్నుల యెడల ఎంతమాత్రం ఉపయోగించరాదు. సమయ సందర్భాల ననుసరించి, విచక్షణా జ్ఞానమును వినియోగించి ఈ 'ఓర్పు' ను ఉపయోగించుకోవాలి. అయితే ఓర్పునకు ద్వేషము, అసూయ చేరకుండా చూచుకోవాలి. ద్వేషాసూయలు ఇందులో ప్రవేశిస్తే ఓర్పును క్షణంలో కోల్పోతామంటారు బాబా.

"క్షమాగుణము" ను మనం స్వంతం చేసుకుంటే, అన్నింటినీ సాధించగలుగుతాం. సర్వమునకు క్షమయే ఆధారము గదా! ఎన్ని విద్యల

నార్జించినా, ఎంతటి శక్తిసామర్ధ్యములుండినా 'ఓర్పు'ను కోల్పోతే సర్వమునూ కోల్పోతాం. కనుక ప్రతి మానవుడు తన జీవితంలో ప్రధానంగా సాధించవలసిన సద్గుణం 'క్షమ' మానవత్వానికి క్షమ మాణిక్యము వంటిది, క్షమాశీలి మాత్రమే క్షమాభిక్షను పెట్టగలడు.

## శమము

**సాధనలు చేసి ఫలమేమి శమము లేక**
**యోగములు పూని ఫలమేమి ఓర్పులేక**
**జపము లొనరించి ఫలమేమి శాంతి లేక**
**చవిటి భూమిని దున్నిన సరణి కాదె. 50**

"*సాధనమున పనులు సమకూరు ధరణిలోన*" అన్నారు బాబా. నడవటానికి ప్రయత్నం చేస్తే చీమైనా కొన్ని మైళ్లదూరం ప్రయాణం చేస్తుంది. ఎగరటానికి ప్రయత్నం చేయకపోతే గ్రద్ద ఒక గజం దూరమైనా ప్రయాణం చేయలేదు. ధ్రువుడు సాధన వలననే ధ్రువపదాన్ని పొందగలిగాడు. గరుత్మంతుడు సాధన వలననే అమృతాన్ని సాధించి మాతృదాస్యమును తొలగింపగలిగాడు. కనుక సర్వ ఫలితములు సాధన మీదనే ఆధారపడి ఉన్నాయి. ప్రయత్నం లేకుండా ఏ పనీ సాధించబడదు.

ఆత్మసాక్షాత్కార సాధనలో కలిగే అడ్డంకుల కన్నింటికీ రాగద్వేషాలే మూలకారణం. వాటిని జయించటమే సాధన. మనం ఎన్నుకొనే మార్గం అది ఏదైనా గమ్యం మాత్రం ఒక్కటే. అదే ఆత్మసాక్షాత్కార మంటారు బాబా.

కామక్రోధాదులు అణచుకోలేని సాధనలు ఎన్ని చేసినా ప్రయోజనం లేదు. అరిషడ్వర్గములను అరికట్టుకోలేని సాధనల వలన

ప్రయోజనమేమిటి ? కామ, క్రోధ, లోభములే సాధకుని పరమ శత్రువులు. కామం పెరిగి పెనవేసుకొని, ఉరిగా మారిపోయి, తనతోపాటు తన వంశమునే నాశనం గావించుకున్నాడు రావణాసురుడు. పంచభూతములను వశం చేసుకొన్న హిరణ్యకశిపుడు క్రోధంతో సర్వనాశనం అయినాడు. దుర్యోధనునిలో అసూయ పెరిగి, ద్వేషం పెల్లుబికి, లోభంతో ధర్మ మూర్తులైన పాండవులకు సూదిమొన మోపే స్థలం కూడా యివ్వడానికి నిరాకరించి, తనతోపాటు తన కుటుంబాన్నే సర్వనాశనం గావించుకున్నాడు. *"రామాయణం లోపల కామం, భాగవతం లోపల క్రోధం, భారతం లోపల లోభం ఈ మూడింటి ద్వారానే సర్వశక్తివంతులైనవారు సహితం సర్వనాశనం అయినారు"* అంటారు బాబా. కనుక కామ, క్రోధ, లోభము (శమము)లు అణచుకోలేని సాధనల వలన ప్రయోజనం శూన్యం.

దుర్వాస మహాముని యోగి. కాని ప్రయోజనం ఏమిటి ? ఓర్పు అనేది ఆయనలో భూతద్దం వేసి వెతికినా కనిపించేది కాదు. ఓర్పు, ఓర్మి, సహనములను కోల్పోయినట్లయితే, ఎంతో కాలం శ్రమించి, సాధించిన యోగఫలం ఒక్క క్షణంలో భస్మీపటలం అయిపోతుంది. ఈ సద్గుణములు లోపించినందువలననే ఎంతోమంది మహాతపఃసంపన్నులు యోగభ్రష్టులై పోయినారు. భర్తృహరి క్షమను కవచంతో పోల్చాడు. ఓర్పు అనే కవచం గల వ్యక్తిని భౌతికమైన కష్టములు ఏమీ చేయలేవు. కనుక ఓర్పు, ఓర్మి సహనములను సాధించలేని యోగములు నిష్ప్రయోజనం.

ఎన్ని జపతపము లొనరించినప్పటికీ శాంతిలేని వానికి సుఖం లేదు. సాధకుడు అంతిమ లక్ష్యానికి చేరుకోవటానికి మొదటగా చేరాల్సిన తొలి మజిలీ 'శాంతి'. మన సంకల్ప వికల్పములే మనకు మనశ్శాంతిని లేకుండా చేస్తున్నాయి. *"అశాంతికి మూలం అదుపులేని ఆశలు, కళ్ళాలు లేని కోరికలే"* అని అంటారు బాబా.

నిజమైన శాంతిని పొందగోరువారు సంసారమును వదలిపోనక్కరలేదు. లోకాన్ని, సంసారాన్ని వదలివెళ్ళి దూరంగా ఉన్నంత

మాత్రమున శాంతి లభించదు. ఆర్భాటంగా చేసే జపతపాదుల వలన నిజమైన శాంతి లభించదు. "అంతఃకరణమునందు వాసనలను విచారణాగ్నిచే మాడ్చినప్పుడే నిజజ్ఞాని కాగలడు. నిజ శాంతిని అనుభవించ గలడు" అని అంటారు బాబా. ముప్పైవేల సంవత్సరాలు ఘోరతపస్సు చేసినా విశ్వామిత్రునికి శాంతి లభించలేదు. అంతఃశత్రువులను జయించనిదే మానవునికి శాంతి లేదు. శాంతిని సాధించడానికి ఇంద్రియ నిగ్రహం. శమదమాదులే ముఖ్యము కాని జపతపాదులు కావనే సత్యాన్ని విస్మరించరాదు.

శమములేని సాధనలు, సహనము లేని యోగములు శాంతిని చేకూర్చని జపతపాదుల వలన ఎంతటి ప్రయోజనమో ! చవిటి భూమిని దున్నినా అంతే ప్రయోజనం

# కృషి - కృప

**వాన వచ్చినంత వసుధపై పండునే**
**పృధ్వి నాటకున్న విత్తనములు**
**విత్తనములు నాటి పెట్టినా ఎంతైన**
**వానలేకయున్న ఫలము లేదు. 51**

విత్తనములు భూమిలో నాటకమునుపు వర్షం పడినా మొక్కలు మొలవవు గదా ! విత్తనములు నాటినప్పటికినీ, వర్షము లేకపోతే ఆ విత్తనములు మొలవనే మొలవవు.

"కార్యసిద్ధికి వ్యక్తి కృషి, దైవకృప రెండూ అవసరమే. కృషి, కృప రెండూ నెగిటివ్, పాజిటివ్ వంటివి. దైవకృప ఉండినప్పటికి మానవ కృషి సరిగా లేకున్న కార్యసిద్ధి జరుగదు. అదేవిధంగా వ్యక్తి కృషి ఉండినప్పటికీ

దైవకృప లేకపోతే కార్యసిద్ధి చేకూరదు" అంటారు బాబా. కనుక ప్రతి వ్యక్తీ శక్తివంచన లేకుండా కృషిచేస్తూ, దైవకృప (దైవానుగ్రహం) కోసం తగిన సాధనలు చేయాలి.

"కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు మన అనుభవజ్ఞులైన పెద్దలు. కృషి లేకుండా విద్యార్థి ఉత్తీర్ణుడు కాలేడు. రైతు కృషిచేయకుండా పంటలు పండించలేడు. వ్యక్తి ఏ రంగంలో విజయాన్ని సాధించాలన్నా కృషి అత్యవసరం. అయితే మానవుడు ఎంత కృషిచేసినా, దైవకృప గనుక లేకపోతే ఆ కార్యం సిద్ధించదు.

కనుక మానవ కృషితోపాటు దైవకృప కూడా ఉండినప్పుడే కార్యసిద్ధి చేకూరుతుంది. దైవకృప ఉంటే చాలు అన్నీ అవే సమకూరు తాయని కేవలం భజన చేస్తూ కూర్చుంటే పొట్టనిండదు. కృషిచేస్తూ, దైవకృప కోసం సాధనలు సలపాలి.

## ప్రాప్తి

**చెంబు బావియందు, చెరువునందును గూడ**
**పట్టినంత నీరె పొట్ట నింపు**
**ప్రాప్తి యెంతో యంతె ఫలము ఎందేగినా**
**ఉన్నమాట తెలుపుచున్న మాట. 52**

అన్నారు బాబా. ఇది అనుభవంలో చెప్పిన మాట. చెంబు తీసుకొని వెళ్లి బావిలో ముంచినా, చెరువులో ముంచినా, నదిలో ముంచినా, దానిలో పట్టినంత నీరే వస్తుంది గాని ఎక్కువ ఏమాత్రం రాదు. చెంబును చిన్న బావిలో ముంచుతే తక్కువ జలం వస్తుందనిగాని, మహాసముద్రంలో ముంచుతే ఎక్కువ జలం వస్తుందని గాని ఆశించరాదు. ఎక్కడ, దేనిలో ముంచినా ఆ చెంబులో పట్టినంత నీరే వస్తుంది. అదే విధముగా మన

అదృష్టమును బట్టి ఫలితముంటుంది. మరుభూమి వద్దకు వెళ్లినా అంటేది అంటక మానదు. బంగారపు కొండ వద్దకు వెళ్లినా అంటనిది అంటదు. రావల్సింది రాకమానదు. పోవల్సింది పోక మానదు. మన ప్రాప్తం ఎంతో అంతే లభిస్తుంది. ప్రాప్తమునకు మించి ఏమాత్రం లభించదు. ఇదే వాస్తవమును భర్తృహరి కూడా చక్కగా వివరించాడు.

వనజభవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము ఘనంబో కొంచెమో
విను మరుభూమి కేగిన లభించును మెరుపు జేరబోయినన్
దనమధికంబురాదు కడు దైన్యంబు మాను ధనాఢ్యులందు న
వ్వననిధి నూతదుల్యముగ వారి గ్రహించు ఘటంబు సూడుమా.

ఇది విస్మరించరాని యదార్థం, మరువలేని వాస్తవం. కుండను బావి యందు ముంచినా, సముద్రమునందు ముంచినా దానిలో పట్టినంత జలమునే గ్రహిస్తుంది గాని ఎక్కువ గ్రహించదు. ప్రాప్తి యెంతో అంతే. కనుక కలిగిన దానితో తృప్తి జెందాలి. దీనత్వంతో వ్యాకుల పడకూడదు. తృప్తి లేనివానికి మనశ్శాంతి ఉండదు. సంతృప్తిలోనే ఉన్నది సంతోషం. సంతోషం సగం బలం గదా! *"తృప్తి గలవాడే జ్ఞాని, అసంతృప్తుడే అజ్ఞాని"* అని అంటారు భగవాన్ బాబా.

# నమ్మకము

**నమ్మకమను రెండు నయనంబులే లేని**
**అంధులైరి జనులు అవనియందు**
**తాము చూడకున్న దైవంబు లేడాకో !**
**తనకు లేడు గాని మనకు లేడ ? 53**

ఆత్మరూపుడైన భగవంతుణ్ణి చూడటానికి నమ్మకమే మానవునకు రెండు నయనాలని భగవాన్‌బాబా వారు ప్రబోధించారు. ఈనాడు ఆధునిక మానవ సమాజంలో అశాంతి చెలరేగటానికి మూలకారణం దైవత్వం మీద, మానవత్వం మీద నమ్మకం లేకపోవటమే. శాస్త్రములయందు, గురువులయందు, దైవమునందు పరిపూర్ణ విశ్వాసం, అచంచలమైన భక్తిశ్రద్ధలతోపాటు ఆత్మవిశ్వాసం కూడా ఉండాలి. దైవత్వాన్ని నమ్మటమంటే తన ఆత్మధర్మాన్ని తాను నమ్మటం. మానవత్వాన్ని నమ్మటమంటే తన మనుగడనే తాను నమ్మటం. ఒక పర్యాయం స్వామి వివేకానంద *"Faith, Faith in ourselves, Faith, Faith in God, that is the secret of Greatness"* నమ్మకం, నమ్మకం తన యందు నమ్మకం, దేవునియందు నమ్మకం - ఇదే ఔన్నత్యమునకు విజయమునకు కీలకం' అన్నారు. ప్రపంచంలో ఈనాడు చాలామందిలో విశ్వాసం. నమ్మకం లోపించినందువల్లనే లక్ష్యమును చేరుకోలేకపోతున్నారు.

*"సంశయాత్మా వినశ్యతి"* సందేహించు మనస్సు గలవాడు పూర్తిగా నశించుచున్నాడని దీని అర్థము. ఆత్మవిశ్వాసానికి వేరుపురుగు అనుమానం. అనుమానం పెనుభూతం. అనర్థాలకు మూలం అనుమానం. సంశయం సర్వనాశనానికి దారితీస్తుంది. అపనమ్మకం అరిష్టాన్ని తెచ్చిపెడుతుంది. అవిశ్వాసం ప్రగతికి అవరోధం. సంశయంతో, అపనమ్మకంతో, అవిశ్వాసంతో ఏ పని ప్రారంభించినా సఫలీకృతం కాదు. కనుక సంశయాలను విడనాడి, తన శక్తిమీద నమ్మకం ఉంచి, దైవం మీద విశ్వాసముంచి, ఆత్మవిశ్వాసంతో ముందుకు నడవాలి. అప్పుడే ఈ జీవన సంగ్రామ రంగంలో విజయలక్ష్మిని చేబట్టగలుగుతాం.

*"నీ కండ్లకు కనపడకున్నంత మాత్రమున దేవుడే లేడనడం అవివేకం. నీకు లేడు కనుక మాకు లేడనుకోకు. విశ్వాసమున్న వారికి ఎప్పుడూ ఉంటాడు"* అంటారు బాబా. భూమి కొన్ని వేలమైళ్ల వేగంతో తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని,

తత్ఫలితంగా రేయింబవళ్లు ఏర్పడుతున్నాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. అయితే అదే భూమిమీద మనం నివసిస్తున్నాం. దాని కదలిక మనకు ఏమాత్రం కనిపించటం లేదు. కదులుతున్నట్లుగా అనిపించటంలేదు. కనుక భూమి స్థిరంగా ఉందని చెప్పటం విజ్ఞత అనిపిస్తుందా ?

ఒక ఆస్తికుడు *'There is God'* (అక్కడ దేవుడున్నాడు) అంటాడు. మరో నాస్తికుడు *'There is no God'* (అక్కడ దేవుడు లేడు) అంటాడు. ఈ పదములలో ఉన్న అంతరార్థమును చక్కగా సూక్ష్మబుద్ధితో విచారణ చేస్తే అందులోనే మనకు ఒక సత్యం స్పష్టమవుతున్నది. ఉన్నదానినే లేదని చెబుతున్నాడుగాని, లేనిదానిని లేదని చెప్పటం లేదు. ఇక్కడ ఈ పదమును మనము చూచినప్పుడు *'THERE IS'* అని మొదట వచ్చినది. తరువాత *'NO GOD'* అని వచ్చింది. నాస్తికత్వం ముదిరినటువంటివాడు యింకా కొంత స్థాయి పైకిపోయి *'GOD IS NO WHERE'* అంటున్నాడు. ఇక్కడ నాలుగు పదములున్నవి. ఇందలి WHERE లో 'W' ను NO కు కలుపుతే *'GOD IS NOW HERE'* అవుతుంది. ఇది పదముల మ్యాజిక్ లాగే కనపడినప్పటికీ, ఈనాటి నాస్తికులు తమకు కనపడటం లేదు కాబట్టి కనపడనటువంటి వాడిని గురించి లేడని వాదించడం ఎంతవరకు వివేకం? ఈనాడు ఒక సామాన్యమైన మంత్రిగారి ఇంటర్వ్యూను పొందటానికి ఎంతో ప్రయత్నం చేయవలసి వస్తున్నపుడు, ఈ సృష్టి స్థితి లయకారకుడైన జగద్రక్షకుని దర్శించాలంటే సామాన్యమా ? ఎంత సాధన చేస్తే సాధ్యమవుతుందో ? ఈ దృష్టితో ఆలోచించకుండా ఈ సృష్టికి మూలపురుషుడైన వానిని లేనే లేడంటం అవివేకం కాదా ?

దేవుడున్నాడని, లేడనే అనవసరమైన తర్కవితర్కాలలో అమూల్యమైన పవిత్రమైన కాలమును వృథాపరచకుండా, సమాజ సేవనే సర్వేశ్వరుని సేవగా భావించి, పాపభీతిని, దైవప్రీతిని అభివృద్ధి పరచుకొని, తన శక్తిమీద నమ్మకంతో, దైవం మీద విశ్వాసంతో ముందుకు పోతుంటే ఎంతటి పెద్దకార్యాలనైనా సాధించవచ్చును.

# సోమరితనము

కొన్న కూర బేడ కూలియా పావలా
ఇదియె నాగరికత ఇపుడు మనకు
ఎవరి పనులు వారు ఏమరుకుండగ
నిర్వహించుకొనుట నేర్వవలయు. 54

ఈనాడు నాగరికత పేరుతో అనవసరంగా డబ్బు ఖర్చు చేస్తున్నారు. ఎవరిపని వారు చేసుకోవటం అనాగరికతగా భావిస్తున్నారు. ఫర్లాంగు దూరంలేని కూరగాయల మార్కెట్‌కు వెళ్ళడానికి రిక్షా కావాలి. మరల రావటానికి రిక్షా కావాలి. మార్కెట్‌లో కొనే కూరల ఖరీదు పదిరూపాయలు అయితే రిక్షా ఖర్చులు రానూపోనూ ఎనిమిది రూపాయలు అవుతున్నాయి. దీనివలన మూడు నష్టాలు. 1 డబ్బు నష్టం 2. ఆరోగ్యం చెడిపోవటం, 3. సోమరితనం పెరగటం.

ఈనాడు సామాన్య మధ్యతరగతి కుటుంబీకుడు రిక్షాలకు నెలకు కనీసం వందరూపాయలు ఖర్చుచేస్తున్నాడు. ఇది వృధాగా చేసే ఖర్చేగదా ! ఈ ఖర్చును తగ్గిస్తే మరో మంచి పనికి ఉపయోగించవచ్చును గదా! అదుపు-పొదుపు- ఈ రెండూ మానవుడు విధిగా ఆచరణలో పెట్టవలసినవి. అది భాషపై అదుపు, ధన వ్యయంపై పొదుపు, ఆశలపై అదుపు, ఆహారపదార్థముల వినియోగంపై పొదుపు ఉండాలి. *"అతి భాష మతి హాని, మిత భాష అతి హాయి"* అన్నారు బాబా. అదే విధంగా *"అతి తిండి మతి హాని, మిత భాష అతి హాయి, అతి ఆశ మతి హాని, మిత ఆశ అతి హాయి; అతి రాగము మతి రోగము, మితరాగము అతి హాయి"* అన్నారు గదా! కనుక *"అతి సర్వత్ర వర్జయేత్"* అనేది విస్మరించరాదు.

*"ఆరోగ్యమే మహాభాగ్యము గదా!"* ఆరోగ్యం కోసం ప్రతిరోజా కొంతదూరం నడవాలంటున్నారు డాక్టర్లు. Walking is the simplest

and the best Exercise. (నడక తేలికైన మరియు మంచిదైన వ్యాయామము) అయితే ఈనాడు చాలామంది ప్రొద్దున్నే లేచి నడుస్తున్నారు. ఫర్లాంగు దూరం కూడాలేని మార్కెటుకు మాత్రం రిక్షాలో వెళ్ళి రిక్షాలో వస్తున్నారు. ఇకపోతే Laziness is Rust and Dust. (సోమరితనం తుప్పు, ధూళి) ఈనాటి వారిలో సోమరితనం ప్రబలిపోతున్నది. సోమరితనం ప్రగతికి అవరోధం. కనుక దీనిని దరికి చేరనీయరాదు. ఇనుము మీద Rust మరియు Dust ఉండటం వలననే అయస్కాంతం దానిని ఆకర్షించలేకపోతున్నది. అదే విధంగా మానవుడు అజ్ఞానమనే 'మాయ'లో పడి తనలోనున్న దివ్యత్వాన్ని విస్మరిస్తున్నాడు.

కనుక ప్రతి మానవుడు ఎవరిపనులు వారు చేసుకోవటానికి అలవాటు పడాలి. పరులమీద ఆధారపడరాదు. 'ఆత్మబుద్ధి సుఖం చైవ' అన్నారు గదా!

## మానము - మౌనం

**మానము, మౌనము రెండును**
**మానవునకు నెల్లయెడల మాన్యత దెచ్చున్**
**మానవిహీనున కెందును**
**కానగ గౌరవము నెచట కలదేయరయన్. 55**

మానము, మౌనము - ఈ రెండూ మానవునికి మంచి గౌరవ ప్రతిష్ఠలు తెచ్చిపెడుతాయి. మానవిహీనునికి అనగా గుణవిహీనునికి, శీలరహితునికి ప్రపంచంలో ఎక్కడా గౌరవము కనిపించదు.

జీవితానికి విలువనిచ్చేది మానాభిమానాలు. శీలమే లేకపోతే ఆ జీవితానికి విలువేలేదు. జీవితానికి విలువనిచ్చేది శీలం (Character). శీలమే జీవునికి అలంకారం. మానము కలది మానవతి, శీలము

కలది శీలవతి. మానం పోతే అవమానమే. శీలం కనుక పోతే చిల్లికుండతో సమానం. సామాన్యులు బాహ్యసౌందర్యమునకు విలువనిస్తుంటారు. భగవంతుని దృష్టిలో మాత్రం సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద. ఎంతటి జ్ఞానులైనప్పటికినీ, వారికి వినయ విధేయతలు, మానమర్యాదలు, సచ్ఛీల సంస్కారములు గనుక లేకపోతే నాశనమైపోతారు. వారు కష్టించి సముపార్జించిన 'జ్ఞానతపస్సు' బూడిదలో పోసిన పన్నీరు' వలె ఎందుకూ పనికిరాకుండా పోతుంది.

ధనం ప్రధానం కాదు. గుణం ప్రధానం. ప్రతి జీవికి శీలం ప్రాణాధారం. మానం జీవునికి అలంకారం. కనుక ప్రతి వ్యక్తికీ వ్యక్తిగత శీలము (Personal Character) ఉండాలి. జాతీయ శీలం (National Character) కూడా ఉండాలి. శీలరాహిత్యం అత్యంత ప్రమాదకరమైనది. సచ్ఛీలము (Good Character) లేని వ్యక్తి తనను తాను ఉద్ధరించు కోలేడు. దేశానికి ఏమాత్రం ఉపయోగపడలేడు. కనుక ఈ రెండు శీలములు సంపాదించి ప్రతి ఒక్కరూ జీవితమును సార్ధకము చేసుకోవాలి.

ఇకపోతే మౌనము రెండు విధములు. 1. వాఙ్మౌనము. 2. మనో మౌనము. భగవద్గీతలో దీనిని మానసిక తపస్సునందు చేర్చబడినది. దీని ప్రధాన లక్షణములు. మనస్సును నిర్మలముగా నుంచుట. ముఖము ప్రసన్నంగా నుంచుట. సర్వవేళలా పరమాత్మను గూర్చిన మననం. మనస్సును బాగుగా నిగ్రహించుట, పరిశుద్ధమైన భావములను మాత్రమే కలిగి ఉండుట. వాఙ్మౌనము అనగా మాట్లాడకుండా ఉండటం. మనో మౌనము అనగా దృశ్యసంకల్పము లెవ్వియూ లేక ఆత్మయందే స్థితి కలిగియుండుట. మనస్సును బాగుగ నిగ్రహించుట. వాఙ్మౌనము, మనోమౌనమునకు సహాయకారిగా ఉండగలదు. కేవలం వాఙ్మౌనం వలననే ప్రయోజనంలేదు. మనస్సు చాలా చంచలమైనది. పైకి మాట్లాడకుండా మౌనం వహించినా మనస్సు మాత్రం మహావేగంగా సంచరిస్తూనే ఉంటుంది.

కనుక మనస్సును బాగుగా నిగ్రహించుటే 'మనోమౌనము' యొక్క లక్ష్యము. దీనినే 'మానసిక తపస్సు' అంటారు.

కనుక మానము, మౌనము - ఈ రెండూ మానవుని ఉన్నతికి ఎంతగానో తోడ్పడుతాయి.

## సుజ్ఞాని - అజ్ఞాని

**తనదు తప్పు తాను తరచును సుజ్ఞాని**
**పరుల తప్పులెల్ల పట్టువాడు**
**తనను తానెరుగడు తన తప్పు నెరుగడు**
**ఇట్టివాడు భువిని పుట్టనేల ? 56**

అన్నారు బాబా. సుజ్ఞాని అయినవాడు మొట్టమొదట తన తప్పును తాను తెలుసుకొని, సరిదిద్దుకోవటానికి ప్రయత్నం చేస్తాడు. ఎదుటి వారిలోన మంచిని గురించి మాత్రమే ప్రచారం చేస్తాడు, ప్రశంసిస్తాడు ఇది ఉత్తమ లక్షణం. ఇకపోతే అజ్ఞాని అయినవాడు ఎదుటివారిలోని మంచిని ప్రశంసించకుండా, వానిలోని చెడును మాత్రమే తీసుకొని ప్రచారం చేస్తుంటాడు. ఇది మధ్యమ లక్షణం. ఇకపోతే మూర్ఖుడు అయినవాడు తనలోనున్న చెడును బహిర్గతం చేయకుండా, తన మంచి గురించే ప్రచారం చేసుకుంటాడు. ఇతరులలోని చెడును గోరంతలు కొండంతలుగా చేసి ప్రచారం చేస్తాడు. ఇది అధముని లక్షణం. ఇకపోతే మూర్ఖశిఖామణి అయినవాడు తనలో ఏమాత్రం మంచి లేకపోయినా, ఉన్నదని బుకాయిస్తాడు. ఎదుటివానిలో మంచి ఉన్నా ఈషణ్మాత్రం మంచిలేదని పిడివాదన చేస్తుంటాడు. తాను తప్ప మిగతా వారందరి ప్రవర్తన చెడుగానే ఉన్నదని భావించి ప్రచారం చేస్తుంటాడు. రంధ్రాన్వేషణే ఇతని ప్రవృత్తి.

ఇది అధమాధముని లక్షణం. ఇటువంటి వారిని 'పరమ మూర్ఖ శిఖామణులు' అని చెప్పవచ్చును. ఈ విషయమును గురించి వేమన కూడా చక్కగా వర్ణించాడు.

తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్వి జనులకెల్ల నుండు దప్పు
దప్పులెన్నువారు తమ తప్పులెరుగరు
విశ్వదాభిరామ వినుర వేమ.

ఈ లోకంలో తప్పులు పట్టేవారు అనేకమంది ఉంటారు. ప్రతివానిలో ఏవో తప్పులుంటూనే ఉంటాయి. కాని ఎవరికివారు తమ తప్పులను మాత్రం గమనించుకోలేరు. ఇతరుల తప్పులను మాత్రం వెదుకుతుంటారు. తమ తప్పులను మాత్రం తెలుసుకోవటానికి ఏమాత్రం ప్రయత్నించకుండా, ఇతరుల తప్పులను మాత్రమే వెదకటానికి ప్రయత్నించడం ఆత్మవంచన చేసుకోవటమే అవుతుంది. అటువంటి దుష్ట స్వభావంగల వ్యక్తులు ఎన్నటికీ బాగుపడరు, ఎప్పటికీ అభివృద్ధిని గాంచలేరు. ఇటువంటి స్వార్థపరులు అయినవారు బాగుపడరు. ఎదుటివారు బాగుపడుతుంటే చూడలేరు. పాముకు కోరలలోనే విషం ఉంటుంది. వీరిలో మాత్రం శరీరమంతా విషం ఉంటుంది. ఇటువంటివారి వలననే సమాజం పూర్తిగా చెడిపోతుంది. కనుక వీరిని వెలివేయాలి.

# నాలుక వలె

**దంతముల మధ్య ఎంతో నేర్పును కల్గి**
**నాల్క సంచరించు నలుగకుండ**
**నరుడు కూడ అటులె నడువంగ వలెనయా**
**సత్యమైన బాట సాయి మాట.** 57

నాలుక ఒక చక్కటి ఆదర్శవంతమైన, క్రమశిక్షణతో కూడిన, ప్రవర్తనా నియమావళిని అందిస్తున్నది. అవి ఏమనగా 1. మానవుడు తన నిత్యజీవితంలో నైతిక విలువలను గౌరవిస్తూ, క్రమశిక్షణతో ఆదర్శవంతంగా జీవించడం. 2. మంచిని స్వీకరించి, చెడును విసర్జించి, విజ్ఞతతో, జీవించడం. 3. రాగ ద్వేషములకు అతీతమైన వైరాగ్య మనస్తత్వమును అలవరచుకొని, సమ భావాన్ని పెంచుకోవటం. ఈ మూడూ నాలుక మనకు అందించే ఆదర్శాలు.

మానవుడు క్రమశిక్షణ, విజ్ఞత, వైరాగ్యములను గురించి తెలుసుకోవటానికి ఎక్కడికో పోనవసరం లేదు. ఎవరి నాలుకను వారు శ్రద్ధగా పరిశీలిస్తే చాలు. నీకు తెలియకుండానే, నీ ప్రమేయం, సహాయం లేకుండానే నీ నాలుక రకరకాల ఆహారపదార్థములను తినేటప్పుడు, సాయుధ రక్షకుల వంటి, రంపాల వంటి దంతముల మధ్య ఎంతో క్రమశిక్షణతో చాకచక్యంగా మెలుగుతుంది. ఏమాత్రం ఏమరుపాటున తిన్నా నాలుక తెగి ముక్కలవుతుంది. ఏదైనా పదార్థమును నోటిలో పెట్టగానే, దాని యొక్క మంచి చెడ్డలను క్షణకాలంలో పసికట్టి, ఉపయోగకరమైన మంచి పదార్థములను స్వీకరిస్తుంది. అవాంఛనీయమైన, వ్యర్థమైన పదార్థములను ఉమ్మివేసి విజ్ఞతను ప్రదర్శిస్తుంది. ఇకపోతే ఎంతటి జిడ్డు పదార్థములను తిన్నా నాలుక తనకి అంటనివ్వదు. అన్నింటిని కడుపులోనికి పంపివేస్తుంది. అన్నింటినీ సమంగా స్వీకరిస్తుంది. దేనినీ నాలుక మీద నిలువుండనీయదు. కమ్మని నెయ్యి తిన్నా, కాలకూటవిషం తిన్నా క్షణాల్లో మాయమై పోతుంది. చేదు, తీపి, జిడ్డు, రంగు మొదలైన ఆనవాళ్ళేవి నాలుక మీద కనిపించవు. క్షణంలో మాయమైపోతాయి. అన్నింటినీ సమభావంతో స్వీకరించగల శక్తి నాలుకకు ఉన్నది. కనుక నరుడు నాలుకను ఆదర్శముగా తీసుకొని నిత్యజీవితంలో క్రమశిక్షణతో నడుస్తూ ముందుకు సాగిపోవటం నేర్చుకోవాలి. అప్పుడు ఆ మనిషి ఎటువంటి ఒడుదుడుకులకు లోనుకాకుండా ప్రశాంతమైన జీవితాన్ని

నడుప గలుగుతాడు. అంతేకాదు మంచిని స్వీకరించటంలో చెడును విసర్జించటంలో నాలుకవలె విజ్ఞతను ప్రదర్శిస్తూ ముందుకు సాగిపోవాలి. మమత సమతలను పెంపొందించుకొని రాగద్వేషముల కతీతమైన వైరాగ్య మనస్తత్వాన్ని అలవరచుకోవాలి. "తలలోని నాలుకలె, పూసలలోని దారము వలె" జీవించడం నేర్చుకోవాలి.

## సాధుజనులు

**సాధుజనులు జూచి చౌకలుసేతురు**
**వారికేమి కొదువ వాస్తవముగ**
**కుంజరమ్ము జూచి కుక్కలెన్నో మొరుగు**
**దాని ఘనతకేమి తక్కువగును** 58

భగవాన్ బాబావారు ఈ పద్యములో లోకము యొక్క స్థితిని చక్కగా వర్ణించారు. 'లోకులు కాకులు, కాకులు కూస్తున్నాయని కోకిల తన గానమును మానుకుంటుందా? హంసను చూచి కొంగలు పరిహసించినంత మాత్రాన హంసకు తగ్గేవిలువేమిటి? ఏనుగు పోతుంటే కుక్కలు మొరుగుతుంటాయి. ఏనుగు వీటినేమైనా లెక్కచేస్తుందా?' అని అన్నారు ఒక పర్యాయం భగవాన్ బాబా. అదే విధముగా ఈనాడు సాధు జనులను చూచి కొందరు తేలికగా మాట్లాడుతుంటారు, అవహేళన చేస్తుండటం పరిపాటి. వారు లోకంలో ఏదైనా కోరినప్పుడు భయపడాలి కాని వారు ఎల్లప్పుడూ దైవాన్ని కోరేవారేగదా! వారు భయపడరు. కోకిల చుట్టూ కాకులు చేరి 'కా.....కా....' అని అరుస్తూంటాయి. అయినప్పటికీ కోకిల మాత్రం చలించదు భయపడదు. తన గానాన్ని నిలపదు. అదే విధంగా హంసను చూచి కొంగలు పరిహసిస్తున్నప్పటికీ హంస తన గమనాన్ని మార్చుకుంటుందా? "హంస నడక" అని కవులు కూడా

వర్ణించారు. కొంగలు అల్లరి పెడుతున్నాయిగదాయని పరిగెత్తదు హంస. వయ్యారంగా, ఠీవిగా నడుస్తూ పోతుంది హంస. అదే విధముగా ఏనుగు ఠీవిగా తొండం ఆడిస్తూ నడుస్తూ పోతుంటే వీధి కుక్కలు మొరుగు తుంటాయి. అది ఏ మాత్రం పట్టించుకోదు. దర్జాగా నడచిపోతూనే ఉంటుంది. అదే విధముగా మూర్ఖులు విమర్శిస్తున్నా, అవివేకులు పరిహసిస్తున్నా, సాధుజనులు ఏ మాత్రం పట్టించుకోరు. వారి ఆలోచన వేరు, వారి చింతన వేరు, వారి దృష్టి వేరు. వారు పరమార్థమునే కోరుతారుగాని, పరుల అర్థమును కాదు. వారిలో స్వార్థం ఏకోశానా ఉండదు. వారు సదా పరుల హితమును మాత్రమే కాంక్షిస్తారు. సదా ఉపకారం చేయటమే వారి లక్ష్యము. అట్టి సాధుజనులను ఎవరైనా అవమానపరచినా, విమర్శించినా, ఈసడించినా సాధుజనుల స్థాయి యింకా పెరుగుతుందేగాని ఏమాత్రం తరగదు. అదేవిధంగా బజారు కుక్కలు మొరిగినంత మాత్రమున ఏనుగు ఘనత తగ్గునా?

## ఆశ - మనస్సు

**గాలియందు జ్యోతి కదలాడుచుండును**
**గాలిలేని జ్యోతి కదలకుండు**
**గాలివంటి ఆశ కట్టివేసిన యంత**
**నిశ్చలముగ మనసు నిలిచియుండు 59**

గాలి ఉంటే జ్యోతి అటూ ఇటూ కదుల్తూ ఉంటుంది. గాలి లేకపోతే నిశ్చలంగా ఉంటుంది. ఆశ గాలివంటిది. మనసు జ్యోతి వంటిది. ఆశ మూలంగానే మనసు చంచలమై అశాంతికి గురి అవుతుంటుంది. ఆశ లేకపోతే మనసు స్థిరంగా ఉండి శాంతిని చేకూరుస్తుంది. అయితే మానవునికి అవసరమైనవి ఆశించడంలో ఏమాత్రం దోషం లేదు.

ఉండటానికి ఇల్లు ఉండాలి, తినటానికి తిండి ఉండాలి, కట్టడానికి బట్ట ఉండాలి, రోగం వస్తే, తీసుకోవటానికి మందు ఉండాలి. ఈ విధమైన అవసరాలను తీర్చుకోవటంలో దోషంలేదు. మానవుడు ఆశాజీవి *గదా!* 'ఆశ' అనేదే లేకపోతే మానవుడు తన మనుగడనే కొనసాగించలేడు. అయితే ఆశకు హద్దు ఉండాలి. ఆ హద్దు మీరితే పేరాశగా మారుతుంది. 'పేరాశ ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది.' చివరకు దురాశకు దారి తీస్తుంది. "దురాశ దుఃఖమునకు చేటు *గదా!*" చివరకు దురాశ నిరాశను తెచ్చిపెడుతుంది. అప్పుడు మానవుడు నిరాశతో నిస్పృహచెంది జీవితం మీదనే విరక్తి జెందుతాడు. కనుక దురాశను దరికి చేరనీయరాదు.

'నాది, నాది' అనే మమకారం, 'నేను, నేను' అనే అహంకారములే అశాంతికి మూలం. అహంకార మమకారములతో కూడుకున్న దురాశను దూరం చేసుకుంటే మనస్సులో శాంతి నెలకొంటుంది. విచక్షణతో కూడుకొనిన వైరాగ్య స్థితియే శాంతి మార్గమును సుగమం చేస్తుంది. నిశ్చలమైన మనస్సు నందు మాత్రమే ఆత్మజ్యోతి వెలుగొందుతుంది.

# మతము

**మతములన్ని చేరి మంచినే బోధించె**
**తెలిసి మెలగవలయు తెలివితోడ**
**మతులు మంచివైన మతమేమి చెడ్డది ?**
**వినుము భారతీయ వీర సుతుడ. 60**

భగవాన్ బాబావారు ఒక పర్యాయం మతమునకు చక్కటి నిర్వచనం చెప్పారు. *"పంచభూతముల స్వరూపమును నిరూపించినటు వంటిదే మనస్సు. ఈ మనస్సు నుండి ఆవిర్భవించినటువంటిదే 'మతి'. ఈ మతి యొక్క ప్రతిబింబమే మతము. ఈనాటి ఇట్టి మతమును*

నాశనం చేయాలని అనేకమంది ప్రయత్నం చేస్తున్నారు. మతమును నాశనం చేసిన మతియే నాశనం అవుతుంది. మతియే నాశనం అయిన మనుష్యుడే నాశనం అవుతాడు. మతద్వేషములను నిర్మూలనం గావించాలి గాని మతమును కాదు" అంటారు బాబా.

ప్రతి మతమూ మంచినే బోధిస్తున్నది. కానీ వాటిని అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టటంలోనే లోపం కనిపిస్తున్నది. ఆ లోపములను తప్పులను పట్టుకొని అసలు మతమే పనికిరాదని వాదిస్తున్నారు ఈనాడు కొందరు రాజకీయ నాయకులు. ఇది విజ్ఞత ఏమాత్రం కాదు. అన్ని మతముల వారు పంచభూతముల శక్తులను, పవిత్రమైన దివ్యత్వాన్ని విశ్వసిస్తూ, పూజిస్తూ, ఆరాధిస్తున్నారు. దైవము సర్వభూతముల యందూ ఉన్నాడు, సర్వత్రా వ్యాపించినటువంటివాడని, సర్వశక్తిమయుడని మన వేదములు ఘోషిస్తున్నాయి. దీనిని అన్ని మతముల వారు అంగీకరిస్తున్నారు. భారతీయులు దీనిని ఆచరణలో పెట్టి చూపిస్తున్నారు. చెట్టును, పుట్టను, గుట్టను, మట్టిని, పిట్టను అన్ని జీవములను ఆరాధిస్తున్నారు. రాయి మొదలు రత్నము వరకు, పచ్చిక మొదలు పారిజాతము వరకు, చీమ మొదలు సింగము వరకు, కాకి మొదలు గరుత్మంతుని వరకు, మాల మొదలు మహర్షి వరకు సర్వమూ భారతీయులకు దేవతా స్వరూపములే. జగత్తులో గల సర్వజీవరాసులను సమదృష్టితో చూచి పూజించి, ప్రేమించి గౌరవించగల దివ్యమతమే హిందూ మతం.

"సత్యసాక్షాత్కారమే అన్ని మతముల గమ్యం. అన్ని మతముల సారం మానవ శ్రేయస్సే. మత విశ్వాసం మానవుని జీవితానికి చుక్కాని. మతములనేవి ఒకే గమ్యానికి చేర్చే విభిన్న మార్గాలు. మతములనేవి మానవులను చీలదీసేవి కావు. అందరినీ ఏకం చేసేవి. మతము లేనిదే మానవుడు మనజాలడు" అంటారు మహాత్మా గాంధీజీ. ఇటువంటి ఉన్నతమైన భావాలు నానాటికి మానవులలో తరగిపోవటం వలననే మతవిద్వేషాలు పెచ్చుపెరిగి పోతున్నాయి. మారణహోమాలు

చెలరేగుతున్నాయి. దీనిని ఆసరాగా గైకొని నాయకులు 'మతమే' పనికిరాదంటున్నారు. ఇది ఏమాత్రం మంచిది కాదు. అన్ని మతాలలో నున్న మంచిని అందరికీ పంచాలి. మతసమన్వయాన్ని సాధించాలి. భగవాన్ బాబావారు కోరేది కూడా సర్వమత సమన్వయం.

"ఏ మతమును మనం విమర్శించకూడదు. మన మతులను చెడకొట్టుకుంటున్నామే గాని, మతములు ఏనాటికినీ చెడిపోవునవి కావు. కనుక ఈనాడు మానవునికి బోధించడం ప్రధానం కాదు. మతులకు బోధించాలి. మతులకు బోధించినప్పుడు మాత్రమే మనుష్యులు సక్రమమైన మార్గంలో ప్రవేశిస్తారు" అంటారు బాబా. ఇది యదార్థం. మతులు చెడటం వలననే మతాలు చెడిపోతున్నాయి. మనసులు కలుషితం కావటం వలననే మనుష్యులు చెడిపోతున్నారు. మతము కాదు మతి మారాలి. మనిషికాదు మనసు మారాలి.

"నీ తల్లి నీకు ఎంత పూజనీయురాలో, ఎదుటి వాని తల్లి కూడా అతనికి అంత పూజనీయురాలే. అదే విధముగా నీ మతము నీకు ఎంత గొప్పదో, ఎదుటి వానికి అతని మతము కూడా అంత గొప్పదే. నీ తల్లిని నీవు పూజించు, గౌరవించు. కాని పరుల తల్లులను మాత్రం దూషించరాదు, అవమానించరాదు. అదే విధముగ నీ మత ధర్మాలను నీవు నిర్వర్తించుకో. పరుల మతములను మాత్రం విమర్శించరాదు, దూషించరాదు. ఈ విధమైన సత్యమును గుర్తించుకోలేక మతిహీనులైపోతున్నారు మానవులు. సర్వులూ ఈ సత్యమును చక్కగా గుర్తించుకుంటే, లోకములో ఎట్టి కల్లోలములకు, కలహములకు అవకాశమే ఉండదు" అని బోధించారు భగవాన్ బాబావారు. బాబావారి బోధనలను అవగాహన చేసుకొని ఆచరణలో పెడితే శాంతియుత సహజీవనమును గడపగలుగుతాం. విశ్వశాంతిని చూడగలుగుతాం.

# చిత్తశుద్ధి

**చిత్తశుద్ధి తోడ చేసెడు పూజకు**
**మట్టిపాత్రచాలు మహిని చూడ**
**చిత్తమున్న దనుచు విఱ్ఱవీగెడు వాడు**
**పతనమగుట నిజము పర్తి సూక్తి 61**

'చిత్తస్య శుద్ధయే కర్మః', చిత్తశుద్ధికి పవిత్రమైన కర్మలు అత్యవసరం. కర్మల వలన చిత్తశుద్ధి [illegible] కుందని 'గీత' బోధిస్తున్నది. కనుక చిత్తశుద్ధి నిమిత్తమై కర్మల నాచరిం[illegible] 'గీత ఆదేశిస్తున్నది. అయితే ఎట్టి కర్మల చేత చిత్తశుద్ధి ఏర్పడుతుం[illegible] ఈశ్వరార్పణతో గావించిన కర్మల వల్లనే చిత్తశుద్ధి ఏర్పడుతుంది. [illegible]మకర్మాచరణ వలన చిత్తశుద్ధి కలుగుతుంది.

భగవంతునికి అర్పించునట్టి కర్మలు సత్కర్మలు పవిత్రమైన కర్మలు, ఆదర్శవంతమైన కర్మలై ఉండాలి. ఉదాహరణకు భగవంతునికి ఒక పుష్పం అర్పితం చేయాలంటే.... ఆ పుష్పము నందుండిన క్రిములను వేరుచేసి, దానిని పరిశుద్ధపరచి భగవదర్పితం చేస్తాం. అట్లే మనము చేయు ప్రతికర్మ భగవదర్పితమైనదిగా రూపొందాలి. పుష్పములో సుగంధం చేరినట్లుగా, మన కర్మలలో పవిత్రభావము చేరాలి. పవిత్రమైన భావములతో పరిశుద్ధమైన సత్కర్మలను ఆచరించుతే 'చిత్తశుద్ధి' ఏర్పడుతుంది. అట్టి చిత్తశుద్ధితో చేసే పూజలకు ధనం ప్రధానం కాదు. గుణం ప్రధానం. ఆర్భాట అట్టహాసములను భగవంతుడు మెచ్చడు. నిర్మలమైన మనస్సును, పరిశుద్ధమైన హృదయమును భగవంతుడు కోరుకుంటాడు. మట్టిపాత్రతో అభిషేకం చేస్తే పరమేశ్వరుడు ఆగ్రహించడు. హేమపాత్రతో అభిషేకం చేస్తే అనుగ్రహించడు. ఆయన చూచేది మన శ్రద్ధాభక్తులను మాత్రమే. ఆయన మన నుండి ఆశించేది

అనన్యమైన భక్తిని మాత్రమే. ఈ రెండు లేకుండా డబ్బున్నది గదాయని ఆడంబరంగా చేసే పూజలను భగవంతుడు ఏమాత్రం మెచ్చుకోడు.

"విత్తమున్నదని విఱ్ఱవీగెడువాడు పతనమగును" అని భగవాన్ బాబావారు ఏనాడో చెప్పారు. 'ధనమూలం ఇదం జగత్' ధనంతో దేనినైనా సాధించవచ్చునని భావిస్తే ఏదో ఒక రోజున నిరాశకు గురికావలసి వస్తుంది. ధనము అవసరమే కాని ధనమే ప్రధానము కారాదు. 'ధర్మమూలం ఇదం జగత్' ధర్మమే అన్నిటికీ మూలం అనే వాస్తవాన్ని విస్మరించరాదు.

పూజ చేయటానికి పూజాద్రవ్యములు ముఖ్యంకాదు. పూజ చేసేవాని హృదయం ప్రధానం. మనం చేసే ప్రార్థన పెదవులపై నుండి కాదు. హృదయంలో నుండి రావాలి. అట్టి ప్రార్థనకే భగవంతుడు వశుడవుతాడు. "హృదయము లేని ప్రార్థన కంటే మాటలు లేని హృదయమే మేలు. ప్రార్థన అంటే ఒకరిని యాచించటం కాదు. అది ఆత్మపడే తపన. ప్రార్థన అనగా మాటల పరిశ్రమ అంతకన్నా కాదు. హృదయము లోని దివ్యత్వమును మేలుకొలిపేందుకు పడే తపన" అని అంటారు భగవాన్ బాబా. యాచిస్తే పలుకడు. ఆర్తితో పిలిస్తే పలుకుతాడు భగవంతుడు. అర్థం కాదు, ఆర్తి ముఖ్యం: విత్తం కాదు, తత్త్వం ముఖ్యం. తపస్సు కాదు, తపన ముఖ్యం. ఆచరిస్తే అనుగ్రహిస్తాడు భగవంతుడు.

## కామక్రోధములు

కామశక్తి అధికమీ కాలమందు
వాని మిత్రుడు క్రోధుడు వీరిరువురి
జేర్చుకున్నట్టి జనులకు చేటుకలుగు
ఇంతకన్నను వేరెద్ది ఎఱుకపఱుతు. 62

రాగద్వేషముల యొక్క ప్రతిరూపములే కామక్రోధములు. కామము రజోగుణమునుండి పుట్టినది. క్రోధము కామము నుండి ఆవిర్భవించినది. కామ క్రోధములకు సంకల్పములే మూలకారణము.

ఈ కాలం ప్రజలలో కామశక్తి రోజురోజుకు అధికమైపోతున్నది. దానితో క్రోధము కూడా చేరేటప్పటికి ఊహించనటువంటి నష్టం వాటిల్లుతున్నది. దారము లేక వస్త్రము ఏవిధంగా తయారుకాదో, అదే విధంగా కామం లేకుండా క్రోధం రూపొందదు. ఈ కామక్రోధములకు గీతాచార్యుడు 'అనలం' అని ఒక క్రొత్త పేరు పెట్టాడు. 'అనలం అనగా అగ్ని. దీనికి దహించే శక్తి ఉంటుంది. అలాంటి అగ్ని మనయందే ఉండినప్పుడు మనం ఎంత జాగ్రత్తగా మెలగాలి? ఈ కామక్రోధములనే అగ్నికి హద్దూ, పద్దూ లేదు; నియమం, గమ్యం లేదు. ఎన్ని విధములుగా అనుభవించినప్పటికీ, ఇంకా అనుభవించాలనే భ్రాంతిని ఇవి కలిగిస్తాయి. కనుక వీటిని నివారించుటకంటే సమూలంగా తొలగించివేయుటే శ్రేయస్కరం.

ప్రేమతో క్రోధమును జయించవచ్చును. ప్రేమ ఉన్నచోట ద్వేషము ఉండదు. ద్వేషము లేనప్పుడు క్రోధము ప్రవేశించదు. కనుక క్రోధమును సాధించవలెనన్న ప్రేమను అభివృద్ధి పరచుకోవాలి. ఇకపోతే వైరాగ్యము చేత కామమును జయించవచ్చును. వైరాగ్యమనగానే ఆలుబిడ్డలను వదలి అరణ్యాలకు వెళ్ళటమని, ఆస్థిపాస్తులను వదలి సన్యసించటమని చాలామంది భావిస్తుంటారు. ఇది సరియైన అవగాహన కాదు. గృహస్థులుగానే ఉంటూ, సాంసారిక జీవనమును అనుభవిస్తూ ప్రాపంచిక కర్తవ్యకర్మలను ఆచరిస్తూ, ప్రతి పదార్థమునందున్న దోషములను గుర్తించి, ఆ పదార్థమును స్వీకరించకుండా ఉండటమే వైరాగ్యము' అని చెప్పారు భగవాన్ బాబావారు.

కనుక ప్రతి ఒక్కరూ ప్రేమను పెంచుకొని, వైరాగ్యమును అభివృద్ధిగావించుకొని కామక్రోధముల బారి నుండి బయటపడే ప్రయత్నం చేసి జీవితమును సార్థకం చేసుకోవాలి.

# విషయవాసనలు

సర్పమింటియందు సంచరించుచునుండ
ఎవరు సుఖనిద్ర చెందగలరు?
విషయసర్పముండు విషమయదేహాన
జీవయాత్ర దేహి సల్పుచుండ. 63

ఇంట్లో విషసర్పము తిరుగుతున్నదని తెలిస్తే చాలు. నిద్రపట్టదు. దానిని చంపినదాకా మనశ్శాంతి ఉండదు. అదే విధంగా విష సర్పంలాంటి విషయవాసనలు అనే రాగద్వేషాలు శరీరాన్ని అంటిపెట్టుకున్నంత వరకూ ఇంద్రియాలు స్వైర విహారం చేస్తూనే ఉంటాయి. అవి ముముక్షువునకు పరమ శత్రువులు. అవి అనేక జన్మల నుండి జీవుని హృదయ క్షేత్రమును ఆక్రమించుకొని, అధికారమును కొనసాగిస్తూ వస్తున్నాయి. అట్టి రాగద్వేషములకు లోబడక, వాటికి తలయొగ్గక మన హృదయ కుహరము నుండి వాటిని బయటకు పారద్రోలవలెను. అప్పుడే పరమశాంతిని బడయ వచ్చును.

"*మానవుని భావాలు రాగద్వేషములతో ఉంటాయి. రాగ ద్వేషములే మానవుని పాలిటి రాహుకేతువులు. "నవగ్రహములు... నవగ్రహములు...." అని భావిస్తున్నామేగాని, ఇది కేవలం భ్రాంతి మాత్రమే. రెండు గ్రహములే మనల్ని పట్టి పీడిస్తున్నాయి. అవే మానవుని పాలిటి రాహుకేతువులైన రాగద్వేషములు.*" అని అంటారు బాబా. రాగద్వేషముల యొక్క ప్రతి రూపములే కామక్రోధములు. ఇవి సాధకునికి పరమ శత్రువులు. జీవునిచే బలాత్కారముగ పాపము చేయించు శక్తియే కామము. ఇది రజోగుణము నుండి పుట్టినది. దాని తమ్ముడు క్రోధము. శత్రువులలో మహా బలవత్తరమైనది కామమే గనుక, దానికి

అరిషడ్వర్గములలో ప్రథమ స్థానం ఇవ్వబడింది. అసుర గుణములలో కామము నాయకుడు, క్రోధము ఉపనాయకుడు.

మొట్టమొదట ఈ రాగమనే రోగాన్ని నివారణ గావించుకోవాలి. వాంఛే రాగము. దురాశే రాగము. మానవునికి ఆశ ఉండవచ్చును. కానీ ఈ ఆశలు మాత్రం చీమల పుట్టలవలె పెరుగకూడదు. "దోచుకొనే రోగము, దాచుకొనే వ్యక్తిత్వము మనలో ప్రవేశించకూడదు". అంటారు బాబా. ఇకపోతే అసూయ ద్వేషములు రెండూ తోడు దొంగలు. మానవుని పాలిటి వేరుపురుగులు. ఇవి గనుక మనిషిలో చేరితే, ఎన్నో సంవత్సరముల నుంచి సాధించి, సంపాదించిన సద్గుణములన్నీ తృటిలో బూడిదపాలై పోతాయి. కనుక వీటిని దరికి చేరనీయరాదంటారు బాబా.

మనుజుడు ముందుగా కామమును జయించవలెను. జయించ వలెనంటే దాని ప్రథమాశ్రయమైన ఇంద్రియాదులను మొదట జయించ వలెను. విషయములపైకి పోకుండ ఇంద్రియములను అరికట్టిన యెడల కామమునకు నిలవనీడలేక క్రమముగా నశించి పోవును. 'క్రోధేన జ్ఞాన నాశనం' క్రోధంతో జ్ఞానం నశించిపోతుంది. ఎప్పుడైతే కోరికలు నశిస్తాయో, అప్పుడు క్రోధం యొక్క తీవ్రత కూడా తగ్గిపోయి ప్రశాంతంగా ఆలోచించగలుగుతాడు మానవుడు.

విషసర్పమును ఇంటి నుండి పారద్రోలినట్లుగా, రాగద్వేషములనే విషయ వాసనలను మన హృదయకుహరమునుండి పారద్రోలాలి. విషయ వాసనలనే సర్పము, విషమయ దేహాన సంచరించుచున్నంత కాలం మానవునికి శాంతి ఉండదు. విషయ వాసనలనే రాగద్వేషములను పారద్రోలినప్పుడు మాత్రమే మనిషికి మానసిక శాంతి లభిస్తుంది.

**లోని శత్రువులకు లొంగిపోయిన వాడు**
**బయటి రిపులనెట్లు బట్టగలడు?**
**తత్త్వమెరిగినంత ధన్యుడే నరుడిల**
**ఉన్నమాట తెలుపుచున్నమాట.** 64

"ఇంద్రియములను నిగ్రహించువాడే నిజమైన విజయుడు" అని శంకరులవారు తన శిష్యుడైన తోటకాచార్యునికి చెప్పారు. కనుక కేవలం రాజ్యములను జయించినవాడుగాని, ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కి మొదట జెండాను పాతినవాడు గాని విజయుడు కానేరడు. హిరణ్యకశిపుడు సముద్రాన్ని ఛేదించాడు, భూమండలాన్ని జయించాడు, పంచభూతములను వశము చేసుకొనినాడు, సర్వత్రా సంచరించే దైవత్వాన్ని గుర్తించడానికి సమస్త ప్రయత్నాలు సలిపాడు. కాని అట్టివాడు కూడనూ ఇంద్రియములను సాధించలేకపోయాడు.

ఒక పర్యాయం ప్రహ్లాదుడు తన తండ్రికి హితవు చెబుతూ *"తండ్రీ! క్షుద్రమైనటువంటి, క్షణికమైనటువంటి ఈ రాజ్యమును సాధించడానికి, జయించడానికి నీవు ఏల ప్రయత్నిస్తున్నావు? అడవులలో సంచరించే మృగములను చంపినట్లుగా మానవులను చంపినవాడు వీరుడు కానేరడు. నీయందున్న మృగత్వమును తీసివేయడానికి తగిన కృషి చేయి! దుర్గుణములైనటువంటి ఇంద్రియములను మొదట జయించు!"* అని చెప్పాడు. లోపలి శత్రువులకు లొంగిపోయినవాడు అనగా ఇంద్రియములకు దాసుడైనవాడు బయట శత్రువులపై ఏరీతిగా విజయమును సాధించగలడు? లోపలి శత్రువులను జయించాలంటే ఒక్క 'ప్రేమాస్త్రము' ద్వారానే సాధ్యమవుతుందంటారు బాబా. కనుక ప్రతి హృదయంలో 'ప్రేమజ్యోతి' ని వెలిగించాలి. ప్రేమ ఉన్నచోట ఈర్ష్యాద్వేషాలనే రాహుకేతువులు ఉండరు. ప్రేమచేత అరిషడ్వర్గములను జయించవచ్చును. జీవితమును సార్థకం గావించుకొనవచ్చును.

*"ఎన్ని శక్తులు సంపాదించినా ప్రయోజనం ఏమిటి? ఇవన్నీ భౌతిక శక్తులే కదా! దైవాన్ని మరచిన తరువాత ఎన్ని ఉండి ఏమి ప్రయోజనం? hero becomes zero, If he forgets God"* అన్నారు బాబా.

సకల విద్యలు నేర్చి సభ జయించగ వచ్చు
శూరులై రణమున పోరవచ్చు
రారాజై రాజ్యమేలగ వచ్చు
హేమ భూదానముల్ హెచ్చవచ్చు
గగనంపు చుక్కలు గణియింపగా వచ్చు
జీవరాసుల పేర్లు చెప్పవచ్చు
అష్టాంగ విద్యలనన్ని నేర్వగవచ్చు
చంద్రమండల యాత్ర సలుపవచ్చు
కాని దేహేంద్రియాదుల కట్టి పెట్టి
మనస్సు నిల్పియు నంతర్ముఖమ్ము చేసి
అనవరత నిశ్చలమైన ఆత్ములగుచు
నిలువగాలేరు మానవుల్ నియతి తోడ.

"లోకములో పశువుగా జీవించదలచుకొన్నటువంటి వాడికి 'ఇంద్రియ నిగ్రహము' అవసరముండదు. పశుపతిగా జీవించదలచుకొన్న మానవునకు 'ఇంద్రియ నిగ్రహము' అత్యవసరము." అన్నారు బాబా.

# గురువు

**సర్వ సద్గుణములు చక్కగా లేకున్న**
**వారు గురులు కారు వాస్తవముగ**
**సవినయుండు కాక సచ్ఛాత్రుడెట్లగు**
**ఉన్నమాట తెలుపుచున్నమాట. 65**

అన్నారు భగవాన్ బాబా. సర్వ సద్గుణములుగలవాడే 'సద్గురువు' ఏమిటా సద్గుణములు? సత్యము పలుకుట, ధర్మము నాచరించుట భూతదయ

కలిగియుండుట, ఓర్పు ఓర్మి ప్రదర్శించుట, చిత్తశుద్ధి కలిగి యుండుట, నిర్భయత్వం, ప్రేమ, త్యాగం మొదలగునవి. అన్ని దుర్గుణములకు భయమే పునాది. భయము నుండియే అన్ని అవగుణములు అంకురిస్తున్నాయి. కనుక మొట్టమొదట భయమును పారద్రోలి, నిర్భయత్వమును అవలంబించితే, మిగిలిన సద్గుణాలన్నీ వాటంతట అవే వచ్చి చేరుతాయి.

అసలు గురువంటే ఎవరు? అజ్ఞానమును దూరం చేసి, ప్రజ్ఞానమనే ప్రకాశంతమైన జ్యోతిని వెలిగించువాడు 'గురువు'. గురువును కంటి డాక్టరుతో పోల్చారు భగవాన్ బాబా. కంటి డాక్టరు కంటిపొరను తీసివేసి దృష్టిని ప్రసాదిస్తాడు. అదే విధముగ గురువు అజ్ఞానమనే పొరను తొలగించి జ్ఞానదృష్టిని కలిగించుతారంటారు బాబా.

ఈనాడు లోకసంబంధమైన చదువులు చెప్పేవారు ఉపాధ్యాయులు (Teachers) మాత్రమేగాని 'గురువులు' అని చెప్పడానికి వీలుకాదంటారు బాబా. అధ్యాపకులు కేవలం లౌకిక విద్యలను మాత్రమే బోధించడంతో తృప్తి చెందక ఒక మెట్టు పైకి పోయి దివ్యమైన, నవ్యమైన, భవ్యమైన, ఆదర్శమైన విషయాలను బాలబాలికలకు అందించాలి. వారిలో నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక శీలసంపత్తులను ఇనుమడింపజేసే ప్రయత్నం చేయాలి.

"రాతిని సుందరంగా తీర్చిదిద్దువాడు శిల్పి. భావాన్ని సరియైన రూపంగా తీర్చుదిద్దునది భాష. మానవుని ఉత్తమునిగా తీర్చిదిద్దునది శీలము. బాలబాలికలకను ఉత్తములుగా తీర్చిదిద్దవలసినవారు అధ్యాపకులు" అని అంటారు బాబా. కనుక అధ్యాపకులు తమ వంతు బాధ్యతను నిర్వర్తించాలి.

అధ్యాపకులను Guide Post తో పోల్చారు బాబా. గైడ్‌పోస్ట్' ఊరికే అటూ ఇటూ తిరుగుతుండుటవలన తప్పుదారిపట్టిస్తుంది.

అటులగాక 'గైడ్‌పోస్ట్' స్థిరంగా నిల్చొని ధృక్పధాన్ని చక్కగా ఇతరులకు వివరించాలంటూ అధ్యాపకులు సరియైన స్థితిలో ఉండినప్పుడే బాలబాలికలకు దివ్య జీవితమును అందించిన వారవుతారంటారు బాబా.

అధ్యాపకులు ఆచరించి, అనుభవించి పిల్లలకు అందించాలి. 'ఆచార్యుడు' అనే పేరును సార్ధకం చేసుకోవాలి. ఆచరించేవాడు ఆచార్యుడు. ఆచరించకుండా ఆచార్యుడనిపించుకోవాలనుకోవటం కేవలం Artificial (కృత్రిమమైన) జీవితమే అవుతుందంటారు బాబా. కనుక అధ్యాపకులు ఆదర్శజ్యోతులుగా వెలుగొందుతూ విద్యార్థులను తీర్చిదిద్దాలి. అధ్యాసకులు ఆదర్శమైన, దివ్యమైన, పరిశుద్ధమైన, పవిత్రమైన జీవితాన్ని గడుపుతూ అలనాటి గురువులను మరిపించాలి. సర్వ సద్గుణములను స్వంతం చేసుకొని సద్గురువులు కావాలి.

వినయశీలి మాత్రమే సచ్చరిత్రసంపన్నుడు కాగలడు. వినయ విధేయతల వలననే విద్వత్తు రాణిస్తుంది. వినయం వలన యోగ్యత, అర్హత లభిస్తుంది. వినయంలేని వాని వద్ద ఎంత విజ్ఞానముండి ఏమి ప్రయోజనం? బూడిదలో పోసిన పన్నీరులాగే అవుతుంది. కనుక విద్యతో పాటు వినయమును పెంచుకోవాలి. చదువుతోపాటు సంస్కారాన్ని కూడా పెంపొందించుకోవాలి. అప్పుడే రాణిస్తాడు, శోభిస్తాడు, పదిమందిలో మెప్పును పొందుతాడు.

## విద్య

**నేటి విద్య తెలివితేటలనే పెంచు**
**కొంచమైన గుణము పెంచబోదు**
**కోటి విద్యలుండి గుణము లేకున్నచో**
**అట్టి విద్యకన్న మట్టి మిన్న** 66

అని చెప్పారు బాబా. ఈనాటి తరం విద్యార్థులు పూర్వం వారికన్నా తెలివితేటలు కలవారే అనటంలో ఏమాత్రం సందేహంలేదు. గోల్డ్ మెడల్స్ కూడా సంపాదిస్తున్నారు గాని అసలు ఉండవలసిన గుణం మాత్రం ఉండటంలేదు. ఒక పర్యాయం బాబావారు చమత్కారంగా "మార్కులు చూస్తే ర్యాంకులు వస్తున్నాయి. *గుణము*, అనుభవము మాత్రం బ్లాంకులు, జీరోలు" అన్నారు. ఇది పైకి చమత్కారంగా అనిపించినా, వాస్తవం మాత్రం అంతే. విద్య అంటే కేవలం చదవటం, వ్రాయటం మాత్రమే కాదు. విద్య యొక్క లక్ష్యం డిగ్రీలు సంపాదించడం మాత్రమే కాదు. మార్కులు, ర్యాంకులు మాత్రమే తెచ్చుకోవటం కాదు. మార్క్స్‌తోపాటు రిమార్క్స్ రాకుండా కూడా చూచుకోవాలంటారు బాబా. విద్యతోపాటు వినయమును అలవరచుకోవాలి. చదువుతోపాటు సంస్కారమును కూడా పెంచుకోవాలి. "విద్యా వినయ సంపన్నః" అన్నారు పెద్దలు. విద్యా వినయములు రెండూ కలిసి ఉన్నవాడే రాణిస్తాడు, అభివృద్ధిలోనికి వస్తాడు. అయితే ఈనాటి అధునాతన విద్యలు తెలివితేటలను మాత్రమే పెంచుతున్నాయిగాని గుణమును ఏమాత్రం పెంచటంలేదు.

*"గుణములేని జీవితం దీపంలేని గుడి వంటిది. గుణం లేని జీవితం చెల్లని నాణెం వంటిది. గుణంకంటే మించిన బలం వేరొకటిలేదు"* అన్నారు బాబా. గుణంలేని కోటి విద్యలకన్నా మట్టి మిన్న యని పై పద్యంలో బాబావారు వివరించారు. మట్టిలో మాణిక్యాలు పండుతున్నాయి. మానవునికి అవసరమైన ఆహార పదార్థములు పండుతున్నాయి. భూమి నుండి ఎంతో ఖనిజ సంపద లభిస్తున్నది. మానవుని మనుగడే భూమాత మీద ఆధారపడి ఉన్నది. కనుకనే ఎన్ని విద్యలు నేర్చినా గుణం లేకపోతే ప్రయోజనం లేదు.

**గుణము కొంచమున్న చాలు గొప్ప చదువులున్న**
**ఫలమదేమి వాని విలువదేమి**
**పంట పండని భూమి పది ఎకరములేల**
**కొంచమైన చాలు మంచి భూమి 67**

భగవాన్ బాబావారు గుణము (Character) నకు ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు. విద్య జీవనోపాధికి మార్గం మాత్రమే కాదని, ఉత్తమ పౌరునిగా తయారుచేయటానికి విద్య ఒక ఉత్తమ సాధన అని బాబావారి విశ్వాసం. *'తెలివితేటలతోపాటు గుణంకూడా ఉండాలి'* అన్నారు బాబా. గుణం ప్రధానం. కనుక ప్రతి విద్యార్థి సద్గుణ సంపన్నుడు కావాలి. డిగ్రీలు మాత్రం చాలా గొప్పవి అయితే ఫలితమేమిటి ? గుణహీనుడు గొప్ప మేధావి అయినా ప్రయోజనం లేదు. గుణహీనుడు గొప్ప శాస్త్రజ్ఞుడయినా ప్రమాదమే. గుణహీనుడు అత్యున్నతమైన అధికార స్థానంలో ఉంటే ఆ దేశానికి విపత్తు తప్పదు. గుణహీనుడు ఏ రంగంలో ప్రవేశించినా ప్రకాశించడు. ప్రకాశించక పోగా ప్రమాదంకూడా తెచ్చిపెడతాడు. గుణం అంటే శీలం; సద్గుణం అంటే సచ్ఛీలం అంటే Good Character అన్నమాట. ప్రతి జీవికి శీలం ప్రాణాధారం. జీవితంలో ఎంతటి ఉన్నత పదవులనైనా సంపాదించవచ్చును, సమస్త భోగభాగ్యములు, సమస్తాధికారములను అరచేతిలో ఇరికించుకొనవచ్చునుగాని అతి ముఖ్యమైన శీలమే గనుక లేకపోతే వాటన్నింటిని తృటిలో కోల్పోతాడు. మన ప్రాచీనులు శీలానికి అత్యంత ప్రాధాన్యతనిస్తూ వచ్చారు. శీలం రెండు రకాలు : 1. వ్యక్తిగత శీలం (Personal Character) 2. జాతీయ శీలం (National Character) ప్రతి వ్యక్తిలో ఈ రెండూ ఉండాలి. ఈ రెండూ ఒకే నాణెమునకు ఉన్న బొమ్మ బొరుసులాంటివి. ఒక ప్రక్క జాతీయ చిహ్నం రెండవ ప్రక్క నాణెం విలువ ఉంటుంది. ఈ రెంటిలో ఏది అరిగిపోయినా ఆ నాణెం చెల్లదు. అదే విధంగా ఈ రెండు శీలాలు ప్రతి వ్యక్తిలో ఉండాలి. ఏ ఒక్క శీలం లోపించినా అతను చలామణి కాడు.

ప్రతి విద్యార్థి విద్యార్జనతోపాటు గుణార్జన కూడా చేయాలి. అందువలననే *'The end of education is character'* (విద్యాఫలం శీలం) అన్నారు బాబా. *'Character is nine points in education'*

(విద్యలో తొమ్మిది భాగాలు శీలం) అన్నారు డా॥ సర్వేపల్లి. శివాజీ కన్నా శంభాజీ మహావీరుడు అయినప్పటికీ వ్యక్తిగత శీలం లోపించడం వలన శంభాజీ రాణించలేదు, కాలగర్భంలో కలిసిపోయాడు. సకల శాస్త్ర ప్రవీణుడు, మహాబలపరాక్రమ సంపన్నుడు అయిన రావణాసురుడు స్త్రీలోలుడు కావటం వలన (వ్యక్తిగత శీలం లోపించడం వలన) తనతోపాటు తన వంశమును కూడా సర్వనాశనం గావించుకున్నాడు. జాతీయ శీలమనగా 'దేశభక్తి' అనికూడా చెప్పుకొనవచ్చును. దేశభక్తి భావం లోపించడం వలన జయచంద్రుడు విదేశీయుడైన ఘోరీమహమ్మద్‌కు అండగా నిలచి స్వదేశీయుడైన పృధ్విరాజ్‌ను ఓడించడానికి కారణభూతుడైనాడు. జాతీయ దృక్పథం లేకపోవటం వలన విదేశీయుడైన అక్బర్‌కు అండగా నిలిచి సోదర భారతీయ వీరుడైన రాణాప్రతాప్‌కు తీరని ద్రోహం చేశాడు మాన్‌సింగ్.

గుణం కొంచముంటే చాలు, గొప్ప చదువు లేకున్నా ఫరవాలేదు. పంట పండని భూమి పది ఎకరములున్నా ప్రయోజనంలేదు అంటూ "కొంచమైన చాలు మంచి భూమి" అన్నారు బాబా. ఇదే భావమును వేమన కూడా చెప్పాడు.

*"గంగ గోవుపాలు గరిటెడైనను చాలు*
*కడివెడైన నేమి ఖరము పాలు*
*భక్తి గలుగు కూడు పట్టెడే చాలురా*
*విశ్వదాభిరామ వినుర వేమ"*

**చదువు చదివి చదివి సద్గుణంబులు లేక**
**పరుల మోసగించి బ్రతుకువాడు**
**వానికంటె మేలు వసుధలో గాడిద**
**బరువు మోసి తాను బ్రతుకుచుండు** 68

అన్నారు బాబా. ఇది అనుభవంతో చెప్పిన మాట. "శీలరహితమైన విద్య ప్రమాదకరం. చాలామంది తెలివిగల దొంగల విషయంలోను, పెద్దమనుషులుగా చలామణి అయ్యే మూర్ఖుల విషయంలోను ఇది వెల్లడవుతుంది" అన్నారు మహాత్మాగాంధీజీ. ఈనాడు కొందరు విద్య ద్వారా నేర్చిన తెలివితేటలను ఉపయోగించుకొని, అమాయకులను మోసగించి బ్రతుకుతున్నారు, స్మగ్లింగ్‌చేసి కోట్లు సంపాదిస్తున్నారు. దేశసంపదను కొల్లగొడుతున్నారు. ఏమాత్రం శ్రమపడకుండా తమ తెలివితేటలను వినియోగించి అక్రమార్జన చేస్తున్నారు. అందువలననే కృషి చేయకుండా మెక్కేడివారు దొంగలతో సమానమన్నారు గాంధీజీ.

పరులను మోసగించి బ్రతికే వాడికంటే గాడిదే మేలని బాబావారు పై పద్యంలో చెప్పారు. తన పనిని తాను చేయకుండా, బాధ్యతను గుర్తించకుండా, బజార్ల వెంబడి తిరిగే పోరంబోకును సహజంగా *'ఛీ గాడిద'* అని మన పెద్దలు నిందించటం పరిపాటి. అయితే ఈనాడు *'ఛీ గాడిద'* అంటే అసలు గాడిదకు కూడా కోపం వస్తున్నది. దానికి మాటలు రావుగాని, మనం అనే మాటలను మాత్రం అర్థం చేసుకోగలదు. మన మాటలు విని, నన్ను ఇంత చులకనగా ఈ మానవుడు మాట్లాడు తున్నాడేమిటని కళ్ళు ఎర్రచేసి చూస్తున్నది గాడిద. కారణం ? గాడిద తన డ్యూటీని తాను చేస్తున్నది. యజమాని చెప్పినట్లు నడచుకుంటున్నది. యజమాని వేసిన బరువులు మోస్తున్నది. సద్గుణరహితుడైన విద్యావంతుడు మాత్రం, ఏమాత్రం కష్టపడకుండా తన తెలివితేటలతో పరులను మోసగించి బ్రతుకుతున్నాడు. కనుక బాబావారు చెప్పినట్లు పరులను మోసగించి బ్రతికేవాడికన్నా, బరువులు మోసి బ్రతికే గాడిదే మేలేమో !

**బహుళ విద్యలయ్యె వాంఛలు మితిమీరె**
**పలుకులందు హీరో పనికి జీరో**
**తెలివితేటలవల్ల కలుగు లాభంబేమి ?**
**కొంచమైన ఆచరించరయ్య.** 69

అని చెప్పారు బాబా. ఈనాడు రకరకాల విద్యలు పెరిగాయి. దానితో పాటు కోరికలు కూడా మితిమీరిపోతున్నాయి. అందువలన సంతృప్తి లేకుండా పోతున్నది. ఎంత సంపాదించినా చాలటంలేదు, కోరికలు తీరటంలేదు. కోరికలు తీర్చుకోవటానికి అక్రమ, అనాచార, అవినీతి పద్ధతులకు దిగజారిపోతున్నారు. అందువలననే బాబావారు 'కోరికలపై అదుపు' (Ceiling on Desires) కార్యక్రమమును చేబట్టారు. దీనిఇని ఐదు విధముగా నిర్వచించారు. 1. అతి భాషపై అదుపు, 2. అమిత వాంఛలపై అదుపు 3. ఆహార పదార్థముల వినియోగంపై అదుపు 4. వృథాగ ధన వ్యయంపై అదుపు 5. కాలము వృథా చేయటంపై అదుపు. లౌకిక వాంఛలను పూర్తిగా త్యజించి సన్యాసులు కావాలని బాబా కోరటంలేదు. ప్రతివారు సంపూర్ణ జీవితాన్ని జీవించాలని, ఇప్పుడు జీవిస్తున్న దానికన్నా మరింత అర్థవంతమైన, పరిపూర్ణ శాంతిని, ఆనందమును చేకూర్చేటటువంటి నిండైన జీవితాన్ని గడపాలని బాబావారి ఆశయం.

'కోరికల అదుపు' ఒక పర్యాయం బాబావారు ప్రసంగిస్తూ *"మనం ప్రతిరోజూ కాలాన్ని, ధనాన్ని, ద్రవ్యాన్ని, ఆరోగ్యాన్ని, శక్తిని వృథా చేస్తుంటాం. పొదుపు చేయటం ఎప్పుడూ చాలా అవసరమైన ఆధ్యాత్మిక సాధన. చివరకు పరమేశ్వరుడు సృష్టించిన పంచభూతాలను కూడా పొదుపుగా వాడకపోతే, అది పరమేశ్వరుని తృణీకరించి నట్లవుతుంది"* అని అంటారు. కనుక కోరికలపై అదుపు మనశ్శాంతినిస్తుంది, అంతేకాదు దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేస్తుంది. అయితే ఈనాటి విద్యావంతులు చాలామంది మాటలు చెప్పటం మాత్రమే నేర్చుకున్నారుగాని, ఆచరణలో మాత్రం వెనుకంజ వేస్తున్నారు. దీనినే బాబావారు *"పలుకులందు హీరో, పనికి జీరో"* అని చక్కగా చమత్కరించారు. ఇది వాస్తవం. ఈనాడు చాలామందిలో మాటల పసేగాని, చేతల పసలేదు. *"మాటలు కోటలు దాటును, కాలు గడప దాటదు"* అనే సామెత అనుభవంతో చెప్పారు మన పెద్దలు. మరొక పర్యాయం *"Hero becomes Zero, If he forgets God"* (దేవుని

విస్మరిస్తే హీరో కూడా జీరో అయిపోతాడు) అన్నారు బాబా. మరొక సందర్భంలో "వేదికలమీద హీరోలు, నిజజీవితంలో మాత్రం జీరోలు" అన్నారు బాబా. ఈనాడు నాయకులు ఉపన్యాసాలు దంచటంలో హీరోలే, ఆచరణలో మాత్రం జీరోలు. ఆచరణ లేని ఉపన్యాసాలు నిష్ప్రయోజనం. ఆచరణలేని వేదాంతం ముక్తిని ప్రసాదించదు. ఆచరణలో పెట్టలేనివానికి ఎన్ని తెలివితేటలు ఉన్నా లాభం లేదు. ఆచరణ ప్రగతికి మూలం. ఆచరణలో పెట్టకుండా ఎన్ని ధర్మసూత్రాలు వల్లెవేసినా, ఎన్ని గ్రంధాలు పారాయణం చేసినా ప్రయోజనం లేదు. దాని వలన వ్యక్తి వికసించడు, సమాజం పురోభివృద్ధి చెందదు. కనుక ప్రతి ఒక్కరూ ఆచరణకు ప్రాధాన్యత ఇవ్వాలి, ఆచరణకు పూనుకోవాలి, ఆచరించినదే చెప్పాలి. ఒట్టిమాటలు వలన ప్రయోజనం లేదు.

**అతిగ భాషించు శూరత్వ మధికమయ్యె**
**కార్యశూరత శూన్యమై కరగిపోయె**
**బ్రతుకులాడంబరాలతో భారమయ్యె**
**నేటి విద్యార్థి బ్రతుకు ఈపాటిదయ్యె. 70**

భగవాన్ బాబా వారు నేటి విద్యార్థి స్థితిని చక్కగా వర్ణించారు. అతిగా మాట్లాడటం, ఆడంబరంగా బ్రతకటం ఏ పనీ చేయకుండా సోమరిలా జీవించడం - ఈనాటి విద్యార్థుల ముఖ్య లక్షణాలు. అందువలననే బాబాగారు ఒక పర్యాయం "అతిభాష మతి హాని, మితభాష అతి హాయి" అన్నారు. అయితే ఈనాడు అతిగా మాట్లాడే Chatter Box (వదరుబోతు)లు ఎక్కువైనారు. సహజంగా ఎక్కువగా మాట్లాడేవారు తక్కువ పనిచేస్తారుట. ఒక పర్యాయం శ్రీ వల్లభాయి పటేల్ "తక్కువ మాట్లాడండి, ఎక్కువ సాధించండి, కేకలు వేసే నాయకులు, కార్యాచరణకు వెనుకంజ వేస్తారు" అంటారు, ఇది యదార్థం. పటేల్ Practical Man ఆయన తక్కువ మాట్లాడేవాడు. ఎక్కువ

పనిచేసేవాడు. ఆయన కార్యశూరుడు. 'మౌనం, భాషణ కంటే ఉత్తమమైనది' అన్నాడు విదురుడు. కనుక అతితక్కువగా మాట్లాడటం మంచిది. అధికంగా మాట్లాడకండి. అధిక మాటలచేత ఆత్మశక్తి, దివ్యశక్తి వ్యర్థమవుతంది, జ్ఞాపక శక్తి క్షీణిస్తుంది. నరముల బలహీనత ఏర్పడుతుంది. కనుక మానవుడు దివ్యత్వమును మౌనమనే శక్తితో అభివృద్ధిపరచుకోవాలి. అధికంగా మాట్లాడటం చేత ఆకలి అధికంగా అవుతుంది. ఆహారం అధికంగా తింటే ఇంద్రియములను నిగ్రహించుకోవటం సాధ్యం కాదు. తిని కూర్చుంటే మదం, అహంకారం అధికమౌతుంది. కనుక సమాజసేవలలో పాల్గొనటం మంచిదంటారు బాబా.

ఈనాటి విద్యార్థి అలంకారాలకు, ఆడంబరాలకు అధిక ప్రాధాన్యతనిస్తున్నాడు. ఈ భౌతిక అలంకారములు శాశ్వతం కావు. కాల క్రమమున అవి క్షీణించి, అరిగి, తరిగి, నశించి, కాలగర్భంలో కలిసి కనపడకుండా పోతాయి. ఈ విద్య ఒక్కటే విద్యార్థికి అలంకారం, అది ఒక్కటే సరియైన భూషణం, అదే శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను తెచ్చి పెడుతుంది. పైపై అలంకారములను ఒకవేళ దొంగలు దొంగిలించుతే దొంగిలించవచ్చును గాని, శ్రద్ధతో, దీక్షతో, పట్టుదలతో నభ్యసించిన విద్యను మాత్రం ఎవ్వరూ దొంగిలించలేరు. కనుక విద్యార్థులు నిరాండంబర జీవితాన్ని గడపాలి. తక్కువగా మాట్లాడుతూ, ఎక్కువగా పని చేస్తూ కార్యశూరులనిపించుకోవాలి.

**అమిత వాంఛల తోడనే యలమటించు**
**వారు విద్యార్థులగుదుర వాస్తవమున**
**విద్య నర్థించువారికే వినయమబ్బు**
**వినయమబ్బిన వాడెపో విజ్ఞుడగును.** 71

అమితమైన కోరికలు, వాంఛలతో అలమంటించేవారు వాస్తవంగా విద్యార్థులు కానేకారని భగవాన్ బాబావారు స్పష్టం చేశారు. ఈనాడు

విద్యార్థులు "విషయానందమునే విరివిగా ఆశిస్తున్నారు గాని, విద్యానందమును అంతగా ఆశించడం లేదు" అని అంటారు బాబా. కనుక ప్రతి విద్యార్థి వాంఛలను తగ్గించుకోవాలి. కోరికలను పరిమితం చేసుకోవాలి. అమితంగా ఖర్చుచేయటం తగ్గించుకోవాలి. మార్కెట్‌లో చూచినదల్లా స్వంతం చేసుకోవాలని భావించడం పొరపాటు సహజంగా మానవుని వాంఛలకు అంతుండదు, కోరికలకు మితముండదు. మన తాహతుకు మించిన దానిని ఆశించడం అవివేకం. అది తీరనప్పుడు మనసు బాధ పడుతుంది. మానసిక శాంతి లోపిస్తుంది. కనుక మన తాహతును దృష్టిలో పెట్టుకొని కనీస అవసరాలకు అవసరమైన వాటిమీద ధనమును వ్యయం చేయటం నేర్చుకోవాలి. "విద్యార్థులు విషయార్థులు కారాదు" అంటారు బాబా. ఈనాడు చాలామంది విద్యార్థులు విద్యనార్జించడం మీద ఆసక్తిని చూపటంలేదు. అనవసరమైన సంబంధం లేని విషయాలను సేకరించడానికే ఎక్కువ ఆసక్తిని చూపుతున్నారు. ఇది విద్యార్థి లక్షణం కాదు.

"విద్య నర్థించువారికే వినయమబ్బు, వినయమబ్బినవాడే విజ్ఞుడగును" అని బాబా ఈ పద్యం ద్వారా తేటతెల్లం చేశారు. "విద్యా దదాతి వినయం..." అని మన మహర్షులు కూడా ఏనాడో చెప్పారు. విద్య యొక్క అసలైన ప్రయోజనం విజ్ఞానాన్ని సముపార్జించడం. విజ్ఞానాన్ని సముపార్జించినవాడే విజ్ఞుడు. వినయం వలన విజ్ఞత వస్తుంది. "విద్యా వినయ సంపన్నః" అన్నారు పెద్దలు. విద్యతో పాటు వినయమును కూడా అలవరుచుకున్నప్పుడే వివేకోదయం అవుతుంది. విజ్ఞుడనిపించుకుంటాడు. అటువంటి విద్యార్థే రాణిస్తాడు, అభివృద్ధిలోనికి వస్తాడు.

**పుస్తకముల నిండ మస్తుగా చదువుండ**
**మస్తకముల నిండ మట్టియుండె**
**నేటి చదువు పొట్టకూటి కోసమే కదా**
**వినుము భారతీయ వీరసుతుడ** **72**

అన్నారు బాబా. ఈనాటి విద్యలు కేవలం పొట్టకూటి కోసమేననే అభిప్రాయం నానాటికి ప్రబలిపోతున్నది. విద్యనభ్యసించడం ఉద్యోగం కోసమని, ధనసంపాదనకేననే అభిప్రాయం చాలామందిలో ఉన్నది. ఇది నిజంగా దురదృష్టకరం. ఈ భావనను పనిగట్టుకొని మన ప్రజలలో ఆంగ్లేయులు కలుగజేశారు. మన భారతీయులను గుమాస్తాలుగా తయారుచేయాలనే ఉద్దేశ్యంతోనే మెకాలే మన దేశంలో ఇంగ్లీషును ప్రవేశపెడుతూ "ఇంగ్లీషు విద్య భారతీయుణ్ణి ఇంగ్లీషు వాణ్ణిగా మార్చివేస్తుంది. రంగులో, రక్తంలో, ఊహలో ఈ విద్య భారతీయుణ్ణి ఇంగ్లీషువాణ్ణి చేస్తుంది" అన్నాడు. స్వాతంత్ర్యం వచ్చి అర్ధశతాబ్దం కావస్తున్నా ఈ భావం మన మనసుల నుండి వైదొలగకపోవటం కడువిచారకరం.

ఈనాటి ఈ దేశంలో విద్య యాంత్రికంగానే బోధించ బడుతున్నది. అందులో ఏ మాత్రం చైతన్యంగాని, నైపుణ్యంగాని కనిపించడంలేదు. పుస్తకాలలో మాత్రం మస్తుగా చదువున్నది గాని, మస్తకములలో మాత్రం మట్టి కనిపిస్తున్నదని బాబావారు చక్కగా చమత్కరించారు. ఈ విషయమును గురించి బాబావారు ఒక పర్యాయం "పుస్తకమును మస్తకములో చేర్చాలిగాని, మస్తకమునే పుస్తకముగా మార్చరాదు" అన్నారు. కేవలం Bookkish Knowledge (పుస్తకజన్య జ్ఞానం) వలన ప్రయోజనంలేదు. అనుభవజ్ఞానమును సంపాదించాలి, విచక్షణాజ్ఞానమును పెంపొందించుకోవాలి, వివేకజ్ఞానమును కలిగి ఉండాలి. *"ఈనాటి Bookkish Knowledge రేపు Knowledge, తరువాత Elergy గా వికటిస్తున్నది. అదికాదు, Knowledge దివ్యమైన Energy (శక్తి)గా మారాలి, Elergy గా మాత్రం కారాదు"* అంటారు బాబా.

*"Education is for life not for living"* (జీవించటానికి కాదు, జీవితమునకే విద్య కావాలి) అన్నారు బాబా.

"కూటి కోసం విద్య కాదని
ప్రజ్ఞ కోసం చదువుకోమని
చదువు మర్మం ఎఱుకపరచిన
గురుదేవులకు వందనం"

విద్యకు అసలు సరియైన నిర్వచనం చెప్పారు బాబా. చెప్పుటయే కాదు ఆచరణలో పెట్టి చూపిస్తున్నారు. బాలబాలికలను చక్కటి సంస్కార వంతులుగా తీర్చిదిద్దుతున్నారు. అయితే విచిత్రమేమిటంటే మిగతా విద్యాలయాలలో కేవలం డిగ్రీలు మాత్రమే పొందుతున్నారుగాని, వారికి ఉద్యోగాలు మాత్రం దొరకటం లేదు. మార్కులు, ర్యాంకులు వస్తున్నాయి గాని గుణం మాత్రం పెరగటం లేదు. ఈనాటి విద్యలు ఇటు పొట్టకూటికీ ఉపయోగపడటం లేదు, అటు వినయ విధేయతలు పెంచటం లేదు. ఈనాటి విద్యార్థులు "రెంటికీ చెడ్డ రేవడి" వలె ఉభయభ్రష్టులవుతున్నారు. కనుక ఈ విద్యావిధాన స్వరూపమే మారాలి. బాలబాలికలలో నైతిక విలువలను పెంపొందించే ప్రయత్నం చిన్ననాటి నుండే జరగాలి. స్వశక్తి మీద జీవించడానికి అవసరమైన, అనుభవపూర్వకమైన సాంకేతిక పరిజ్ఞానమును అందించే ప్రయత్నము జరగాలి. విద్యారంగంలో సమగ్రమైన, సంపూర్ణమైన సంస్కరణలు (Total Revolution) తీసుకొని రావాలి.

**పొట్ట కూటిని చేకూర్చునట్టి విద్య**
**నీతి ధార్మిక దృష్టిని నేర్పగలదె**
**సహజ ధార్మిక దృష్టినే చంపివేయు**
**సత్యమును తెలుపుబాట ఈ సాయిమాట. 73**

అన్నారు బాబా. నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక శీలసంపత్తులను ఇనుమడింపజేసేదే సరియైన విద్య. పొట్ట కూటికోసం నేర్చే విద్యలు నైతిక

విలువలను పెంపొందించలేవు. ధార్మిక దృష్టిని సమూలంగా కాలరాచి వేస్తాయి. నైతిక ధార్మిక దృష్టి లేనివాడు ఎంతటి విద్యావంతుడైనా, ఎంతటి మేధావి అయినా, వాని వలన సమాజానికి ప్రయోజనం ఉండదు. తాను నేర్చిన విద్యల వలన, సంపాదించిన డిగ్రీల వలన ఒకవేళ డబ్బు సంపాదించగలుగుతే సంపాదించవచ్చునేమోగాని, సమాజంచేత మాత్రం మెప్పును పొందలేడు. కేవలం ధనమువలననే వ్యక్తిత్వం వికసించదు. నీతి, నిజాయితీలు గల మానవుని యందే వ్యక్తిత్వం యినుమడిస్తుంది. ఒక్క నీతిమార్గం మాత్రమే వ్యక్తి విలువలను పెంచివేస్తుంది. యోగ్యతను, అర్హతను సంపాదించగలుగుతాడు. అట్టి యోగ్యత వలన ధనమును కూడా సంపాదించగలుగుతాడు. నీతితో సంపాదించిన ధనమును సద్వినియోగపరచాలనే ధార్మిక దృష్టి అలవడుతుంది. అప్పుడు ఆత్మ శాంతి లభిస్తుంది. అక్రమార్జన వలన శాంతి చేకూరదు. మనశ్శాంతి అసలే ఉండదు. కనుక భౌతిక, లౌకిక విద్యలతోపాటు నైతిక, ధార్మిక ఆధ్యాత్మిక విలువలను కూడా పెంపొందించుకోవాలి. అప్పుడే మానవుని వ్యక్తిత్వం యినుమడిస్తుంది.

**భుక్తి చదువులన్ని భక్తితో చదివేరు**
**ముక్తి చదువుకెవరు ముందురారు**
**ఇట్టివారు నన్ను ఎఱుగంగ నేర్తురా ?**
**ఎట్టి చదువులున్న యేమి ఫలము ?** 74

అన్నారు బాబా. "ముక్తిని సాధించేది విద్య" అని ప్రాచీన కాలమునుంచి విద్యకు చెబుతున్న అసలైన అర్థం. కాని నేటి విద్య ముక్తి సాధకంగా లేదు, భుక్తి నిమిత్తమై ఉన్నది. అయితే రానురాను ఈనాటి డిగ్రీలు ముక్తిని ప్రసాదించకపోయినా, భుక్తిని కూడా యివ్వటం లేదు. ఈనాడు ముక్తీలేదు, భుక్తీ లేదు. నేటి విద్యకు జీవితావసరములకు ఎట్టి సంబంధం కనిపించటం లేదు. నేటి సాంఘిక పరిస్థితులకు ఏమాత్రం అనుకూలంగా కూడా లేదు.

అయినప్పటికి, ఏదో ఒకరోజున భుక్తికి ఉపయోగపడుతుందనే ఆశతో, భక్తితో భుక్తి చదువులు చదువుతున్నారు. అయితే ఉద్యోగాలు దొరకక నిరాశ నిస్పృహలకు గురియై పోతున్నారు. కనుక ఈనాటి విద్యావిధాన రూపురేఖలు మారాలి. విద్యారంగంలో విప్లవాత్మకమైన మౌళికమైన మార్పులను తీసుకొని రావాలి. బోధనాపద్ధతి కూడా మారాలి. మానవ జీవన వికాసానికి తోడ్పడే విధంగా విద్యావ్యవస్థను పునర్ వ్యవస్థీకరించాలి. ఇతరుల మీద ఆధారపడకుండా, తన కాళ్ళమీద తానే నిలబడేటట్లుగా చేసేటటువంటి విద్యను గరపాలి. మానవునిలో అంతర్భూతమైన అనంతశక్తిని వికసింపజేసే ప్రయత్నం జరగాలి.

అసలు ఈనాడు *'ముక్తిని గురించి ఎవరూ పట్టించుకోవటంలేదు, ఆలోచించటంలేదు. భుక్తిని గురించే ఆలోచిస్తూ కేవలం లౌకిక విద్యలకే ఈనాటి వారు ప్రాధాన్యత నిస్తున్నారు. 'ఇట్టివారు నన్ను ఎఱుంగనేర్తురా ?'* అన్నారు బాబా. కేవలం లౌకిక విద్యలు మాత్రమే మానవుని రక్షింపజాలవు. ఎన్ని భౌతిక విద్యలు సంపాదించినప్పటికీ మానవుడు సర్వవేత్త కాలేడు. సర్వజ్ఞుడు అంతకన్నా కాలేడు. ఆధ్యాత్మిక విద్యవల్లనే ముక్తి సంప్రాప్త మవుతుంది. లౌకిక విద్యలు పరిపూర్ణ శాంతిని చేకూర్చవు. జన్మరాహిత్యమును కలుగజేయవు. *"తరతి శోక మాత్మవిత్"* ఆత్మజ్ఞాని ఒక్కడు మాత్రమే శోకమును దాటగలడు. దీనిని సాధించవలెననిన ప్రతి ఒక్కరూ పరమాత్మను ఆశ్రయించవలసినదే. లౌకిక విద్యలతోపాటు ఆత్మజ్ఞానమును తెలుసుకొనేటటువంటి ఆధ్యాత్మిక విద్యనుకూడా ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా నేర్చుకోవాలి. ఈ మహా ప్రయత్నం భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి నేతృత్వంలో జరుగుతున్నది. వారి విద్యాలయములలో చదివే బాలబాలికలలో అత్యంత ఆధునిక విద్యతోపాటు; నైతిక, ఆధ్యాత్మిక, శీలసంపత్తులను యినుమడింపజేసే ప్రయత్నం జరుగుతున్నది. ఇటువంటి ప్రయత్నం సామాన్యంగా అన్ని విద్యాలయములలో జరగటంలేదు. అందువలననే ఈనాటి

బాలబాలికలలో అశాంతి చెలరేగుతున్నది, క్రమశిక్షణారాహిత్యం పెచ్చు పెరిగిపోతున్నది, సమైక్యతా భావం నానాటికి సన్నగిల్లుతున్నది. ఈ రుగ్మతలన్నిటికి మూలకారణం? లౌకిక విద్యలతోపాటు, నైతికస్థాయిని పెంచే ప్రయత్నం విద్యాలయములలో జరుగకపోవటమే. Moral Classes ను నిర్వహించకపోవటమే. కనుక ప్రతి విద్యాలయంలో భుక్తికి, ముక్తికి ఉపయోగపడే విద్యను గరపాలి.

**సత్ప్రవర్తన, సద్బుద్ధి సత్యనిరతి**
**భక్తి క్రమశిక్షణ, కర్తవ్యపాలనంబు**
**నేర్పునదే విద్య అద్దాని నేర్వలయు**
**సత్యమును తెల్పు బాట శ్రీ సాయిమాట. 75**

భగవాన్ బాబావారు ఈ పద్యంలో విద్యకు సరియైన నిర్వచనం చెప్పారు. 1. సత్ప్రవర్తన, 2. సద్బుద్ధి, 3. సత్యనిరతి, 4. భక్తి, 5. క్రమశిక్షణ, 6. కర్తవ్య పాలన - ఈ ఆరింటిని నేర్పునదే సరియైన విద్య యని అటువంటి విద్యను నెరవేర్చవలెనని బాబా చెప్పారు.

1. సత్ప్రవర్తన అనగా మంచి నడవడి, మంచి నడత అని చెప్పుకుంటే సరిపోతుంది. సత్ కర్మలను అనగా మంచి పనులను ఆచరిస్తుంటే మంచి ప్రవర్తన అబ్బుతుంది. 2. సద్బుద్ధి అనగా మంచి బుద్ది. ఈ బుద్ధికి విచక్షణా జ్ఞానం ఉంటుంది. ఏ పని ఎప్పుడు చేయవచ్చునో, ఏ పని చేయకూడదో దీనికి బాగా తెలుసు. 3. సత్యనిరతి అనగా సత్యమునందు మిక్కిలి నాసక్తి కల్గియుండుట. ఎల్లవేళలా సత్యమునే పలుకవలెననే దృఢ సంకల్పం కల్గియుండుట. 4. భక్తి యొక్క స్వరూప స్వభావాలు గమనించాలి. భగవంతునిపై గల అనురక్తియే అసలు భక్తి. దైవభక్తి, మాతృభక్తి, పితృభక్తి, గురు భక్తి, మాతృదేశభక్తి - ఈ ఐదు ప్రతి విద్యార్ధిలో ఉండవలసిన సద్గుణాలు. 5. క్రమశిక్షణ అనగా ఆత్మ

సంయమనమే. జీవితంలో విజయం పొందటానికి అది మూలాధారం. క్రమశిక్షణ విద్యార్థులకు ఎంత అవసరమో, ఉపాధ్యాయులకు అంతకన్నా ఎక్కువ అవసరం. "ఒక విద్యార్థి చెడిపోతే దానివలన అతడొక్కడే పాడౌతాడు. ఒక ఉపాధ్యాయుడు క్రమశిక్షణతో కర్తవ్యాన్ని నిర్వర్తింపకపోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు" అని చెప్పారు బాబా. ఇది యదార్థ నగ్న సత్యం. 6. కర్తవ్య పాలన పరమోత్కృష్టమైన ధర్మం నియమ నిబంధనలకు లోనై చేసే కార్యమే కర్తవ్యము. అంటే ధర్మబద్ధంగా చేయటం, ధర్మబద్ధంగా ఆచరించడమే కర్తవ్యపాలన. "భగవంతుణ్ణి నీ మనస్సులో సాక్షిగా భావించి, భగవదర్పణ భావంతో నీ నిత్య విధులను ఆచరించు. అదే నీ డ్యూటి" అని అన్నారు బాబా.

'విద్య' అంటే కేవలం చదవటం వ్రాయటం మాత్రమే కాదు, మార్కులు సంపాదించటమే కాదు. పై ఆరు సద్గుణములను అలవరచుకోవాలి, అనుభవంలోనికి తీసుకొని రావాలి, ఆచరణలో పెట్టాలి. అదియే సరియైన విద్య. అద్దానిని ప్రతివారు నేర్వవలయును.

**తరచి చదువు చదవ తర్కవాదమెకాని**
**పూర్ణజ్ఞానమెపుడు పొందలేదు**
**చదువులన్నియు చదివి చావంగ నేటికి**
**చావులేని చదువు చదువవలయు 76**

ఈ పద్యంలో భగవాన్ బాబావారు అత్యున్నతమైన ఫిలాసఫీని అందించారు. ఎటువంటి చదువు చదివితే శాశ్వతమైన శాంతిసుఖాలు లభిస్తాయో చెప్పారు. 'చావులేని చదువు చదువవలయు' అన్నారు బాబా. చావులేని చదువు ఏమిటి? అదియే ఆత్మ విద్య. దానికి చావు లేదు. అసలు దానికి పుట్టుక ఉండే కదా చావు. పుట్టుక ఉండిన ప్రతి పదార్థమునకు మార్పు ఉంటుంది. ఎట్టి ఆకారములేని ఆత్మ తత్త్వాన్ని లక్ష్యమునందుంచుకున్నప్పుడే ఎట్టి మార్పు లేని పరిస్థితిని పొందగలుగుతామంటారు బాబా.

"జ్ఞానానాం ఆత్మజ్ఞానముత్తమం" జ్ఞానములలోకెల్లా ఆత్మజ్ఞానం ఉత్తమమైనది. ఈ ప్రపంచములో అనేక జ్ఞానాలున్నాయి. భౌతిక శాస్త్ర విజ్ఞానం (Science) సంగీత, సాహిత్య, నృత్య, శిల్ప, చిత్ర, గణిత శాస్త్ర జ్ఞానములెన్నో ఉన్నాయి. వీటన్నిటికంటే ఆత్మజ్ఞానం ఒక్కటే ఉత్తమమైనది, శ్రేష్ఠమైనది. ఎన్ని జ్ఞానములను సంపాదించినప్పటికీ, ఆత్మజ్ఞానం సంపాందించని వానికి శాంతిలేదు, సుఖమూ ఉండదు. భౌతిక, లౌకిక జ్ఞానముల వలన శాంతి సుఖములను అందుకోలేరు. ఆత్మజ్ఞానం వలన మాత్రమే శాంతి సుఖములు సంప్రాప్తించడమే గాక భగవంతునికి కూడా ప్రీతిపాత్రులవుతారు. అందువలననే 'నహి నహి రక్షతి డుకృఞ్ కరణే' అన్నారు ఆదిశంకరులు. లౌకిక విద్యలు జనన మరణములనుండి రక్షింపజాలవు. దైవ విద్య, ఆధ్యాత్మిక విద్యవలననే మోక్షం సంప్రాప్త మవుతుంది. ఏ జ్ఞానం వలన మనుజుడు అనేకత్వంలో ఏకత్వమును, మృత్యువులో అమృతత్త్వమును గాంచగల్గునో, అదియే అన్ని జ్ఞానములలో కెల్లా సర్వ శ్రేష్ఠమైనది. అదియే ఆత్మజ్ఞానం. ఆత్మజ్ఞానం అన్నా పరమాత్మ జ్ఞానం అన్నా ఆధ్యాత్మికజ్ఞానం అన్నా - అంతా ఒక్కటే. ఆత్మను పరమాత్మను చక్కగా తెలుసుకొనుటకు దోహదం చేసే జ్ఞానం అది. అట్టి జ్ఞానం ఎలా లభిస్తుంది ?

"యస్మిన్ జ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి" దేనిని తెలిసికొనినచో సమస్తమును తెలుసుకొనబడినదగునో, అట్టి పరమాత్మనే ఎరిగినవాడగుట. అదియే ఆత్మజ్ఞానము. అతడే ప్రపంచంలో సర్వజ్ఞుడు, పేరు ప్రఖ్యాతులనందుకోగలుగుతాడు. అట్టి ఆత్మ జ్ఞానానికి మోక్షం సంప్రాప్తిస్తుంది. అట్టి ఆత్మజ్ఞానం "చిత్తశుద్ధి" వలననే లభిస్తుంది. "చిత్తస్యశుద్ధయే కర్మః" అట్టి చిత్తశుద్ధి నిష్కామ కర్మాచరణచే సిద్ధించును. పవిత్ర కార్యములు, పుణ్యకార్యములు చేయుట వలన లభించును. దానం, పరోపకారం, మానవసేవ చేయటం వలననూ, రామాయణ, భారత, భాగవత, భగవద్గీతాది గ్రంథములు అధ్యయనం చేయటం వలననూ

మరియు నిష్కామ బుద్ధితో ఎట్టి ఫలాపేక్ష లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మల నాచరించడం వలన "చిత్తశుద్ధి" కలుగుతుంది. అట్టి నిర్మల హృదయమున "జ్ఞాన భాస్కరుడు" ఉదయిస్తాడు. అట్టి జ్ఞానోదయం వలన నరుడు నారాయణుడవుతాడు, జీవుడు శివుడవుతాడు, మానవుడు మాధవుడవుతాడు, పురుషుడు పురుషోత్తముడవుతాడు, పశువు పశుపతి అవుతాడు.

లోక సంబంధమైన విద్యలనభ్యసించినవాడు పండితుడనిపించుకోవచ్చును, మేధావిగా గుర్తించబడవచ్చును. విద్యావంతుడనిపించుకోవచ్చును గాని "జ్ఞాని, సర్వజ్ఞుడు, సర్వవేత్త" మాత్రం కాలేడు. కారణం ? లౌకిక విద్యలు పూర్ణజ్ఞానమును సంపాదించవు, పరిపూర్ణ శాంతిని కలుగజేయవు, శోకమును నివారణ చేయలేవు, జన్మరాహిత్యమును కలుగజేయవు. ఒక్క 'ఆత్మవిద్య' మాత్రమే శోకనివారణకు మార్గమును బోధించగలదు. అదియే ఆధ్యాత్మిక విద్య! "తరతి శోకమాత్మవిత్" ఆత్మజ్ఞాని ఒక్కడు మాత్రమే శోకమును దాటగలడు. ఆత్మజ్ఞానికి సకల విద్యలు కరతలామలకములగును.

ఆత్మజ్ఞానమును ఎవరైననూ ప్రయత్నించి సాధించవచ్చును. కుల, మత, వర్ణ, వర్గ, జాతి వివక్షతలేదు. స్త్రీ పురుష బేధములేదు. ఎవరైనా ఈ జ్ఞానజ్యోతిని వెలిగించుకోవటానికి అర్హులే. కావలసినది నిశ్చలమైన, అనన్యమైన భక్తి మాత్రమే. "యోమద్భక్తః సమే ప్రియః" 'ఎవడు నా యెడల భక్తి కలిగియుండునో వాడు నాకు ప్రియుడు' అని భగవానుడు గీతలో చెప్పాడు. మహనీయుల వలన ఆధ్యాత్మిక బోధనలు, పరమార్థ తత్త్వములను తెలుసుకొని, శ్రద్ధతో శ్రవణంచేసి, నిరంతరం మననం చేసుకుంటూ ఏకాగ్రనిష్ఠతో, భక్తి ప్రపత్తులతో ఆచరించడంవలన తరించవచ్చును, పరమాత్మను సాక్షాత్కరింపజేసుకొనవచ్చును. అట్టి ఆత్మజ్ఞానికి లౌకిక విద్యలు లేకపోయినా ఫరవాలేదు. అట్టి ఆత్మజ్ఞానం కొందరికి పూర్వజన్మ సంస్కారం వలన లభిస్తుంది. మరికొందరికి నిరంతర

చింతన ద్వారా నిదానంగా అబ్బుతుంది. రామకృష్ణపరమహంస లౌకికవిద్యలను ఏమాత్రం అభ్యసించలేదు. అయినప్పటికీ యావత్ ప్రపంచం ఆయనను నేడు గురువుగా భావించి పూజిస్తున్నది. కారణం ? అచంచలమైన భక్తితో ఆ కాళీమాతను సాక్షాత్కరించుకోగలిగాడు. జ్ఞాననేత్రం తెరువబడింది. ఆయనకు సకలశాస్త్రములు కరతలామలకము లైనాయి. దారిదోపిడి వృత్తిగా పెట్టుకొనిన 'రత్నాకరుడు' నిరంతర సాధనలవలన వాల్మీకిగా మారి, అత్యున్నతమైన, ఆదర్శవంతమైన రామాయణ మహాకావ్యమును ప్రపంచానికి ప్రసాదించగలిగాడు. కటిక కసాయివాడైన 'ధర్మవ్యాధుడు' నిష్కామ కర్మాచరణ ద్వారా ప్రపంచానికే ఆదర్శపురుషుడై వెలుగొంది మోక్షమును పొందాడు. దానవ కులంలో జన్మించి భక్తితో మోక్షమును పొందాడు 'ప్రహ్లాదుడు'. వానరుడైన హనుమంతుడు సేవాతత్పరుడై, రామభక్తుడై తరించాడు. 'జటాయువు' పక్షి జాతికి చెందినదైనప్పటికీ భక్తితో మోక్షమును పొందింది. ఏనుగు, సర్పం, సాలెపురుగులు మోక్షమును పొందలేదా ? అందరూ మోక్షానికి అర్హులేనని స్పష్టమయింది. భగవంతునికి కావలసింది అనన్యమైన భక్తి, చిత్తనైర్మల్యము, శ్రద్ధాభక్తులుగల సాధకులు మాత్రమే. కనుక "శ్రద్ధ, విశ్వాసం, నమ్మకం" అను మూడు సద్గుణములను అలవరచుకొని ఆత్మజ్ఞానమును సంపాదించవలెను.

"ఆధ్యాత్మిక విద్యా విద్యానాం" విద్యలలోకెల్ల ఆధ్యాత్మిక విద్య ఉత్తమమైనది. లౌకిక విద్యలను కూడా నిర్లక్ష్యం చేయరాదు. భుజించాలంటే అన్నం ప్రధానంగా ఉండాలి. అంతేకాదు అన్నంతోపాటు కూర, పులుసు, పప్పు, పచ్చడి మొదలగు పదార్థములు కలుపుకోవటానికి కావాలిగదా ! అదే విధముగనే ఆధ్యాత్మిక విద్య అనే అన్నమును మనం తయారు చేసుకోవాలి. దీనితోపాటు భౌతిక, లౌకిక, ధార్మిక విద్యలనే కూరలను చేకూర్చుకోవాలి" అని ఒక పర్యాయం భగవాన్ బాబావారు చక్కగా వివరించారు. కనుక లౌకిక విద్యలతో పాటు ఆధ్యాత్మిక విద్యకూడా ప్రతి

ఒక్కరికీ అత్యవసరం. నదీనాం సాగరో గతిః. నదులు అనేక రూప నామములలో ప్రవహిస్తున్నాయి. కానీ సముద్రం ఒక్కటే. ఫిజిక్స్, కెమిస్ట్రీ, మాథ్స్ - ఇవన్నీ వివిధ నదుల వంటివి. ఇవన్నీ చేరి ఆధ్యాత్మికవిద్య అనే సముద్రంలో ఏకమైపోవాలి. అదే భిన్నత్వంలో ఏకత్వం" అని అంటారు బాబా.

లౌకిక విద్యలు కేవలం తర్కవాదమునకే ఉపయోగిస్తాయి గాని పరిపూర్ణ జ్ఞానమును ప్రసాదించవు. ఆత్మజ్ఞానమును ప్రసాదించునది ఆత్మవిద్య లేక ఆధ్యాత్మిక విద్య మాత్రమే. దానికి చావు లేదు. అట్టి చావు లేని చదువును కూడా ప్రతి ఒక్కరూ చదవాలని బాబావారి ఆకాంక్ష. దానిని ఆచరించి తరించుదాం.

# కర్మ

**కర్మమున పుట్టు జంతువు**
**కర్మముననె వృద్ధి పొంది, కర్మముననె చనున్**
**కర్మమె నరునకు దైవము**
**కర్మమె సుఖదుఃఖములకు కారణమరయన్.** 77

"దేశ సమస్యలను ధైర్యంగా ఎదుర్కొనుటకు కర్మవీరులుగా, కర్మయోగులుగా, కర్మయోధులుగా తయారుకావాలి." అని భగవాన్ బాబావారు ఒక పర్యాయం యువతను హెచ్చరించారు. కర్మయే మనకు ప్రధానం. కర్మయే లేకపోతే లోకమంతా స్తంభించిపోతుంది. మనము కర్మము నందే పుట్టాం. కాయము యిచ్చినది కర్మ నిమిత్తమే. ఈ కాయ కర్మములు రెండు కాల కారణముల ననుసరించి ఉంటాయి. మనము మన కాయమును, కాలమును మన కర్తవ్యకర్మలను పవిత్రము గావించుకునే ప్రయత్నములో మునిగా ఉండాలి. జీవితమును

సుఖదుఃఖములనే తరంగములతో కూడిన సాగరమని భావించాలి. విశ్వాసమనే పడవను తయారుచుసి, దానికి చిల్లులు లేకుండా చూచి ఆవలి ఒడ్డునకు సురక్షితంగా చేరే మార్గము నన్వేషించాలంటారు బాబా.

"జంతూనాం నరజన్మ దుర్లభమ్" అన్నారు కదా! ఎనభై నాలుగు లక్షల జీవరాసులలో మానవ జన్మ ఎంతో ఉత్కృష్టమైనది. పవిత్రమైనది. ఇలాంటి మానవజన్మ ఎత్తి, తుచ్ఛములయిన క్రియలలో జీవితమును అంకితము గావించి కేవలము అపవిత్రమూ, నిరర్ధకము గావించుకొనిన, మానవజన్మ ఎత్తి ఏమి సార్ధకము? ప్రాప్తించినటువంటి మానవజన్మను సార్ధకం గావించుకొని, పవిత్రమైన మార్గములోపల పరులకు ఆదర్శ వంతమైన జీవితము నందించి, మీరునూ అనుభవించి ఆనందమును పొందాలంటారు బాబా. అహంకార మమకారములతో ఆచరించి ప్రతి కర్మ దుఃఖమయముగా రూపొందుతుంది, బంధహేతువు అవుతుంది. దైవార్పణ భావంతో చేసిన కర్మలన్నియూ యోగముగా మారుతాయి. అహంకారం అధికమయ్యే కొలది ఆత్మానందం తరిగిపోతుంది. అహంకారం నిర్మూలనం గావించే నిమిత్తమై కర్మను యోగముగా మార్చుకోమని కృష్ణుడు బోధించాడు.

"తస్మై నమః కర్మణే" అన్నారు. జీవుడు మొట్టమొదటి కర్మను ఆరాధన చేసి కర్మమునకు నమస్కరించి ప్రారంభం చేయాలి. కారణ మేమనగా మానవుని యొక్క పాపమునకు గాని, పుణ్యమునకుగాని; మంచికిగాని, చెడ్డకు గాని; ఊర్ధ్వస్థితికి గాని, అధోస్థితికి గాని కాలమే ప్రమాణము. కాలమే ప్రధానం. కనుక "ఓ కాలస్వరూపుడైన దేవుడా! నన్ను పవిత్రమైన రీతిలో ప్రవేశపెట్టి, నా కర్మలు సార్ధకమైనవిగా తీర్చిదిద్ది నీ సన్నిధిలో, నీ పెన్నిధిలో నన్ను ఉంచుకో!" అని ప్రార్ధించాలిట.

కాలమును ధిక్కరించి ఏ జీవి జీవించుటకు వీలు కాదు. కాలము ఎవరి కోసమూ ఆగదు. జీవుడు కాలమును అనుసరించవలసిందే.

కానీ కాలము జీవుని అనుసరించదు. కాలము పెద్దప్రవాహము వంటిది. ఈ కాల ప్రవాహంలో కొట్టుకొని పోయే వ్యక్తి, ఒడ్డును ఆశ్రయించినప్పుడే తాను రక్షితుడు కాగలడు. ఆ ఒడ్డే దైవం. అట్టి దైవాన్ని ఆశ్రయించిన వ్యక్తి ఈ కాల ప్రవాహమునకు దూరమై; బాధలకు, దుఃఖములకు, విచారములకు దూరమై ఆనందంలో తన కాలమును అంకితం గావించు కోగలడంటారు బాబా.

# కర్మఫలము

**చెడ్డపని చేసి మంచిని చెందబోరు**
**మంచిపని చేసి కీడును గాంచబోరు**
**నింబమును నాట చూతఫలంబు గనునె?**
**నిమ్మఫలమును గనునె చూతంబు నాట. 78**

ఈ పద్యములో భగవాన్ బాబావారు చక్కటి ఉపమానమును పేర్కొనినారు. మనం భూమిలో ఏ విత్తు నాటితే, అదే మొక్క మొలచి, అదే ఫలమును మనకు అందిస్తుంది. ఇది ప్రకృతి యొక్క సహజ ప్రవృత్తి. సృష్టి రహస్యం కూడా ఇదే. దీనిని కాదనటానికి ఎవ్వరికీ సాధ్యం కాదు. భూమిలో నిమ్మమొక్కను నాటి మామిడిపండు కావాలంటే లభించదు. మామిడిమొక్కను నాటి నిమ్మపండును ఆశిస్తే ప్రయోజనముండదు. అదే విధంగా మనం ఈనాడు ఎట్టి కర్మలను ఆచరించుదుమో, భవిష్యత్తులో అట్టి ఫలములనే మనం అనుభవించవలసి వస్తుందంటారు బాబా.

మనకు ఏవైనా కష్టములు వచ్చినప్పుడు *"హే భగవాన్! నాకెందుకు ఇన్ని కష్టాలిస్తున్నావు? నన్నెందుకు ఇట్లా పరీక్షిస్తున్నావు? నన్నెందుకు ఇంత శోధిస్తున్నావు? బాధిస్తున్నావు?"* అని విలపిస్తాం. వాపోతాం. ప్రార్థిస్తాం. కానీ ఈ కష్టములు భగవంతుడు యిస్తున్నాడా.

భగవంతుడు మనకు కష్టములను గాని, సుఖములనుగాని అందించేవాడు కాదు. మన కర్మలయొక్క ఫలితమే ఈ సుఖదుఃఖముల నందిస్తున్నది. ప్రతి కర్మ ఒక విత్తనం వంటిది. అవి మొక్కలై, వృక్షములుగా మారి మనకు సుఖ దుఃఖములనే ఫలములనందిస్తున్నాయి. "చేసుకున్న వానికి చేసుకున్నంత మహదేవ!" అనే సామెత అనుభవంలో వచ్చిందనే విషయం విస్మరించరాదు.

భగవాన్ బాబా ఒక పర్యాయం ఈ విషయమై చక్కటి ఉదాహరణ చెప్పారు. నిండు సభలో ద్రౌపదిని దుశ్శాసనుడు అవమానపరుస్తున్నా, సర్వశక్తివంతులైన భర్తలు ఏమీ చేయలేక నిస్సహాయులై చూస్తూ ఉన్నారు. అప్పుడు ద్రౌపది "ఆపద్బాంధవా! అనాథరక్షకా! హే హృదయవాసి!" అని అనేక విధముల కృష్ణుని ప్రార్థించింది. రక్షించడానికి కృష్ణుడు కూడా వెంటనే రాలేదుట. కారణం? కృష్ణుడు భగవంతుడే గదా! అందులో ద్రౌపది సోదరి గదా! ఎందువలన వెంటనే రాలేదు. భగవంతుడు 'కర్మఫలప్రదాత' మాత్రమే. మనం లోగడ చేసిన కర్మలను బట్టి ఫలితమును అందిస్తుంటాడు భగవంతుడు. అప్పుడు ద్రౌపది గత చరిత్రను త్రిప్పాడుట. లోగడ ఆమె ఏదైనా మంచి కర్మలను చేసిందా? అనేది చూచాడుట కృష్ణుడు. అప్పుడు ఒక సంఘటన ఆయన స్మృతిపథంలో మెదిలింది. అది మకరసంక్రాంతి పండుగ సమయం. ఆ రోజు సాయంత్రం రుక్మిణీ సత్యభామలతో కాలక్షేపం చేస్తూ, మధురమైన మాటలు పలుకుతూ, తియ్యని చెఱకును నమలటానికి ప్రయత్నం చేశాడుట. చెఱకు ముక్కలను కోస్తూ తన చేతిని కోసుకున్నాడు. రక్తం కారుతున్నది. ఆ సమయంలో ద్రౌపది కూడా అక్కడనే ఉన్నది. రుక్మిణీ సత్యభామలు కట్టుకట్టడానికి బట్టలు తెమ్మనమని చెలికత్తెలను పురమాయించారు. కాని వారు యింకా రాలేదు. ద్రౌపది ఈ పరిస్థితిని చూచి వెంటనే తన చీరె కొంగును చించి కృష్ణుని వ్రేలుకు కట్టు కట్టింది. రుక్మిణీ సత్యభామలు ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. ఆనాడు

భగవంతుడు మనకు కష్టములను గాని, సుఖములనుగాని అందించేవాడు కాదు. మన కర్మలయొక్క ఫలితమే ఈ సుఖదుఃఖముల నందిస్తున్నది. ప్రతి కర్మ ఒక విత్తనం వంటిది. అవి మొక్కలై, వృక్షములుగా మారి మనకు సుఖ దుఃఖములనే ఫలములనందిస్తున్నాయి. "చేసుకున్న వానికి చేసుకున్నంత మహాదేవ!" అనే సామెత అనుభవంలో వచ్చిందనే విషయం విస్మరించరాదు.

భగవాన్ బాబా ఒక పర్యాయం ఈ విషయమై చక్కటి ఉదాహరణ చెప్పారు. నిండు సభలో ద్రౌపదిని దుశ్శాసనుడు అవమానపరుస్తున్నా, సర్వశక్తివంతులైన భర్తలు ఏమీ చేయలేక నిస్సహాయులై చూస్తూ ఉన్నారు. అప్పుడు ద్రౌపది "ఆపద్బాంధవా! అనాథరక్షకా! హే హృదయవాసి!" అని అనేక విధముల కృష్ణుని ప్రార్థించింది. రక్షించడానికి కృష్ణుడు కూడా వెంటనే రాలేదుట. కారణం? కృష్ణుడు భగవంతుడే గదా! అందులో ద్రౌపది సోదరి గదా! ఎందువలన వెంటనే రాలేదు. భగవంతుడు 'కర్మఫలప్రదాత' మాత్రమే. మనం లోగడ చేసిన కర్మలను బట్టి ఫలితమును అందిస్తుంటాడు భగవంతుడు. అప్పుడు ద్రౌపది గత చరిత్రను త్రిప్పాడుట. లోగడ ఆమె ఏదైనా మంచి కర్మలను చేసిందా? అనేది చూచాడుట కృష్ణుడు. అప్పుడు ఒక సంఘటన ఆయన స్మృతిపథంలో మెదిలింది. అది మకరసంక్రాంతి పండుగ సమయం. ఆ రోజు సాయంత్రం రుక్మిణీ సత్యభామలతో కాలక్షేపం చేస్తూ, మధురమైన మాటలు పలుకుతూ, తియ్యని చెఱకును నమలటానికి ప్రయత్నం చేశాడుట. చెఱకు ముక్కలను కోస్తూ తన చేతిని కోసుకున్నాడు. రక్తం కారుతున్నది. ఆ సమయంలో ద్రౌపది కూడా అక్కడనే ఉన్నది. రుక్మిణీ సత్యభామలు కట్టుకట్టడానికి బట్టలు తెమ్మనమని చెలికత్తెలను పురమాయించారు. కాని వారు యింకా రాలేదు. ద్రౌపది ఈ పరిస్థితిని చూచి వెంటనే తన చీరె కొంగును చించి కృష్ణుని వ్రేలుకు కట్టు కట్టింది. రుక్మిణీ సత్యభామలు ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. ఆనాడు

**వేసుకుందురు విషమైన విత్తనములు**
**ఆశపడుదురు అతిరుచ్య ఫలములు**
**కాచిన కడుచేదు కాయలు తినలేక**
**దోషము దేవునిపై త్రోసి వాదింతురు. 79**

మానవుడు చేసే ప్రతి కర్మకును ఫలితమనేది ఉన్నది. ఎట్టి కర్మనో అట్టి ఫలితము, ఎట్టి తిండియో అట్టి త్రేపు, ఎట్టి పిండియో అట్టి రొట్టె, ఎట్టి విత్తనమో అట్టి మొక్క, విత్తనము ఒకటైతే మొక్క మరొకటి మొలవదు. కనుక మానవుడు ఎట్టి కర్మలనాచరించునో, అట్టి ఫలములు అందుకోగలుగుతున్నాడు. కనుక ప్రతి మానవుడు మంచి పనిచేసి మంచి ఫలమును పొందటానికి ప్రయత్నించాలి. అయితే ఈనాటి మానవుడు పుణ్యఫలము కావాలని అమితంగా ఆశిస్తున్నాడు గాని పుణ్యకర్మల నాచరించడానికి మాత్రం ముందంజ వేయటం లేదు. పాప ఫలమును కోరటం లేదు గాని పాపములు చేయటానికి ఏమాత్రం వెరువటం లేదు. అదే విధంగా విషమైన విత్తనములు భూమిలో నాటి అతిరుచ్యమైన ఫలముల కోసం ఆశపడుతున్నాడు. చేదుకాయలు కాస్తే, వాటిని తినలేక దోషము దేవునిపై వేస్తున్నాడు. ఇదియే మానవుని యందు ఉండినటువంటి అజ్ఞానము.

బాధలను సహించుకోలేక *"ఓ భగవంతుడా! నన్ను ఎందుకు పరీక్షిస్తున్నావు?"* అని కొందరు మొరపెట్టుకుంటుంటారు. యదార్థమునకు మనకు సుఖములను గాని, దుఃఖములను గాని భగవంతుడు అందించటం లేదు. మనం అనుభవించేటటువంటి సుఖదుఃఖములు మనం చేసే కర్మల యొక్క ఫలితములే కాని, భగవంతుని యొక్క ప్రసాదములు కావు. భగవంతుడు కేవలం సాక్షీ భూతుడు మాత్రమే. కష్టములకు క్రుంగి దైవాన్ని నిందించటం, సుఖములకు పొంగి దైవాన్ని విస్మరించటం మంచిది కాదు. మన కష్టములకు కారణం మనమేనన్న సత్యాన్ని మనం ముందుగా

తెలుసుకోవాలి. దైవం ఎప్పుడూ ప్రేమ స్వరూపుడే. దైవం యొక్క దోషం ఇందులో ఏమాత్రమూ లేదు. కర్మ ఫలమనేది తప్పునది కాదు. ఎట్టి కర్మనో అట్టి ఫలితమును నీవు అనుభవించాలి. ప్రతి కర్మకూడనూ ఒక విత్తనమే. ప్రతి విత్తనమూ ఒక చెట్టే. కర్మనుంచి జన్మ వచ్చింది. జన్మ నుంచి భ్రమలు కలిగాయి. భ్రమల నుంచి అజ్ఞానం బయలు దేరింది. కనుక ప్రతిదానికీ మన కర్మలే మూల కారణం. అయితే దైవానుగ్రహంచేత ఎలాంటి కర్మఫలమునైనా తప్పించు కోవచ్చునంటారు. అది అంత తేలిక కాదు. కనుక మనం పవిత్రమైన కర్మలనే ఆచరించేందుకు పూనుకోవాలి.

**కర్మమును చేయు నరునకు హక్కు కలదు**
**కర్మఫలమీయ ధాతకు కలదు హక్కు**
**అడుగ ఫలమును ఏరికి హక్కు లేదు**
**ఇంతకన్నను వేరెద్ది ఎఱుక పఱతు. 80**

"*కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన*" అని భగవద్గీత బోధిస్తున్నది. "*కర్మలు చేయుట యందే అధికారము కలదు కాని, కర్మ ఫలముల నాశించుట యందేనాడును నీకు అధికారము లేదు*" అని గీతాచార్యుడు ఏనాడో స్పష్టం చేశాడు. కనుక కర్మ చేయటమే మన వంతు. ఫలమును కోరే హక్కు మాత్రం ఎవరికీ లేదు. మనం చేయు కర్మలను దృష్టిలో పెట్టుకొని కర్మ ఫలమును భగవంతుడు మనకు ప్రసాదిస్తుంటాడు. అందువలననే భగవంతునికి 'కర్మఫలప్రదాత' అని పేరు.

కర్మఫలం మాత్రం తప్పునది కాదు. కనుక మంచికర్మలను చేస్తే మంచి ఫలితాలు అనుభవిస్తాం. చెడు కర్మలను చేస్తే చెడ్డ ఫలితాలను చవిచూడవలసి వస్తుంది. ఏనాటికైనా సరే చేసిన తప్పులు అనుభవించక

తప్పదు. అయితే కొన్ని కర్మలు అప్పటికప్పుడే ఫలిస్తాయి. మరికొన్ని కొంత కాలం తరువాత ఫలించేటటువంటి ఉన్నాయి. కొన్ని సంవత్సరాలకు ఫలించేటటువంటివి ఉన్నాయి. కొన్ని యుగాలకు కూడా ఫలించేటటువంటివి కూడా ఉన్నాయి. ఉదాహరణకు కత్తి కోసుకుంటే వెంటనే రక్తము వస్తుంది. జారిపడితే కాలు వెంటనే విరుగుతుంది. భోజనం చేసిన వెంటనే అరగదు. అరగటానికి కొన్ని గంటల కాలం తీసుకుంటుంది. విత్తనం నాటిన వెంటనే మొక్క రాదు. మొక్క వెంటనే చెట్టు కాదు. చెట్టుకు వెంటనే ఫలములు రావు, కొన్ని సంవత్సరాల కాలం పడుతుంది. అదే విధముగానే మానవుడు చేసిన ప్రతికర్మ యొక్క ఫలితాన్ని అనుభవించడానికి క్షణములు, నిమిషాలు, గంటలు, దినాలు, సంవత్సరాలు పడుతాయి. కాని ఫలం మాత్రం తప్పదు.

అయితే ఫలితమును ఆశించే అధికారమేమాత్రం లేదన్నారు గదాయని అసలు కర్మలనే చేయరాదనే స్థితికి పోరాదు. పనిచేయకుండా పడుకుంటే సోమరితనం పెరుగుతుంది. అది మనిషి ప్రగతికి అవరోధంగా నిలుస్తుంది. తెలివితేటలను మంట కలుపుతుంది. సోమరితనం తమోగుణ లక్షణం. ఏపనీ చేయకుండా ముడుచుకొని పడుకోవటం కంటే ఏదో ఒక పనిచేయటం మంచిది. అందులో ఏదో ఒక సత్కార్యం చేయటం యింకా ఉత్తమం. Duty is God అన్నారు గదా! కనుక ఎట్టి ఫలితమును ఆశించకుండా నిష్కామ బుద్ధితో సత్కర్మలనాచరిస్తూ సాగిపోయేవారంటే భగవంతునికి కూడా ఇష్టమే. అట్టి వారికి ఆశించకుండానే భగవదానుగ్రహం ప్రాప్తిస్తుంది.

“కర్మధర్మ మయం కావాలి, ధర్మం బ్రహ్మమయం కావాలి” అంటారు బాబా.

# కర్మ - భక్తి - జ్ఞానము

**కర్మమార్గంబు విడరాని కాలిబాట**
**భక్తిమార్గంబు సులువైన బండిబాట**
**జ్ఞానమన విమానంబుపై యాన మరయ**
**యోగమననింక జలధిపై ఓడకాదె. 82**

"కర్మ భక్తిజ్ఞానములను గూర్చి పనికిరాని చర్చలు కొనసాగుతూ ఉంటాయి. ఇవి వేరు వేరని కొందరు భావిస్తుంటారు. ఇది పొరపాటు. ఈ మూడు సాధనా మార్గాలు మూడు చక్రాల సైకిలు వంటివి. ముందు చక్రం కర్మ. వెనుక ఒకే వరుసలో గల రెండు చక్రాలు భక్తి జ్ఞానములు" అని అంటారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు.

"కర్మమార్గం కాలిబాట, భక్తిమార్గం బండ్లబాట, జ్ఞానమార్గం గాలిబాట(విమానయానం), యోగమార్గం నీటిబాట (ఓడ ప్రయాణం)" అని బాబావారు వివిధ యోగ స్వభావాలను తెలుపుతూ, అన్ని బాటలూ చేరే గమ్యం ఒకటే నన్నారు. ఏ బాటన పోయినా గమ్యం చేరవచ్చుననీ, అందువలన ఒకబాటన పోయినా, అన్ని బాటల గమ్యాన్ని చేరుకోవచ్చునని బోధించారు.

మానవునిలో ఈ మూడు యోగాలు త్రిగుణాలుగా, త్రివేణీ సంగమంగా ఉంటాయని బాబా చెప్పారు. ఈ త్రివేణీ సంగమంలో గంగానది భక్తి యోగం యమునానది కర్మయోగం. అంతర్వాహినిగా, కనపడకుండా ఉండే సరస్వతీ నది జ్ఞానయోగమని చెబుతూ ఈ యోగ త్రయాన్ని విడదీసి చూపడానికి వీలులేదన్నారు బాబా.

మానవుడు కర్మ, భక్తి, జ్ఞానమనేటువంటి త్రిమూర్తి స్వరూపాన్ని ధరించి ఉంటున్నాడు. కనుక త్రిగుణాత్మక స్వరూపుడు మానవుడు.

ఇట్టి త్రిగుణాత్మకమైన మానవత్వం కర్మలద్వారా పవిత్రము కావించి, భక్తి ద్వారా శాంతము నలవరచుకొని, తద్వారా జ్ఞానమనే గమ్యమును చేరడము దీనియొక్క ప్రధానమైన లక్షణము. పవిత్రమైన కర్మల నాచరించటానికి సమాజ సేవలు చేయటానికి ఈ దేహమును అంకితం చేయటమే సరియైన 'సత్కర్మ' అన్నారు బాబా.

భగవాన్ బాబా ఒక పర్యాయం కర్మయే భక్తి. భక్తియే జ్ఞానమంటూ మైసూరుపాకు ఉదాహరణ చెప్పారు. మైసూరుపాకును నోటిలో వేసుకొన్న వెంటనే దాని ఆకారమును తినివేస్తాం, దాని బరువును జీర్ణించుకుంటాం.. దాని మాధుర్యాన్ని ఆస్వాదిస్తాం. ఈ మూడు పనులూ కలసి ఒకేసారి జరిగినవి కదా! ఒక కణమున ఆకారము, ఒక కణమున బరువు, ఒక కణమున మాధుర్యమూ అంటూ విడివిడిగా లేవు. అదే విధముగనే జీవుడు, ఆత్మ, పరమాత్మ వేరు వేరు కాదు. ప్రతి కార్యము సేవామయము, జ్ఞానమయము కావలెను. జీవితము యొక్క విభాగము లన్నింటిలోనూ కర్మ, భక్తి, జ్ఞానములు నిండియుండవలెను. ఇట్టి దానినే 'పురుషోత్తమ యోగము' అందురని బాబా పేర్కొనినారు.

వేదాలలో మొదటి భాగమైన 'సంహిత' కర్మను ప్రబోధిస్తుందిని, రెండవ భాగమైన 'అరణ్యకము' ఉపాసనను (భక్తి) వివరిస్తుందని, మూడవ భాగమైన 'ఉపనిషత్తు' జ్ఞానాన్ని అందిస్తుందని స్వామి ఒక పర్యాయం చెబుతూ ఈ మూడూ వేదాలలో భాగములే కాబట్టి వీటిని విడదీయరాదని స్పష్టం చూస్తూ "కర్మపుష్పం, భక్తి కాయ, జ్ఞానము ఫలము వీటిలో ప్రతిదానిలోను మిగిలిన రెండింటి ప్రతిబింబము స్పష్టంగా కనిపిస్తుంది. ఇవి వేరు వేరు కావు. మోక్ష సాధనకు అవి మెట్లు వంటివి" అని చెప్పారు బాబా.

కర్మ మార్గం రైలులోని మూడవ తరగతి ప్రయాణం (III class) లాంటిదని, భక్తి మార్గం రైలులోని రెండవ తరగతి ప్రయాణం(II class) లాంటిదని, జ్ఞానమార్గం రైలులోని మొదటి తరగతి ప్రయాణం(I class)

లాంటిదని (పూర్వం రైలులో మూడు తరగతులు ఉండేవి) చెబుతూ... ఈ మూడు మార్గముల గమ్యమొక్కటేనని బాబా చెప్పారు. మరొకసారి, ఒక రైలుబండిలోని మామూలు బోగీ(Ordinary Compartment) లో ఎక్కి జంక్షన్‌లో దిగి, మరియొక రైలులోనికి మారి వెళ్లవలసిన ఊరికి వెళ్ళటం కర్మ మార్గంతో పోల్చారు స్వామి. రైలు బండిలో (Direct Compartment)ని సరాసరి వెళ్లే కేరేజి లో కూర్చుంటే చాలు, జంక్షన్‌లో ఆ కంపార్టుమెంటును మరొక రైలుకు తగిలిస్తారు. మనం మాత్రం దిగనవసరంలేదు. చేరుకోవలసిన గమ్యానికి ఎట్టి యిబ్బంది లేకుండా చేరుకుంటాం. దీనిని భక్తి మార్గంతో పోల్చారు స్వామి. సరాసరి వెళ్ళే రైలులో కూర్చుంటే చాలు, ఏ యిబ్బందీ లేకుండా, రైలు మారకుండా చేరుకోవలసిన గమ్యానికి చేరుకొనవచ్చును. దీనిని జ్ఞానమార్గంతో పోల్చారు స్వామి. ఏ విధంగా ప్రయాణం చేసినా చేరుకోవలసిన గమ్యం మాత్రం ఒకటే అంటారు బాబా.

పొయ్యికి పెట్టిన మూడు రాళ్ళను కర్మ, భక్తి, జ్ఞానయోగములుగా పోల్చారు స్వామి. పొయ్యి మీద గిన్నెను పెట్టి, గిన్నెలో నీళ్ళను పోసి, బియ్యం పోసి, గిన్నె క్రింద మంట (అగ్ని)ను పెట్టాలి. అప్పుడే అన్నం ఉడుకుతుంది. గిన్నె భక్తి, నీరు కర్మ, అగ్ని జ్ఞానముతో పోల్చి, అన్నం ఉడికిన తరువాత ప్రేమతో వడ్డించాలని బాబా చెప్పారు. యోగముల సారము సమత్వం. సమత్వమే యోగం. అందువలననే సమత్వం కర్మ, భక్తి, జ్ఞాన యోగముచ్చతే అన్నారు శ్రీ కృష్ణపరమాత్మ.

కనుక కర్మ భక్తి జ్ఞాన మార్గములు వేరు వేరని భావించరాదు. ఇవి త్రిమూర్తులవంటివి. త్రివేణి సంగమం వంటివని గ్రహించాలి. ఈ మూడింటిని విడదీయరాదు. ఈమూడు మార్గముల గమ్యం ఒక్కటే. స్వభావం చేత అవి వేరైనా, పరమార్ధ సాధనంలో గమ్యాన్ని చేరటంలో మూడు ఒక్కటేనని బాబా వారి అభిప్రాయం.

# భక్తి

**కాంక్షతోడ నెందు కర్మంబు లొనరింప**
**దక్కబోదు ఫలం ధరణియందు**
**కాంక్ష వదలి భక్తి కర్మలాచరింప**
**ఫలిత మొసగును పర్తి విభుడు 82**

అన్నారు బాబా. కాంక్షతో, కోరికతో, ఆశతో, స్వార్ధంతో ఏదో ఒక ప్రతిఫలమును ఆశించి కర్మలను చేస్తుంటే ఆశించిన ఫలితం దక్కదు. ఎట్టి ఫలితాన్ని ఆశించకుండా, నిష్కామబుద్ధితో కర్మలనాచరిస్తూ పోతుండాలి. "అనన్యాశ్చిన్తయన్తోమాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం" ఎవరు ఎడతెగక నన్ను చింతించుచూ ధ్యానించుచుందురో, అట్టివారి యొక్క యోగ క్షేమములను మాత్రమే భగవంతుడు చూచుకుంటాడని భగవద్గీత బోధిస్తున్నది. కనుక కోరికలతో కర్మల నాచరించేవారిని గురించి భగవంతుడు పట్టించుకోడు. భగవంతుడు అనన్య భక్తులకే హామీ యిచ్చాడు గాని, ఏ పావుగంటో, అరగంటో భగవంతుని చింతించే Part time Devotees కోసం కాదంటారు బాబా.

ఏ పనీ చేయకుండా సదా భగవంతుని స్మరిస్తూ కూర్చుంటే కడుపు నిండటం ఎట్లా? అనే అనుమానం సహజంగా కలుగుతుంది. "నాలుకమీద భగవన్నామం నాట్యం చేస్తుంటే చేతులతో సత్కర్మల నాచరించండి" అని చెప్పారు బాబా. అంటే ఎవరికి నిర్దేశించబడిన పనులు వారు చేయాలి, ఎవరి Duty ని వారు శ్రద్ధతో నిర్వర్తిస్తుండాలి. "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు మన పెద్దలు. కృషి చేయకుండా ఏ పనినీ సాధించలేం. "మానవుని కార్యసిద్ధికి వ్యక్తి కృషి, దైవ కృప రెండూ

అవసరమే. కృషి, కృప రెండూ నెగిటివ్, పాజిటివ్‌లు" దైవకృప ఉండినప్పటికీ మానవుని కృషి సరీగా లేకుంటే కార్యసిద్ధి జరుగదు. అట్లే మానవ కృషి ఉండినప్పటికీ దైవకృప లేకపోతే ఆశించిన ఫలితం చేకూరదు అని అంటారు బాబా. కనుక ప్రతి వ్యక్తీ శక్తివంచన లేకుండా నిస్వార్థంగా కృషిచేస్తూ, దైవానుగ్రహం కోసం తగిన సాధన చేస్తూ పోతుండాలి. అప్పుడు ఎవరికి, ఎంత, ఎప్పుడు ఫలితమివ్వాలో భగవంతుడే చూచుకుంటాడు. మనం నిమిత్తమాత్రులమే.

**పూవులెన్నొ తెచ్చి పూజలు చేసిన**
**మెచ్చబోడు తాను పుచ్చుకొనడు**
**హృదయకమలమివ్వ సదయుడై గ్రహియించు**
**సత్యసాయి ప్రేమ శాంతిదాయి 83**

ఈ పద్యంలో భగవంతుని అభీష్టము, ఆంతర్యము చక్కగా స్పష్టం చేయబడింది. గుట్టలకొద్దీ పూలు తెచ్చి ఆర్భాటంగా పూజలు చేసినప్పటికినీ మెచ్చబోడు, తాను పుచ్చుకొనడు. దేనిని పుచ్చుకుంటాడు? దేనిని మెచ్చుకుంటాడు? హృదయ పుష్పాలను మాత్రమే మెచ్చుకుంటాడు, పుచ్చుకుంటాడు. మనః పుష్పాదుల చేత ఆరాధించినప్పుడే భగవంతునికి ప్రీతిపాత్రులం కాగలం. ఆ పుష్పములెవ్వి? శ్రీ శంకర భగవత్పాదులవారు శివానందలహరిలో భగవానునికి అత్యంత ప్రీతికరమైన పుష్పములేమిటో వివరించారు.

"అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః
సర్వభూత దయాపుష్పం క్షమాపుష్పం విశేషతః
శాన్తిపుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం తథైవచ
సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్"

అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి తపస్సు, ధ్యానము, సత్యము - అను ఎనిమిది పుష్పములు విష్ణు

భగవానునికి చాలా ప్రీతికరమైనవి. ఈ ఎనిమిది సద్గుణ రూప మనః పుష్పములతో భగవంతుని ఆరాధించడం చేతగాక, బాహ్య పుష్పాదులతో మాత్రమే ఆర్భాటంగా పూజలు చేస్తున్నారు ఈనాటి భక్తులు. "సర్వ భూతదయాపుష్పం" అనే దానిలో ఉండిన అంతరార్థమును ప్రతి ఒక్కరూ గుర్తించాలి. ఈ అష్ట పుష్పములలో దయాపుష్పమునే భగవంతుడు ఎక్కువగా మెచ్చుకుంటాడు, పుచ్చుకుంటాడు. ఎంతటి విద్యావంతుడైనప్పటికినీ, ఎంతటి శక్తి సామర్థ్యములు కలిగినవాడైనప్పటికినీ 'భూతదయ' లేకుండిన వాని సర్వస్వమూ శూన్యమవుతుంది. భూతదయ మానవునికి ప్రధానమయిన సద్గుణమని చెబుతూ 'దయగల హృదయమే దైవమందిరం' అన్నారు బాబా.

ఈ దయను యే రీతిగా ప్రకటించాలి? ఇది అభ్యాసంతో లభించేది కాదు. హృదయాన్ని పరివర్తన చేసుకోవాలి. అందరి యందుండిన దైవత్వము ఒక్కటేననే సత్యమును గాఢంగా విశ్వసించాలి. అప్పుడే తన దుఃఖమును తాను అనుభవించినట్లుగా తన ప్రతిబింబమును తాను చూచినట్లుగా; పరుల దుఃఖమును, పరుల బాధను తాను గుర్తించుతాడంటారు బాబా. బాహ్య పుష్పములను భగవంతుడు మెచ్చుకోడు, పుచ్చుకోడు. గనుక హృదయ పుష్పములను సమర్పించుకోవటానికి సంసిద్ధం కావాలి. నిర్మలము, నిశ్చలము నిస్వార్థమైన హృదయ కమలమును అర్పించినప్పుడే ఈ జన్మ సార్థకమవుతుంది

**కష్టసుఖములు నొకరీతి గాంచవలయు**
**కలిమిలేములు విడదీసి గడుపరాదు**
**కీర్తి అపకీర్తులను నొక మూర్తిగానె**
**భావమందుంచి మెలుగుటే భక్తిపథము** 84

అన్నారు బాబా. ఈ పద్యములో మూడు జంట పదములున్నాయి. 1. కష్టసుఖములు 2. కలిమిలేములు 3. కీర్తిఅపకీర్తులు. వీటిని విడదీసి

ఆలోచించరాదు. కష్టం తరువాత సుఖం; సుఖం తరువాత కష్టం. ఒకటి తరువాత ఒకటి వస్తుంటుంది, పోతుంటుంది. అదేవిధంగా కలిమి (సంపద) తరువాత లేమి (దరిద్రము); లేమి తరువాత కలిమి ఇది కూడా అంతే ఒకటి తరువాత ఒకటి వస్తుంటుంది, పోతుంటుంది. అదే రీతిగా కీర్తి తరువాత అపకీర్తి, అపకీర్తి తరువాత కీర్తి. ఇదికూడా అంతే ఒకటి తరువాత ఒకటి వస్తుంటుంది, పోతుంటుంది.

మానవజీవితం అనేక కష్టింపులతో కూడుకొని ఉంటుంది. జీవితంలో అనేక వేదనలను అనుభవించవలసి వస్తుంది. కష్టాలను ఎదుర్కొనవలసి వస్తుంది, బాధలకు గురికావాల్సి వస్తుంది. అభాండాలను మోయవలసి వస్తుంది. అపనిందలకు గురికావలసి వస్తుంది. అపకీర్తిని పొందవలసి వస్తుంది. ఒక్కొక్కసమయంలో వాటిని గురించి బహిరంగంగా చెప్పుకోవటానికి కూడా ఎవరూ లభించకపోవచ్చును. మన మనస్సులలో చెలరేగుతున్న వేదనలు, ఆవేదనలలో పాలు పంచుకొనే ఆత్మీయులు కూడా దగ్గర లేకుండా దూరమైపోవచ్చును. అప్పుడు ఏకాకిగా పయనించవలసి వస్తుంది.

'చేదు'ను చవిచూచినప్పుడే 'తీపి' మాధుర్యం అర్థమవుతుంది. అదేవిధముగా కష్టాలను చవిచూచినప్పుడే 'సుఖం' యొక్క గొప్పతనం బోధపడుతుంది. ఎల్లప్పుడూ 'తీపి'నే తినమంటే మొహం మొత్తి వెగటుతో వాంతి చేసుకుంటారు. తినగా తినగా గారెలు కూడా చేదుగానే అనిపిస్తాయి. అదేవిధంగా కలిమిలేములు కావడికుండలు ఎల్లప్పుడూ భోగభాగ్యములనే అనుభవిస్తూ 'లేమి' అంటే ఏమిటో ఏమాత్రం చవిచూడకుండా రాజభోగ లాంఛనములతో జీవితాన్ని గడపటం కూడా కష్టమే అనిపిస్తుంది. అతిమాధుర్యమైన, ఇష్టమైన పదార్థములను ఆరగించమని బంగారు పంజరంలో పెట్టి, రామచిలుకను దానిలో పెడితే ఎప్పుడు బయటపడదామా అని ఆలోచిస్తుంది ఆ రామచిలుక. కారణం అది తిండికన్నా స్వేచ్ఛనే కోరుకుంటుంది. కీర్తి అపకీర్తులు కూడా

అటువంటివే. కనుక కష్టముల ననుభవించినప్పుడే సుఖముయొక్క విలువ బోధపడుతుంది. లేమిని పొందినప్పుడే కలిమి యొక్క ప్రాముఖ్యత అర్థమవుతుంది. అపకీర్తిని అనుభవించినప్పుడే 'కీర్తి' యొక్క గొప్పతనం తెలుస్తుంది. *"సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభే జయాజయౌ"* సుఖదుఃఖములందును, లాభనష్టములందును, జయాపజయములందును సమబుద్ధిని కలిగి కర్మలనాచరించవలయునని 'భగవద్గీత' బోధిస్తున్నది. కనుక సుఖము తటస్థించినప్పుడు, కలిమి కలిగినపుడు, కీర్తి వచ్చినప్పుడు పొంగిపోయి గర్వించక; కష్టము వచ్చినప్పుడు లేమి సంభవించినప్పుడు, అపకీర్తి పొందినప్పుడు కృంగక, విచారపడక సమస్థితిని (Balance of Mind) కాపాడుకొనవలెను. *"సమ దుఃఖ సుఖం ధీరమ్"* సుఖ దుఃఖములందు సమభావముతో వీక్షించువాడే ధీరుడు. అట్టి ధీరుడే మోక్షమునకర్హుడగును. కనుక కష్టసుఖములందు కలిమిలేములందు; కీర్తి అపకీర్తులందు సమభావముతో, సమదృష్టితో మెలుగుటే భక్తుని ఏకైక మార్గము.

**తామసంబు విడక తత్వంబు కనరాదు**
**రాజసంబు విడక రాదు భక్తి**
**సాత్వికంబె భక్తి సాధనం బగునయా**
**ఉన్నమాట తెలుపుచున్నమాట 85**

భగవాన్ బాబావారు ఈ పద్యంలో సత్వరజస్తమో గుణములను గురించి చెప్పారు. మానవుడు సత్వగుణము నందున్నాడా? రజోగుణము నందున్నాడా? లేక తమోగుణమునందున్నాడా? అనే విచారణ వచ్చినప్పుడు దానికి అతని ప్రవర్తనే ప్రత్యక్ష నిదర్శనము.

మానవునిలో తమోగుణం ప్రబలుతే మత్తు , సోమరితనం, బుద్ధి మాంద్యం, అజాగ్రత్త మొదలగు అవలక్షణాలు పెరుగుతాయి.

తనయందున్న దోషములను గుర్తించటానికి ఏ మాత్రం ప్రయత్నించడు. రజోగుణము ప్రకోపించినప్పుడు అశాంతి, ఇంద్రియలోలత్వము, మితిమీరిన ఆశలు, లోభత్వం మొదలగునవి పుట్టుకొనివస్తాయి. తన యందున్న దోషములను గుర్తించి కూడను, వాటిని మార్చుకొనక, అదియే సత్యమని భావించి, తిరిగి అట్లే ప్రవర్తిస్తుంటాడు. సత్వ గుణము నిర్మలమైనది అగుట వలన జ్ఞానము కలుగజేయునదియు, ఉపద్రవము లేనిదియు అగుచున్నది. తన దోషములను గుర్తెరిగి, వాటిని మార్చుకొని, పవిత్రమైన మార్గంలో ప్రవేశిస్తాడు.

సాత్వికమైన కర్మమునకు 'నిర్మలత్వం' ఫలమనియు, రజోగుణ సంబంధమైన కర్మమునకు 'దుఃఖము' ఫలమనియు, తమోగుణ సంబంధమైన కర్మమునకు 'అజ్ఞానము' ఫలమనియు భగవద్గీత బోధిస్తున్నది. విభీషణుడు సత్వగుణమునకు, రావణుడు రజోగుణమునకు, కుంభకర్ణుడు తమోగుణమునకు ప్రతీకములని భగవాన్ బాబా పేర్కొనినారు.

*"సాత్వికగుణము బంగారు గొలుసువంటిది. రజోగుణము రాగి గొలుసు వంటిది. తమోగుణము ఇనుప గొలుసు వంటిది. గొలుసులు వేరు వేరు. వాటి విలువలు కూడా వేర్వేరు. కాని బంధన మాత్రం ఒక్కటే. కనుక సాత్విక బంధమును కూడా తీసివేయాలి"* అన్నారు బాబా.

రత్నాకరుడనే బోయవాడు ఒకప్పుడు గజదొంగ. తరువాత జ్ఞానోదయమై, తన తామసిక జీవితానికి స్వస్తి చెప్పి, తమస్సును విడిచి తపస్సును చేబట్టి మహర్షి వాల్మీకిగా ప్రసిద్ధి గాంచాడు. రజోగుణం ప్రకోపించడం వలన తపశ్శక్తి సంపన్నుడైన విశ్వామిత్రుడు అనేక అవమానాలకు లోనై, కట్టకడపటికి అహంకారమును వీడి 'బ్రహ్మర్షి' అనిపించుకున్నాడు. సాత్వికుడు, నిగర్వి అయిన వశిష్ట మహర్షి, తనపై

అసూయాద్వేషం పూనిన విశ్వామిత్రుని యెడల కూడా సహనమును చూపించి, అతనిలో పరివర్తన తీసుకొని రాగలిగిన సహనశీలిగా పేరు తెచ్చుకున్నాడు. కనుక మానవుడు అభ్యాసంతో, కృషితో తనలో జీర్ణించుకు పోయిన తమోరజో గుణాలను క్రమక్రమంగా దూరం చేసుకొని సత్వగుణ సంపన్నుడు కావచ్చును. అదే ఆధ్యాత్మిక దివ్యసాధన. భక్తికి అదే రాజమార్గం.

*"మొట్టమొదట మనలో నున్న తామసమును దూరం చేయాలి. కేవలం తిండి తీర్థాదులకై వచ్చినదా ఈ కాయం? కాదు....కాదు..... ఆహార నిద్రా భయమైథునాదులతో ఉండేది పశుత్వం. దీనికి అతీతమైన గుణం మరొకటి ఉంది. అదే విచక్షణా శక్తి. దివ్యమైన శక్తి జ్ఞానం. తమస్సు పోకుండా పవిత్రమైన జ్ఞానం లభ్యం కాదు. తమస్సు పోయిన తరువాత రాజసికము వుంటుంది. దానిని కూడా దూరం చేయాలి. అప్పుడే సాత్వికం ఆవిర్భవిస్తుంది. ఇది ఆవిర్భవించినప్పుడే తేజోమయమైన దివ్యత్వం కనిపిస్తుంది"* అంటారు బాబా.

ఒక పర్యాయం కొబ్బరికాయ కొట్టటం గురించి భగవాన్ బాబా చక్కగా వివరించారు. అభిమాన మమకారములనే పీచును మొట్టమొదట తీసివేయాలి. అదే తమోగుణం. తరువాత పైన వున్న అహంకారమను గట్టి పెంకును పగులగొట్టాలి. అదే రజోగుణం. అప్పుడు నిర్మల, నిశ్చల, నిస్వార్థమనే తెలుపు (కొబ్బరి) మనకు చిక్కుతుంది. అదే సాత్విక గుణం. కొబ్బరికాయను ఏ విధంగా బ్రద్దలు చేస్తామో, ఆ విధంగా మన హృదయమును బ్రద్దలు చేయాలి. అంటే మర్మం లేకుండా సర్వమూ అర్పితం చేయాలంటారు బాబా. అదే నిజమైన సాధన. అదే నిజమైన భక్తి.

# రక్తి - విరక్తి

కోరు కోరికలన్నియు తీరుచున్న
భక్తి దైవము పై హెచ్చు రక్తి హెచ్చు
కోరు కోరికలన్నియు తీరకున్న
భక్తి తరుగుచు దైవ విరక్తి పెరుగు. 86

భగవాన్ బాబావారు ఈ పద్యంలో భక్తుల మానసిక ప్రవృత్తిని చక్కగా వర్ణించారు. తాము కోరిన కోరికలన్నీ నెరవేరుతుంటే భగవంతుని మీద భక్తి పెరుగుతుంటుంది. రక్తి హెచ్చుతుంటుంది. ఏదైనా కోరిక గనుక నెరవేరకపోతే భగవంతుని మీద భక్తి తగ్గిపోతుంది. విరక్తి పెరిగిపోతుంది. ఇది ఈనాడు భక్తులు అనబడే వారిలో చాలామందిలో కనిపిస్తుంది. ఇది నిజమైన భక్తుల లక్షణం మాత్రం కాదు.

భక్తి అంటే పూజామందిరాలలో, దేవాలయాలలో దేవతా మూర్తులకు పూజలు చేయటమే కాదు, కీర్తనలు పాడటమే కాదు. దివ్యాత్ముని మీద పరమ ప్రేమను పెంచుకోవటం. భక్తి అనగా పరిపూర్ణ ప్రేమ. భక్తికి ప్రేమకు అవినాభావసంబంధముంది. ముక్తికి సాధన భక్తి, భక్తికి కారణం ప్రేమ. ప్రేమ లక్ష్యం త్యాగం. ప్రేమ ఎన్నడూ ఎవర్నీ ఏమీ అడుగదు. ప్రేమ బిచ్చమెత్తదు. దేవునియందు చూపే ప్రేమ పూజ్య భావముతో కూడి ఉంటుంది. కనుక భక్తి లక్ష్యం "నాకు అది కావాలి! ఇది కావాలి!" అని యాచించటం కాదు. బిచ్చమెత్తటం భక్తి లక్షణం అంతకన్నా కాదు. ఎట్టి ఫలితాన్ని ఆశించకుండా భగవంతుని ప్రీతితో ఆరాధించే సాధననే అనన్యమైన 'భక్తి' అంటారు.

ఒకప్పుడు ఒక భారత చక్రవర్తి వేటకు వెళ్ళుతాడు. అక్కడ అడవిలో ఒక సన్యాసిని చూచి తన రాజధానికి వచ్చి ఆతిథ్యమును

స్వీకరించమని ఎంతో వినయంగా వేడుకొనగా, ఆ సన్యాసి మన్నించి, రాజధానికి వస్తాడు. ఆ చక్రవర్తి స్నానం చేసి పూజా గృహమునకు వెళ్ళుతూ ఆ సన్యాసితో "పూజ ముగించిన తక్షణమే ప్రసాదమును సమర్పించు కుంటాను" అని చెప్పి పూజ మొదలు పెడుతాడు. ఆ సన్యాసి అక్కడనే కూర్చొని చక్రవర్తి చేసే పూజా విధానమును శ్రద్ధగా పరికిస్తుంటాడు. అప్పుడు ఆ చక్రవర్తి "ప్రభువా! నా ఐశ్వర్యమును అధికము చేయుము. భూసంపదను ఎక్కువ చేయుము. మంచి ఆరోగ్యమును ప్రసాదించి సంతానాభివృద్ధి కలుగునట్లు వరమొసగుము" అని దైవమును ప్రార్థించుచుండగా, ఆ సన్యాసి లేచి వెళ్ళిపోవటానికి సన్నద్ధుడవుతుండగా ఆ చక్రవర్తి చూచి "స్వామీ ! ప్రసాదమును ఆరగించకుండా వెళ్ళి పోతున్నారేమి ?" అని ప్రశ్నించుతాడు. అప్పుడు ఆ యోగి *'నేను బిచ్చగాండ్ర వద్ద బిచ్చమెత్తను. అది కావాలి! ఇది కావాలి! అని బిచ్చమెత్తే నీవు నాకేమి యివ్వగలవు ? ముందు నీ కోరికలు తీర్చుకో !"* అని పలికి ఆ యోగి నిష్క్రమిస్తాడు. మనకు ఈ కథవలన ఒక నీతి అర్థమవుతున్నది. భక్తి లక్షణం సమర్పించటమే కాని యాచించటం కాదు. యాచించే భక్తి, ఫలితాన్ని ఆశించే భక్తి, అసలు భక్తి కానేకాదు.

*"భగవంతుని ప్రార్థించటం అంటే యాచించటం కాదు. ప్రార్థన అంటే మాటల పరిశ్రమ కాదు. హృదయములోని దివ్యత్వమును మేలుకొలిపేందుకు పడే తపన"* అంటారు బాబా. అయితే ఈనాడు ప్రార్థన పేరుతో, భక్తి అనే ముసుగులో *"నాకది కావాలి! ఇది కావాలి! అనుగ్రహించు స్వామీ!"* అని యాచించటం పరిపాటి అయింది. యాచించునది నెరవేరకపోతే భగవంతుణ్ణి విమర్శించడానికి కూడా ఏమాత్రం వెనుకాడటం లేదు. యాచించటం అడుక్కునే లక్షణం. భక్తులు భగవంతుని యాచించరాదు. ఆర్తితో పిలిచినప్పుడు ఆయనే తప్పకుండా పలుకుతాడు. అదే నిజమైన తపన. హృదయం పడే ఆవేదన అంటే అదే. అయితే ఈనాడు కోరికలను తీర్చుకునేందుకు భగవంతునికి కొబ్బరికాయలు కొడుతున్నారు.

హుండీలలో ముడుపులు వేస్తున్నారు. ఘనంగా, అట్టహాసంగా కళ్యాణాలు చేస్తున్నారు. "కోరికలు తీరుతే దైవము, తీరకపోతే దెయ్యం" అని భావిస్తున్నారు. ఇది కాదు నిజమైన భక్తి. ఎట్టి సత్కర్మల నాచరించిన, ఏరీతిగ మెలిగిన భగవంతుడు సంతుష్టుడు కాగలడో యోచించి, విచారించి, తదనుగుణంగా వర్తించుటే నిజమైన భక్తి లక్షణం. అట్టి స్థితిలో కోరికలనేవి ఉండవు, కోరాలనే కోరిక కూడా ఉండదు. అట్టిదే సంపూర్ణమైన సమర్పణాస్థితి అంటారు. అప్పుడు భక్తుని యోగక్షేమాలను భగవంతుడే చూచుకుంటాడు. అప్పుడు రక్తికిగాని, విరక్తికిగాని స్థానమే ఉండదు. "సమత్వం యోగ ముచ్యతే" అన్నారు గదా !

## విశ్వచింతన - విష్ణుచింతన

**విశ్వచింతన చేయు విజ్ఞాన జీవుడు**
**విష్ణుచింత చేయు విబుధవరుడు**
**ఒకడు విశ్వమునొందు నొకడు విష్ణువు బొందు**
**సకల శ్రుతుల యూట సాయి మాట. 87**

ఈనాడు సైంటిస్టులు విశ్వచింతన చేస్తూ, సృష్టిని పరిశీలిస్తూ, పరిశోధన చేస్తుంటే సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు (Saints) మాత్రం విష్ణు చింతన చేస్తూ, సృష్టికర్తను పరిశీలిస్తూ, దివ్యత్వానికి చేరువ కావాలని సాధనలు చేస్తున్నారు. అయితే ఈనాడు సైంటిస్టులు చాలా విషయాలను పరిశోధన చేస్తున్నారు, పరిశీలిస్తున్నారు, క్రొత్త విషయాలను కనుగొంటున్నారు. కానీ వివేకాన్ని మాత్రం విస్మరిస్తున్నారు. మానవుని యందున్న దివ్యశక్తిని తెలుసుకోలేకపోతున్నారు. వివేకంలేని విజ్ఞానం వలన దేశానికి ప్రమాదం. ప్రతి విషయాన్ని శ్రద్ధగా పరిశీలన చేసి, పరిశోధన చేయాలి. పరిశోధన ద్వారా లభ్యమైన విజ్ఞానాన్ని వివేకంతో ప్రపంచాభివృద్ధికి వినియోగించాలి.

"దైవీశక్తి ఇట్టిదీ, అట్టిదీ అని ఎవరూ చెప్పలేరు. విజ్ఞానమునకు, ఆధ్యాత్మికమునకు ప్రధానమైన బేధమేమిటంటే, బాహ్యమైన జగత్తును Science పరిశీలన చేస్తుంది. అంతఃసంబంధమైన దివ్యతత్త్వాన్ని ఆధ్యాత్మికము పరిశీలన చేస్తుంది. బహిర్ దృష్టి కలవాడు Scientist,. అంతర్ దృష్టి కలవాడు Saint. వీరిద్దరికీ ఎంతో తేడా ఉన్నది. సృష్టిని పరిశీలన చేసేవాడు Scientist, సృష్టికర్తను పరిశీలించేవాడు Saint. సైంటిస్టు సృష్టిని మాత్రమే పరిశీలన చేస్తున్నాడు. కానీ సృష్టికర్తను పరిశీలిస్తే సృష్టి అంతా బాగా అర్థమవుతుందంటారు బాబా.

సైన్సు వేరు, ఆధ్యాత్మికము వేరు అని విభజించరాదు. విజ్ఞానానికి ఆధ్యాత్మిక ప్రజ్ఞానాన్ని జోడించాలి. ఈ రెండూ చేరినప్పుడే ఆనందం లభిస్తుంది. ఈ రెంటినీ సమన్వయ పరచాలి. ఈనాడు విజ్ఞానం పెరిగి పోయిందని మనం విఱ్ఱవీగుతున్నాము కానీ, విజ్ఞానంతో పాటు అజ్ఞానం అంతకంటే పెరిగిపోతున్నది." అని బాబా తన ఆవేదనను వెలిబుచ్చారు. కారణమేమిటి? సైన్సుకు జీవిత సామర్థ్యాన్ని పెంచే స్తోమత, అధికారం లేదు. జీవిత సమగ్రతను పోషించే అధికారం ఒక్క ఆధ్యాత్మికతకు మాత్రమే ఉన్నది. మానవతా విలువలు ఒక్క ఆధ్యాత్మికత్వంతో జోడించినప్పుడే అభివృద్ధి కాగలవు. కేవలం సైన్సుతో ముడిపడితే ఏమాత్రం అభివృద్ధి కావంటారు బాబా. విత్తనాన్ని భూమిలో పెడితే మొక్క మొలుస్తుంది, డబ్బాలో పెట్టి నీళ్ళు పోస్తే కుళ్ళి పోతుంది. మానవతావిలువలు పెరగటానికి ఆధ్యాత్మికత్వమనే సైన్సు చాలా అవసరం. కనుక మొట్టమొదట ఆధ్యాత్మిక భావాలను అభివృద్ధి గావించు కోవాలంటారు బాబా.

కనుక కేవలం విశ్వచింతన చేసినందువలన ప్రయోజనం లేదు. విష్ణు చింతన చేసినప్పుడు మాత్రమే సర్వమునూ తెలిసికొనిన వారమవుతాం. కనుక ఈ సృష్టి స్థితి లయ కారకుడైన దైవమును తెలుసుకుంటే సమస్తమునూ తెలిసికొనినవారమవుతాం. ఇదే సకల శ్రుతుల సారాంశం.

# నామస్మరణ

ఋణము కంటెను నరునకు రోగమేది
ధరణి నపకీర్తి కంటెను మరణమేది
సర్వదా కీర్తి కంటెను సంపదేది
స్మరణ కంటెను మించు నాభరణమేది 88

అన్నారు బాబా. ఈ లోకంలో మానవునికి ఋణబాధకు మించిన బాధ వేరొకటి లేదు. బాధలు, వ్యధలు వలన చిట్టచివరికి మానవుడు రోగగ్రస్తుడవుతాడు. ఈలోకంలో నిజమైన అదృష్ట వంతుడెవరు? అంటే అప్పులేనివాడే అదృష్టవంతుడు. నిల్వలేకపోయినా, అప్పులేకుండా ఉంటే హాయిగా, ప్రశాంతంగా జీవితాన్ని గడుపవచ్చును. అందువలననే బాబావారు మానవునకు ఋణము కంటె మించిన రోగము వేరొకటి లేదన్నారు. అందరి అనుభవంలో కూడా ఇది యదార్థం.

ఇకపోతే రెండవది అపకీర్తి. మానవుడు దేనినైనా తట్టుకుంటాడు గాని అపకీర్తికి మాత్రం తట్టుకోలేడు. తినటానికి తిండిలేకపోయినా ఓర్పుతో సహించి జీవితాన్ని గడుపుతాడు గాని, మానం గల మానవుడు అవమానమును మాత్రం సహించలేడు, భరించలేడు. అపకీర్తికి తట్టుకోలేడు.

ఇకపోతే మూడవది కీర్తి. మానవుడు సహజంగా కీర్తి ప్రతిష్ఠలను కోరుకుంటాడు. కీర్తిప్రతిష్టల కోసం ఎంతైనా డబ్బును ఖర్చు చేస్తాడు.పది మందిలో గౌరవ మర్యాదలతో జీవించాలని ఆశిస్తాడు. లోభి (Miser) మాత్రం డబ్బుకు ప్రాధాన్యత నిస్తాడు. అభిమానం గల మనిషి మాత్రం కీర్తి ప్రతిష్ఠలకు ప్రాధాన్యతనిస్తాడు.

ఇకపోతే నాల్గవది సరణ. స్మరణ అంటే నామస్మరణ. నామ స్మరణకు మించిన ఆభరణం వేరొకటి లేదంటారు బాబా. నామస్మరణ

చాలా పవిత్రమైనది. దివ్యమైనది. భగవన్నామ స్మరణతో విషం కూడా అమృతంగా మారిపోతుంది. ఇందుకు ప్రత్యక్ష సాక్షి మీరాబాయి. విషమయమైన పాలు త్రాగుతూ 'కృష్ణా!' అని నామస్మరణ చేయగా గావించుతే ఎంతటి అసాధ్యమైన పనినైనా సాధించవచ్చును.

*"భగవన్నామమే భవసాగరమును దాటించే నావ"* అంటారు బాబా. భగవాన్ బాబావారు భజనలకు, నామస్మరణకు అత్యంత ప్రాధాన్యతనిస్తారు. ఎందువలనంటే దీనివలన సమాజ దృష్టి పెంపొందుతుంది. సమిష్టి దృక్పథం అభివృద్ధి గాంచుతుంది. భగవంతుడు మనకు చేతుల నిచ్చింది పవిత్రకర్మల నాచరించడానికి. నోరు నిచ్చింది భగవన్నామ స్మరణ చేయటానికి. కనుక చేతిని నోటిని సద్వినియోగం చేయాలంటారు బాబా.

*"నామస్మరణతో నాలుక పవిత్రమతుంది. నామానికి అనంతశక్తి ఉన్నది. భగవంతుని గుణగణములను వర్ణించుట కంటే లీలలను గానం చేయటం కంటే తత్వములను, భావములను కీర్తించుట కంటే, నామమును ఉచ్ఛరించటమే పవిత్రమైనది. ఒకే నామము అందరూ ఒకేసారి ఉచ్ఛరించినప్పుడు, దైవత్వమనే ప్రకాశము అందరి యందూ వెలుగుతుంది".* అని చెబుతూ బాబా నామ స్మరణ ప్రభావం చేత పరివర్తన చెందిన వారి కొన్ని ఉదాహరణలు పేర్కొనినారు. నామస్మరణ చేతనే బోయవాడు వాల్మీకి మహర్షిగా రూపొందాడు. నిరంతరం నామస్మరణ చేత ప్రహ్లాదుని రూపం తేజోమయంగా మారిపోతుంది. నామస్మరణ కేవలం తాత్కాలిక ఆనందమునే కాక శాశ్వతమైన, సత్యమైన, నిత్యమైన నిరంతరానందమును చేకూరుస్తుందంటారు బాబా. కృతయుగంలో ధ్రువ ప్రహ్లాదులు; త్రేతాయుగంలో హనుమంతుడు; ద్వాపర యుగంలో గోపికలు; కలియుగంలో కబీరు, తులసీదాసు, రామదాసు, త్యాగరాజు మొదలైనవారు నామస్మరణ చేసి తరించారు.

"కలే స్మరణాన్ముక్తి" ముఖ్యంగా కలియుగంలో నామస్మరణయే ముక్తి దాయకమనే విషయమును విస్మరించరాదు.

# దైవబలం

**భుజబలంబు, మంచి బుద్ధి బలంబుండి**
**దైవ బలము లేక దాసుడగును**
**కర్ణుడంతటి వాడు కడపటికేమయ్యె**
**మరచిపోకుడిట్టి మంచిమాట. 89**

కర్ణుడు మహా బలశాలి, మహాబుద్ధిమంతుడు, మహాశక్తి సంపన్నుడు. దుర్మార్గులైన దుర్యోధన దుశ్శాసనుల సహవాసము చేత, దైవాన్ని విస్మరించి, దుస్సంగాన్ని విశ్వసించి, దుష్టచతుష్టయంలో ఒకడైపోయినాడు. దైవమును దూరం గావించుకున్నాడు. భుజబలం, ధనబలం, అధికారబలం ఇటువంటి భౌతిక బలాలు ఎన్ని ఉన్నప్పటికీ ప్రయోజనం లేదు. దైవబలం ఒక్కటి ఉంటే చాలు. సర్వ బలాలు వచ్చి చేరుతాయి. దైవబలం లేకపోవటం వలననే కర్ణుడంతటివాడు కట్టకడపటికి దుష్టచతుష్టయంతో సర్వనాశనమైనాడు.

మనిషి చెడిపోవటానికి, దుర్మార్గుడవటానికి దుస్సంగమమే ప్రధాన కారణము. నీవు ఎలాంటివాడివో చెప్పాలంటే, నీ చుట్టూ ఉండే పరిసరాలు, నీ చుట్టూ ఉండే సంఘం, నీ చుట్టూ ఉండే స్నేహితులు ఎటువంటివారో తెలుసుకుంటే నిన్ను గురించి కూడా చెప్పవచ్చును. కనుకనే ఐన్‌స్టీన్ చెప్పాడు "Tell me your company, I shall tell you what you are" కనుక మనయొక్క మంచి చెడ్డలు మన చుట్టూ ఉండే వాతావరణం పరిసరాల మీదనే ఆధారపడి ఉంటుంది.

ముఖ్యంగా ఈనాటి విద్యార్థులు దుష్టబలములను పెంచుకుంటున్నారు, దురాలోచనలలో మునుగుచున్నారు. దుష్ప్రవర్తనలతో సంచరిస్తున్నారు. ఇది కాదు మానవుని యొక్క వికాసం. ఇది కాదు మానవుని యొక్క ప్రకాశం. ఇది కాదు మానవుని యొక్క విశిష్టత. దివ్యత్వాన్ని పెంచుకొనే స్థితికి మానవుడు అభివృద్ధి కావాలంటారు బాబా.

కేవలం భుజబలం, ధనబలం చూచుకొని విర్రవీగకుండా, దైవబలం కోసం కూడా సాధనలు సలపాలి. అంతేకాదు దుష్టులకు, దుర్మార్గులకు ఎంత దూరంగా ఉంటే అంత మంచిదనే విషయాన్ని మరచిపోరాదు.

# దేహమే దేవాలయము

దేవుడనగ వేరు దేశయందున లేడు
దేవుడుండు తనదు దేహమందె
పాపమనగ వేరు పరదేశమున లేదు
తాను చేయు పనులల తగిలియుండు 90

అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. భగవంతునికి అంటూ ఒక ప్రత్యేకమైన స్థలం లేదు, భగవంతుడు లేనిచోటు కూడా లేదు. సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడు దేవుడనేవాడు స్వర్గంలోనో, వైకుంఠంలోనో మాత్రమే ఉండడు. ఎక్కడపడితే అక్కడనే ఉన్నాడు. ప్రతి జీవిలో వున్నాడు, ప్రతిచోటా ఉన్నాడు. ప్రతి వ్యక్తిలో ఉన్నాడు. ఈ విషయమును గురించి అనాదికాలం నుంచి విచారణ జరుగుతునే ఉన్నది.

"నీ హరి ఈ స్థంభంలో ఉన్నాడా?" అని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని అడిగితే "ఇందుగలడందు లేడను సందేహము వలదు, చక్రి

సర్వోపగంతుండెందెందు వెదకి చూచిన, అందందే కలడు" అని సమాధానం చెప్పడంతోనే నృశింహస్వామి ప్రత్యక్షం కాలేదా? కనుక భగవంతుడు సర్వవ్యాపకుడు అనే విషయం స్పష్టమవుతున్నది.

భగవాన్ బాబావారు, దేవుడనేవాడు వేరే దేశంలో ఎక్కడనో లేడంటూ "దేవుడుండు తనదు దేహమందే" అని స్పష్టం చేశారు. "వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అన్నారు మన మహర్షులు. అజ్ఞానమనే అంధకారమునకు ఆవలనున్నటువంటి తేజోవంతమైన, ప్రకాశవంతమైన మహా పురుషుని, మహాదివ్యశక్తిని కనుగొన్నామని మహాత్ములు చాటారు, ఎక్కడనో బయట ప్రదేశంలో కాదు, మాలోపలనే, అంతరాత్మయందే మా దివ్యభావములందే, ఈ శరీరమునందే గుర్తించామని చెప్పారు.

భగవంతుడు శరీరమునందు నివసించేవాడు కనుక "శరీరి" అని, దేహమునందు నివసించేవాడు కనుక "దేహి" అని;దేహమనే క్షేత్రమునందు నివాసము చేసేవాడు కనుక "క్షేత్రజ్ఞుడు" అని ఇతనికి పేర్లు. కనుక "మృణ్మయమైన శరీరమునందే చిన్మయమూర్తిని దర్శించాలి" అని అంటారు బాబా. "అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా" అన్నారు మహర్షులు. అంతరాత్మయందు దైవము అంగుష్ఠమాత్రుడై ఉంటున్నాడు.

"దేహో దేవాలయప్రోక్తో జీవో దే స్సనాతనః" దేహమే దేవాలయం. అది దైవం యొక్క మందిరం. కనుక దైవమునకు నివాసమైన ఈ దేహమును అలక్ష్యం చేయటంగాని, అపవిత్రం చేయటంగాని, మలినం చేయటంగాని చేయరాదు. ఈ దేహంతో పవిత్రమైన కర్మలనే ఆచరించాలి. ఈ దేహము జడమైనప్పటికినీ దేహములో నివసించే శక్తి మాత్రం చైతన్యమైనటువంటిది. ఇది భవసాగరమును దాటించే నావ. ఈ మానవ జన్మ అంత సులభంగా లభించేటటువంటిది కాదు. అనేక జన్మల పుణ్యఫలం. అందువననే

"జంతూనాం నరజన్మ దుర్లభం" అన్నారు. కనుక పవిత్రమైన కర్మల నాచరిస్తు ఈ మానవ జన్మను సార్ధకం గావించుకోవాలి. ఈ దేహమును ఆధారము చేసుకొని 'దేహి' ని చూడటానికి ప్రయత్నించాలంటారు బాబా.

నరకమనేది ఎక్కడనో లేదు, స్వర్గమనేది వేరొక లోకం కాదు. పాపం చేస్తే మరణించిన తరువాత నరకానికి పోతాడని, పుణ్యం చేస్తే స్వర్గానికి వెళ్ళుతాడని మనం భావిస్తుంటాము. ఇది పొరపాటు. అన్నీ యిక్కడనే ఉన్నాయి. ఎప్పుడో, ఎక్కడోకాదు అనుభవించేది. నరకం అనుభవించేది యిప్పుడు కాదు గదాయని, ఎప్పుడో చచ్చిన తరువాత గదాయని చేయరాని పాపాలు చేస్తూ చేతులనిండా సంపాదిస్తుంటారు. పాపపుణ్యాలు సదా మనల్ని వెన్నంటే ఉంటాయి. కనుక మనం అనుక్షణం జాగరూకతతో ప్రవర్తిస్తుండాలి. సత్కర్మలను మాత్రమే ఆచరిస్తుండాలి. సమస్త ప్రాణులు భగవత్ స్వరూపులే గనుక ఏ ప్రాణికి అపకారము తలబెట్టరాదు, హింసించరాదు, సమస్త ప్రాణికోటి యెడల దయ, ప్రేమ, కరుణలు కలిగి ఉండాలి. సర్వభూతదయ పరమోత్కృష్టమైన ధర్మం. దేవాలయమునకు వెళ్ళి ఎవరూ అపచారం చేయటానికి సాహసించరు గదా! అదే విధంగా అసలు దేవునికి స్థానమైన ఈ దేహంతో అపవిత్రమైన కర్మల నాచరించడం భావ్యమా? అని ఎవరికి వారు ప్రశ్నించుకొని ఈ మానవజన్మను సార్ధకం చేసుకోవాలి.

**విలువలేని ఇనుపపెట్టె ఈ దేహంబు**
**పెట్టెలోన నగలు పెట్టినట్లు**
**దేహమందు ఆత్మదేవుడుండెను సుమీ**
**సత్యమైన బాట సాయి మాట.** 91

భగవాన్ బాబావారు ఈ దేహమును ఇనుపపెట్టెతో పోల్చారు. బంగారు నగలతో నిండివున్న ఇనుపపెట్టెకు విలువ ఎక్కువ. దానిలో పెట్టిన బంగారు నగలను తీసివేస్తే, ఆ ఖాళీ ఇనుపపెట్టె విలువ మహా

చేస్తే ఐదువేల రూపాయలు మాత్రమే. అదే విధముగా మృణ్మయమైన ఈ దేహంలో చిన్మయుడైన దేవుడు ఆత్మస్వరూపుడై ఉన్నాడు. "దేహము మృణ్మయమైనప్పటికినీ ఆత్మ చిన్మయము" అంటారు బాబా. ఈ చిన్మయతత్వాన్ని చక్కగా అర్థం చేసుకొనుటయే మానవుని ప్రధానమైన కర్తవ్యం. ఈ విలువైన దానిని గుర్తించినప్పుడే మన విలువను సరియైన రీతిలో గుర్తించిన వారమవుతాము. అయితే ఈనాడు మానవుడు తనయందున్న విలువైన తత్వాన్ని మరచిపోతున్నాడు. మాణిక్యం వంటి తన హృదయాన్ని మసిబొగ్గులకు అమ్ముకుంటున్నాడు. తన విలువను తాను గుర్తించుకోలేకపోతున్నాడని భగవాన్ బాబావారు తన ఆవేదనను వెలిబుచ్చారు.

మానవుని విలువ ఏమిటి? ఎవరైనా దురదృష్టవశాత్తు యాక్సిడెంట్ లో మరణిస్తే , అతని కుటుంబానికి మహాయిస్తే 5వేలో, పదివేలో యిస్తారు. 'ప్రాణం ఉంటే శివం ప్రాణం పోతే శవం' అన్నారు బాబా. విలువలేని ఇనుపపెట్టెలో అతి విలువైన వజ్రవైఢూర్యాలు, పొదిగిన బంగారునగలు పెట్టినప్పుడు ఆ ఇనుపపెట్టె విలువ పెరుగుతుంది. దొంగలు దోచుకొని పోకుండా అప్పుడు దానికి కట్టుదిట్టమైన రక్షణ కల్పించాలి. ఈ దేహమనే ఇనుపపెట్టెలో 'ఆత్మదేవుడు' అనే పెద్ద విలువైన నగ ఉండటం వలన ఈ మృణ్మయ శరీరమును విధిగా మనం సంరక్షించుకోవాలంటారు బాబా.

దేహము అనిత్యము, అశాశ్వతము. ఆత్మ సత్యము, శాశ్వతము. సత్యము, శాశ్వతము అయిన ఆత్మ. అనిత్యము అశాశ్వతమైన దేహమునందు యిమిడి ఉంటున్నది. దాని నిమిత్తమై మనము ఈ దేహమును కాపాడుకొనవలెను. దేహమును అలక్ష్యము చేయరాదు. ఎంతవరకు సత్యాన్ని గుర్తించేంత వరకు దేహమును పోషించాలి. సంరక్షించుకోవాలి. అంతేగాని దేహమే ప్రధానమని 'దేహి'ని మాత్రం విస్మరించరాదంటారు బాబా.

దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యునకు దట్టమైన మేఘములు అడ్డువస్తే సూర్యుడు కనిపించడు. అసలు సూర్యుడే లేడంటామా? మేఘములు అడ్డు రావటం వలన సూర్యుడు కనిపించటం లేదని చెబుతాం. మేఘములు అశాశ్వతములు. అవి కదలిపోయేవి. కదలిపోయిన తక్షణమే సూర్యుడు ప్రకాశిస్తాడు. అదే విధంగా అహంకార అభిమానములనే దట్టమైన మేఘములు చుట్టుకొనడం చేత ఆత్మతత్త్వమనేది అర్థం కావటం లేదు. ఆత్మదేవుడు కనిపించటం లేదు. అందువలన "దేవుడెక్కడంచు దేవులాడగనేల? దేవుడుండు తన దేహమందె" అన్నారు బాబా. కనుక దేవుని కోసం ఎక్కడో వెదకనవసరం లేదు. నీలోనే ఉన్నాడు. నీ దేహంలోనే ఆత్మస్వరూపుడై ఉన్నాడు. నీవే దేవుడివి. ఈ సత్యమును ప్రతి ఒక్కరూ గుర్తించాలి.

"ఈ దేహం జీవుని మందిరం. మందిరాన్ని శుభ్రపరచటంలో లక్ష్యమేమిటి? ఈ మందిరంలో ప్రతిష్ఠితుడైన దేవుని పవిత్ర భావంతో చూడాలి. లక్ష్యమునందు దైవత్వాన్ని ఉంచుకొనక, దేహానికి మాత్రమే మనం అనేక రకముల పెయింట్లు చేస్తుంటే ఏమి ప్రయోజనం? శవానికి అలంకరించినట్లుంటుంది. లోపల శివం ఉన్నది. శివాన్ని లక్ష్యంలో పెట్టుకోవాలి. అంతవరకే ఇది జీవితం. శవాన్ని లక్ష్యంలో పెట్టుకుంటే అది జీవితం కాదు. మన లక్ష్యం శవం కాదు శివం" అని అంటారు భగవాన్ బాబా.

**నదిని దాటువరకు నావ యవసరంబు**
**దివ్యపదము చేర దేహమట్లు**
**అవసరంబు గాన ఆరోగ్యమందుడీ**
**మలినమైన తిండి మానరయ్య.** 92

ఈ పద్యంలో భగవాన్ బాబావారు నదిని దాటుటకు నావ ఎంత అవసరమో, దివ్యపదమును చేరగోరే ధ్యానయోగికి దేహం అంత

అవసరమని చెబుతూ, అట్టి శరీరమును ఆరోగ్యంగా ఉండేట్లు చూచుకోవాలని, మలినమైన తిండిని మానివేసి శరీర ఆరోగ్యమును కాపాడుకోవాలని హెచ్చరించారు.

"శరీరమాద్యం ఖలు ధర్మసాధనం". ఏ పని చేయాలనినా శరీరం అవసరం కదా కనుక అట్టి శరీరము ఆరోగ్యవంతముగా ఉంటేనే కర్మలనాచరించగలుగుతాం. నదిని దాటటానికి రంధ్రములు లేని నావ ఎంత అవసరమో, జపధ్యానాదుల నాచరించడానికి ఆరోగ్యమైన శరీరం కూడా అంత అవసరమే. హితమైన ఆహారమును మితంగా తీసుకోవాలి. "అతి తిండి మతి హాని, మిత తిండి అతి హాయి "అన్నారు బాబా. "అతి సర్వత్ర వర్జయేత్" అని మన శాస్త్రములు చాటుచున్నాయి. కనుక సాత్వికమైన హితమైన ఆహారమును మితముగా తీసుకోవాలి.

మితాహార లక్షణములు ఈక్రింది శ్లోకములో చక్కగా వివరించబడినాయి.

*"ద్వౌభాగీపూరయేదన్నైః తోయేనైకం ప్రపూరయేత్*
*మారుస్య ప్రచారార్ధం చతుర్ధమవశేషయేత్"*

కడుపులోని సగభాగము అన్నాదుల చేతనూ, పాతిక భాగము నీటి చేతనింపి, తక్కిన పాతిక భాగమును గాలి ఆడుటకు ఖాళీగా ఉంచవలెనని దీని అర్ధము. ఈశరీరమనే యంత్రమునకు కొంత విశ్రాంతి కూడా యిస్తుండాలి. సాధకుడు ఆహారం విషయంలోను, నిద్ర విషయంలోను మితత్వము (Moderation) పాటించాలి. అతిగా తింటే నిద్ర వస్తుంది. నిద్ర తమోగుణ లక్షణం. తపస్సులో కూర్చొని తమస్సు లోనికి పోతాడు. కనుక సాధకుడు అధికాహారమును తీసుకోకూడదు. అసలు ఆహారమే తీసుకోకుండా ఉపవాసాలు చేయకూడదు. నిత్యమూ మితాహారము తీసుకుంటూ, వారానికొకసారి ఉపవాసంచేస్తూ, శరీరారోగ్య మును కాపాడుకుంటూ జపధ్యానాదులు చేస్తూ, ఆత్మ సాక్షాత్కారము (Self Realisation) ను పొందవలెను.

పశుపక్ష్యాదులు సహజంగా లభ్యమయ్యే ఆహారమును తీసుకుంటాయి. మానవుడు రుచికరమైన పదార్థములను ఆశిస్తాడు కాన వండుకొని తింటాడు. వాటిల్లో అనేక దోషాలు ఉండవచ్చును. కనుక మనం అన్నం తినే ముందు ఆహారమును భగవదర్పితం చేసి తినాలి. "బ్రహ్మార్పణం మరియు అహం వైశ్వానరో ........." శ్లోకములు ప్రార్థన చేసి తింటే భగవంతుడు మనం తినే ఆహారమును శుద్ధి చేస్తాడు. అట్లు శుద్ధి చేసిన ఆహారమును తింటే మన బుద్ధి పరిశుద్ధంగా ఉంటుంది. మన మనస్సు పవిత్రంగా, నిర్మలంగా ఉంటుంది. మనం ఆరోగ్యంగా ఉంటాం.శారీరక, మానసిక , ఆధ్యాత్మిక కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన గల్గుతాం. అప్పుడు మన జన్మ సార్థకమవుతుంది.

**ఇంటిలోన జ్యోతి వెలుగుచునుండగా**
**పరుల ఇంటికి అగ్గికై అరుగనేల**
**తాను దైవమయ్యు దైవంబు మరచుట**
**తనను తానె మరచినట్లు కాదె !** 93

*"ఇంటిలోనే నీకు కావలసినంత అగ్గి ఉండగా, అగ్నికై పరుల ఇంటికి ఎందుకు పోవాలి? అదే విధంగా దేవుడు నీ దేహమునందు ఉండగా, దేవుడు ఎక్కడ? ఎక్కడ? అని దేవులాడుట నిన్ను నీవు మరచినట్లే కదా!'* అని అంటారు బాబా.

భగవంతుడు లేని చోటు లేదు. భగవంతుడు సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడు, దేవుడనేవాడు స్వర్గంలోనో, వైకుంఠంలోనో మాత్రమే ఉండడు. ఎక్కడపడితే అక్కడనే ఉన్నాడు. ప్రతి జీవిలో ఉన్నాడు. ప్రతి చోటా ఉన్నాడు. "సర్వజీవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" గదా! ఏ జీవికి నమస్కరించినా భగవంతునికి నమస్కరించినట్లే అంటున్నారు గదా! కనుక ప్రతి జీవి భగవత్ స్వరూపమే. ఈ సత్యమును నీవు గుర్తించ నంత కాలం దేవుని కోసం బయటనే వెతుకుతావు. నీలో ఉన్నాడని

గుర్తించు. నిన్ను నీవు తెలుసుకో. ఎక్కడికీ పోనవసరం లేదంటారు బాబా.

"దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః" దేహమే దేవాలయం అది దైవం యొక్క మందిరం. కనుక దైవం కోసం ఎక్కడనో వెదకనవసరం లేదు. "దేవుడుండు తనదు దేహమందె" అని స్పష్టం చేశారు బాబా. దేవుడు నీలోనే ఉన్నాడని గుర్తించు. "ఏకాత్మా సర్వభూతాంతరాత్మ". ఒకే ఆత్మ సర్వ భూతములయందు అంతరాత్మగా ఉంటుంది. కనుక మనం అల్పజీవులుగా విశ్వసించరాదు. ఎన్నో జన్మల నుండి మార్పు చెందకుండా నీవు వస్తూనే ఉన్నావు. దీనికి ఏమాత్రమూ అంత్యము లేదు. దేహములు మారుచున్నాయేగాని ఆత్మతత్త్వమునకు అంత్యమే లేదంటూ బాబా వారు 'మానవ' అనే పదమునకు అర్థమును చక్కగా విపులీకరించారు. 'మా' అనగా కాదు. 'నవ' అనగా క్రొత్త. క్రొత్త వాడివి కాదు నీవు. పాతవాడివే. అంటే పాతది ఆత్మనే. రోతదే ఈ దేహం. రోతదైన ఈ దేహమును నీవు స్మరిస్తున్నావు. పాతదైన ఆత్మను విస్మరిస్తున్నావంటారు బాబా.

ఇంటిలోన జ్యోతిని మరచి, అగ్నికై పరుల ఇంటికి పరుగు లిడుచున్నాడు. తనను తాను మరచి దేవుడెక్కడంచు దేవులాడు చుండె ఇది ఈనాటి మానవుని స్థితి. దుస్థితి.

## దైవమే మిన్న

తల్లికన్న మిగుల దైవమే యెక్కువ
సన్నిహితుడు తండ్రి కన్న చాల
అట్టియాత్మ మరువ నంటును పాపంబు
ఉన్నమాట తెలుపుచున్నమాట 94

లోకంలో తల్లి, తండ్రి, గురువు దైవము - ఈ నలుగురూ పూజనీయులే. అందువలననే మాతృదేవోభవ! పితృదేవోభవ! అన్నారు. వీరు జన్మకు సంబంధించిన బంధువులు. వారితో సంబంధం ఈ దేహమున్నంత వరకే. వీరి బంధుత్వం ఈ దేహంతోనే అంతమవుతుంది. ఇకపోతే జ్ఞాన భిక్షను ప్రసాదించేవాడు గురువు. ఈ ముగ్గురిలో ఎవరైనా సరే దైవానికి విరుద్ధంగా ప్రవర్తిస్తే, అట్టి వారిని త్యజించటంలో ఏమాత్రం పొరపాటు లేదు. ఆధ్యాత్మిక సాధనకు అవరోధం కలిగించినవారు ఎంతటి ఆత్మీయులైనా, రక్త సంబంధీకులైనా త్యజించవలసిందే.

దైవానికి విరుద్ధంగా ప్రవర్తించినందులకు తల్లిని కూడా త్యజించాడు భరతుడు. తండ్రిని ధిక్కరించాడు ప్రహ్లాదుడు. గురువును ధిక్కరించాడు బలి చక్రవర్తి. సోదరుని త్యజించి బయటకు వచ్చాడు విభీషణుడు. ఎందుకోసం? స్వార్థ స్వప్రయోజనాల కోసం కాదు. దైవం కోసమే.

భగవంతుడు ఏ పని చేసినా ఉపకారమే కాని అపకారం కాదు. ఉదాహరణకు నీకు కడుపులో 'అపెండిసైటిస్' నొప్పి వచ్చింది. దానిని నివారించడానికి డాక్టర్ కత్తితో కోస్తాడు. అంతమాత్రమున డాక్టర్ నిర్దయుడా? కాదు....కాదు.... దయచేత ఆపరేషన్ చేస్తాడు. ఆపరేషన్ చేస్తే గాని ఆ నొప్పి పోదు. అనగా పుట్టిన నొప్పి పోవాలంటే, డాక్టరు పెట్టిన నొప్పి అనుభవించక తప్పదు. అదేవిధంగా మానవుడు కర్మ ఫలితాన్ని అనుభవించడానికి భగవంతుడు పెట్టే పరీక్షలు కొంతవరకు సహాయం చేస్తాయి. భగవంతుడు నిస్వార్థపరుడు. అతనికి స్వార్థమే తెలియదు. కాని భగవంతుడు ఏది చేసినా స్వార్థంతో చేస్తాడని కొందరు భావిస్తారు. అది వారి భ్రమ. భ్రమ పోతేగాని బ్రహ్మను గుర్తించడానికి వీలుకాదు. హృదయమనేది సింగిల్ ఛైర్, ఇది డబుల్ సోఫా కాదు. మ్యూజికల్ ఛైర్ అంతకన్నా కాదు. అందులో నుండి భ్రమను తొలిగిస్తే బ్రహ్మ కూర్చుంటాడంటారు బాబా.

# ఆత్మ

**కంటిగ్రుడ్డుకు కాటుక అంటనట్లు**
**జిడ్డు అంటక జిహ్వయు ఉండునట్లు**
**తామరాకును నీరు అంటనట్లు**
**దేనినంటక యుండునదియె ఆత్మ** 95

ఈ పద్యంలో భగవాన్ బాబావారు 'ఆత్మ' యొక్క ప్రత్యేకతను చక్కటి ఉపమానంతో పోల్చి చెప్పారు. స్త్రీలు కండ్లకు కాటుక పెట్టుకున్నప్పటికీ, ఆ కాటుక కంటిగ్రుడ్డుకు ఏ మాత్రం అంటనట్లు, జిడ్డు పదార్థములు తినినప్పటికీ, ఆ జిడ్డు నాలుకకు ఏమాత్రం అంటనట్లు, తామరాకుపై పడిన నీటి బిందువులు, ఆ తామరాకును అంటీఅంటకుండా ఉన్న విధంగా, ఆత్మ దేవుడు షోడశకళారూపమైన శరీరంలో నిర్లిప్తంగా ఉంటాడు. అట్టి ఆత్మ సర్వదా ప్రకాశిస్తూ ఉంటుంది. ఆత్మ నిత్యమైనది, సత్యమైనది, శాశ్వతమైనది. ఆత్మ పరమాత్మ స్వరూపం. ప్రపంచంలో సమస్త పదార్థముల కంటెను, అన్ని పదవుల కంటెను, ఆత్మస్థితియే సర్వోన్నతమైనది. అట్టి స్థితిని చేరిన వారిలో మాత్రమే ఆత్మజ్ఞానం అంకురించుతుంది. అట్టి ఆత్మ జ్ఞానం చిత్తశుద్ధి వలన, అట్టి చిత్తశుద్ధి నిష్కామకర్మ ద్వారా లభిస్తుంది. ఆత్మ జ్ఞానం లేనిచో మోక్షం చేకూరదు.

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అని గీత బోధిస్తున్నది. కర్మ చేయుటయందే అధికారం కలదు గాని, 'కర్మఫలము' ను ఆశించుట యందు ఎవరికీ అధికారం లేదు. అంటే ఎట్టి ప్రతి ఫలమునూ ఆశించకుండా, నిస్వార్థంగా కర్మలను ఆచరిస్తూ పోతుండాలి. 'నిష్కామ కర్మాచరణ' అనేది ప్రతి ఒక్కరి జీవితంలో భాగం కావాలి. అప్పుడే సమస్త దుఃఖములు నశిస్తాయి. ఆనందప్రాప్తి కలుగుతుంది.

'బుద్ధిః పర్యవతిష్ఠతి'. చిత్తము ఎప్పుడు నిర్మలమవుతుందో, అప్పుడు బుద్ధి, పరమాత్మ యందు స్థిరంగా నిలుస్తుంది. ఇంద్రియ నిగ్రహము వలననూ, నిష్కామ కర్మాచరణ వలననూ మనస్సు నిర్మలమవుతుంది. బుద్ధి శుద్ధముగా నున్నప్పుడు అనగా మనోనైర్మల్య స్థితి యందు ఆత్మ చింతన ఉదయిస్తుంది. వివేకోదయమవుతుంది. ఆత్మ చింతన వలన శాంతి నెలకొంటుంది. అట్టి శాంతిచే సుఖమేర్పడుతుంది. శాంత చిత్తమునందు మాత్రమే ఆత్మ 'దేదీప్య మానంగా' ప్రకాశిస్తుంటుంది. అట్టివారినే 'ఆత్మజ్ఞానులు' అని అంటారు. అట్టి ఆత్మజ్ఞానులు మాత్రమే 'తామరాకు మీద నీటి బొట్టు'లాగే ఉండగలుగుతారు. తామరాకు నీళ్ళమీదనే ఉంటుంది కానీ, అవే నీటిబొట్లు తామరాకుమీద పడితే, దానికి ఏమాత్రం అంటవు. తళతళలాడుతూ ముత్యముల వలె ప్రకాశిస్తూ, పాదరసంలాగా జారిపోతుంటాయి. అదేవిధముగా ఆత్మజ్ఞానులయిన వారు, భౌతిక సాంసారిక సుఖములలో మునిగినట్లుగా, పైకి కనిపిస్తున్నప్పటికీ, ఆ సుఖ దుఃఖములు వారిని ఏమాత్రం అంటవు, ముట్టవు, బాధించవు, వేధించవు. దానితోపాటు వారు పొంగరు, క్రుంగరు, సంతోషము నొందరు, కలత చెందరు. సమబుద్ధితో కర్మలనాచరించెదరు. అట్టి సమచిత్తము నందు మాత్రమే 'ఆత్మ' చక్కగా ప్రకాశిస్తుంది.

ఉదాహరణకు జనకమహారాజు, ధర్మవ్యాధులను చెప్పుకోవచ్చు. జనకుడు ఒక చెంప సమస్త రాజభోగములను అనుభవిస్తూ కూడా, తన కర్తవ్యకర్మల నాచరించడంలో ఏమాత్రం నిర్లక్ష్యం చేసేవాడు కాదు. బాధ్యతలను అంతకన్నా విస్మరించేవాడు కాదు. ప్రజాక్షేమమే ఆయన లక్ష్యం. ప్రజాసేవే ఆయన ధ్యేయం. ఆయన నాలుక మీద నిరంతరం భగవన్నామం నాట్యం చేస్తుండేది, చేతులు సమాజసేవ చేస్తుండేవి. అందువలననే ఆయనను 'రాజర్షి, నిష్కామకర్మయోగి' అని అన్నారు.

ధర్మవ్యాధుడు నిమ్నజాతులకు చెందినవాడైనప్పటికీ, వ్యాసుల వారు, అత్యున్నతమైన స్థానమును ఆయనకు యిచ్చి 'ధర్మవ్యాధోపాఖ్యానము' పేరిట మహాభారతంలో ఒక ప్రత్యేకతను కల్పించారు. ఒక చెంప తన జీవనోపాధి నిమిత్తమై, ఆయన మాంస విక్రయాన్ని, ధర్మబద్ధంగా నిర్వహిస్తూ, ప్రత్యక్షదైవములైన తల్లిదండ్రులను సేవిస్తూ, నిరంతరం భగవన్నామం చేస్తూ, ఆదర్శవంతమైన జీవితమును గడిపి తన జన్మను సార్థకం చేసుకొనినాడు 'ధర్మవ్యాధుడు'.

ఈ ఇరువురు మహానుభావులు తామరాకుపై నీటిబొట్టు చందమున వారి వారి జీవితాలను ధన్యం చేసుకొని ధర్మాత్ములుగా వెలుగొందారు.

## ఆత్మతత్త్వము

**చిత్తశుద్ధిలేని రిత్త సాధకులకు**
**ఆత్మతత్త్వమెట్లు అలవియగును?**
**ఆత్మతత్త్వమబ్బు అతి శుద్ధబుద్ధికే**
**సత్యమైన బాట సాయి మాట. 96**

సాధకులకు ముఖ్యంగా చిత్తశుద్ధి అత్యవసరం. చిత్తశుద్ధి లేకుండా చేసిన సాధనలన్నీ వ్యర్థములే అవుతాయి. "చిత్తస్య శుద్ధయే కర్మః" అన్నారు గదా! చిత్తశుద్ధికి పవిత్రమైన కర్మలు అత్యవసరం. పవిత్రమైన కర్మల నాచరించినప్పుడు మనస్సు నిర్మలంగా ఉంటుంది. మానవ ప్రవృత్తికి మూలమైన మనస్సు నిర్మలంగా ఉంటే మానవ శీలం ఉదాత్తంగా వెలుగొందుతుందంటారు బాబా. త్రికరణశుద్ధి మానవుని శీలానికి మూలం. మనోవాక్కాయ కర్మలను 'త్రికరణములు' అని అంటారు. మన మాటలకు, మన చేతలకు మూలము మన ఆలోచనలే

కదా! మన ఆలోచనలకు కేంద్ర బిందువు మన మనసు లేక మన చిత్తము. మన ఆలోచనలు పవిత్రంగా ఉంటే మంచినే మాట్లాడుతాం. మంచినే చేస్తాం. అసలు మంచి ఆలోచనలు నిర్మలమైన, నిశ్చలమైన పవిత్రమైన చిత్తమునందే ఉద్భవిస్తాయి. మంచి పవిత్రమైన కర్మల నాచరించినప్పుడే చిత్తము (మనసు) నిర్మలమవుతుంది. చిత్తము నిర్మలంగా లేకుండా ఎన్ని పూజలు చేసినా ప్రయోజనం లేదు. చిత్తము పవిత్రంగా ఉంచుకోకుండా ఎన్ని జపధ్యానాదులు ఆచరించినా ప్రయోజనం శూన్యం. ఎన్ని తీర్ధయాత్రలు చేసినా ఆశించిన ఫలితం రాదు. కనుక చిత్తశుద్ధిలేని జపతపాదుల వలన ప్రయోజనం ఉండదు. ఇదే వాస్తవాన్ని 'వేమన' కూడా ఏనాడో చెప్పాడు.

*"చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు*
*కొంచమైన నదియు గొదువకాదు*
*విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత*
*విశ్వదాభిరామ వినురవేమ."*

చిత్తశుద్ధితో చేసిన పని కొంచమైనా అది గొప్ప ఫలితాన్ని అందిస్తుంది. ఎట్లనగా మహావృక్షమైన మర్రి చెట్టు యొక్క విత్తనము చాలా చిన్నదే గదా!

ఒక్క పరిశుద్ధమైన మనస్సుకే ఆత్మతత్త్వము అర్థమవుతుంది. మలినమైన మనస్సుకు కాదు. ఆత్మతత్త్వమనగా తనను తాను తెలుసుకోవటమే. అయితే ఆ ఆత్మ ఎచట ఉన్నది? భగవంతుడు ఎచట ఉన్నాడు. తనయందే, తన హృదయము నందే. ఈ వాస్తవమును తెలుసుకుంటే దేవుని కోసం మనం ఎక్కడికో పరుగెత్తనవసరం లేదు. "దేవుడనగ వేరు దేశమందున లేడు, దేవుడుండు తనదు దేహమందె" భగవంతుడు లేని చోటు లేదు. సర్వాంతర్యామి. ప్రతి జీవిలో ఉన్నాడు. తనను తాను తెలుసుకుంటే చాలు. మనం చేసే సాధనలన్నీ తనను

తాను తెలుసుకునేందుకు ఉపయోగపడాలి. అప్పుడే "ఆత్మతత్త్వమబ్బు అతి శుద్ధ బుద్ధికే' అన్నారు భగవాన్ బాబావారు. ఇదే వాస్తవమును 'వేమన' కూడా చెప్పాడు.

*"ఆత్మ శుద్ధిలేని యాచారమదియేల?*
*భాండ శుద్ధిలేని పాకమేల?*
*చిత్తశుద్ధిలేని శివపూజలేలరా*
*విశ్వదాభిరామ వినురవేమ."*

## సర్వాత్మ దృష్టి

**సర్వవేదాంత గ్రంధాల సారమెల్ల**
**ఒక్క వాక్యాన చెప్పుదు వాక్యసారి**
**అఖిల భూతములందున్న ఆత్మ, నీవు**
**ఒక్కటేయని మనమున నుండవలయు.** 97

"పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనమ్" అష్టాదశ పురాణములు దీనినే బోధిస్తున్నాయి. 'సర్వజీవ సమభావమే ఉత్తమ ధర్మము' అని సర్వవేదాంత గ్రంధాల సారము. *"సర్వజీవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి", సర్వ జీవ తిరస్కారః కేశవం ప్రతి గచ్ఛతి".* ఏ జీవికి నమస్కరించినా కేశవుని (భగవంతుని)కే వర్తిస్తుంది. ఏ జీవిని తిరస్కరించినా, బాధించినా భగవంతుని బాధించినట్లే అవుతుందని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. కనుక "నిర్వైస్సర్వ భూతేషు" అని భగవద్గీత చాటుచున్నది. కనుక సమస్త ప్రాణుల యందు ద్వేషము లేకుండా ఉండవలెను. సమస్త ప్రాణులు భగవత్స్వరూపులు, నారాయణ స్వరూపులు. కనుక సర్వ భూతదయ కూడా పరమోత్కృష్టమైన ధర్మమని వేదాంత గ్రంధాలు బోధిస్తున్నాయి. "పరోపకార బుద్ధి 'మానవత్వ జ్యోతిని ప్రకాశింప చేస్తుంది." అంటారు బాబా.

హిందూ ధర్మంలో ఒక్క మనుజునికే గాక సమస్త చరాచర ప్రాణి కోటికి అత్యున్నతమైన, గౌరవప్రదమైన స్థానం యివ్వబడింది. భారతీయులకు సమస్త వస్తువులూ పూజనీయములే. రాయి మొదలు రత్నము వరకు, పచ్చిక మొదలగు పారిజాతము వరకు, చీమ మొదలు సింగము వరకు, కాకి మొదలు గరుత్మంతుని వరకు, మాల మొదలు మహర్షి వరకు సర్వమునూ భారతీయులకు దేవతా స్వరూపములే. కుక్కలను భైరవవాహనములనియు, పాములను నాగేంద్రులని, గుఱ్ఱములను హయగ్రీవములనియు, ఏనుగులను గజేంద్రులనియు, గ్రద్దలను గరుత్మంతులనియు, ఆవులను గోమాతలనియు, నదులను గంగామాతలనియు భావించి, పూజించి సమదృష్టితో ప్రేమించ గల దివ్యమతమే హిందూమతం. అదే హిందూ ధర్మ వైశిష్ట్యము. ముఖ్యముగా భగవద్గీతలో ఒకమెట్టు పైకి పోయి సర్వమానవ సౌభ్రాతృత్వం (Fraternity) తోనే సంతృప్తి చెందరాదని "సర్వాత్మదృష్టి" ని కూడా అలవరచుకోవాలని బోధించబడింది.

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవశ్వపాకేచ పణ్డితాః సమదర్శినః"

ఈ భగవద్గీత శ్లోకం అత్యున్నతమైన విశాల భావమును ప్రోత్సహిస్తున్నది. ఉత్తమ, మధ్యమ, అధమ తారతమ్యములు లేకుండా; ఉచ్ఛ, మధ్య, నీచ భావములకు తావివ్వకుండా సర్వభూతముల యందు సమభావము, సమదృష్టి కలిగి ఉండాలని బోధిస్తున్నది. ఒక్క మనదేశంలో తప్ప ప్రపంచంలో మరెక్కడా, యింతకన్నా మించిన సాంఘిక న్యాయం కనిపించకపోవచ్చు. ఇటువంటి అత్యున్నతమైన తత్త్వజ్ఞానం (Philosophy) కూడా మరెచ్చటా లేదేమో! అదే హిందూ ధర్మ ప్రత్యేకత.

చీమలో, సింగములో, గోవులో, గజములో, కుక్కలో, కుక్క మాంసం తినే చండాలునిలో అంతేకాదు సర్వవేదాంత గ్రంధసారములను సమగ్రంగా ఆకళింపు చేసుకొనిన మహాపండితునిలో ఉన్నది ఒకే ఆత్మ

అనేటటువంటి సమదృష్టి కలవారే అనగా అందరినీ సమభావంతో చూచేవారే "జ్ఞానులు, పండితులు" అని భగవద్గీత బోధిస్తున్నది. "పండితాః సమదర్శినః" సమదర్శినం చేయగలిగినటువంటివాడు పండితుడు. అటువంటి విశాలమైన సమత్వభావం ప్రతి మనుజుని మనస్సులో ఉండాలని భగవాన్ బాబావారు ఆకాంక్షిస్తున్నారు.

## ఆత్మ జ్ఞాని

**నీటియందు పడవ నిలచియుండుట మేలు**
**నీరు పడవయందు నిలచకీడు**
**జగములోన నిలిచి జనులుండుటయే మేలు**
**జగము మదిని నిలువ జనము చెడును. 98**

నీటిలో పడవ ఉండినప్పటికీ, ఆ పడవ నీటిలో మునగకుండా ఏ విధంగా నిలిచిఉంటుందో, అదే విధంగా మానవుడు లోకములో ఉండినప్పటికీ, లోక వ్యవహారములో మునిగిపోకుండా, సమబుద్ధితో కర్తవ్య కర్మలనాచరిస్తూ జీవితమును సార్ధకం చేసుకోవాలి. ఓటిపడవలోనికి నీరు ప్రవేశిస్తే, అది ఏవిధంగా దరికి చేరలేదో, అదే విధంగా సంసార సాగరంలో మునిగిపోయిన మనిషి గతి కూడా అంతే.

ఒక్క 'ఆత్మజ్ఞానులు' మాత్రమే తామరాకు మీద నీటిబొట్టు లాగే ఉండగలుగుతారు. నీటియందు పడవ నిలిచి ఉండికూడా, ఏవిధంగా నీటిలో మునగకుండా తేలుతూ ఉంటుందో అదే విధంగా తామరాకు నీటిమీద ఉంటుంది కాని, అవే నీటిబొట్లు తామరాకు మీదపడితే, దానికి ఏమాత్రం అంటవు. అదేవిధముగా ఆత్మజ్ఞానులైనవారు సంసార సాగరంలో మునిగినట్టుగా పైకి కనిపిస్తున్నప్పటికీ, ఆ సుఖదుఃఖములు వారిని ఏమాత్రం అంటవు, ముట్టవు, బాధించవు, వేధించవు. ఉదాహరణకు జనకమహారాజు, ధర్మవ్యాధులను చెప్పుకోవచ్చును.

నీటిలో పడవ ఉండవచ్చును కాని, పడవలో మాత్రం నీరు చేరితే ప్రమాదం. అదే విధంగా లోకంలో ఉండవచ్చును గాని లోక వ్యవహారములలో మాత్రం మునిగిపోరాదు.

## మోక్షము

**ముక్తియనగ వేరాకసమునను లేదు**
**చిత్తవృత్తులడంచి నిశ్చింతనుండు**
**స్థితియె మోక్షము దాన నశించు మాయ**
**ఆత్మయేయగు సర్వమన్యంబు గాదు 99**

మోక్షమంటే మనకు కనిపించకుండా ఎక్కడో ఆకాశంలో ఉండేదని చాలామంది భావిస్తుంటారు. దానిని సాధించుటకు ఘోరమైన తపస్సు చేయాలని చెబుతుంటారు. 'తపస్సు' అనగానే చాలామందిలో ఒక భయం కూడా ఉన్నది. అన్నాహారములను వర్జించి, ఆకులలములను భక్షించుచూ, ఎండనక, వాననక, కాకులు దూరని కారడవులలో తలక్రింద బెట్టి, కాళ్ళు పైకి పెట్టి సంవత్సరముల తరబడి శరీరమును కృశింపజేస్తే గాని 'మోక్షము' సిద్ధించదని చాలామంది భావిస్తుంటారు. ఇది కాదు. 'మోహక్షయమే మోక్షము' అన్నారు బాబా.

*"అజ్ఞాన, అహంకార, రాగవాసనల నాశనమే జీవికి మోక్షప్రాప్తి"* అన్నారు బాబా. అది ఒక్క సేవ ద్వారానే సాధ్యమవుతుంది. సేవ హృదయమును బహిరంగపరుస్తుంది. అహంకారమును పారద్రోలుతుంది. చైతన్యమును వికసింపజేస్తుంది. పవిత్రభావములకు హృదయము నిలయమవుతుంది. దైవీగుణములైన దయ, ప్రేమ, కరుణలు సంప్రాప్త మవుతాయి. అందువలననే *"దయ గల హృదయమే దైవ మందిరం"* అన్నారు బాబా. అట్టి దైవీగుణములకు నిలయమైనప్పుడు అజ్ఞానం పటాపంచలైపోతుంది. అహంకారం దూరమైపోతుంది. రాగవాసనలు

మటుమాయమవుతాయి. అప్పుడు మానవునికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. మోక్షానికి అర్హుడవుతాడు. కనుక ప్రతి ఒక్కరూ మానవసేవకు అంకితం కావాలి.

చిత్తవృత్తులకు లోబడి ఉండటమే మాయ. దానిని జయించుటే మోక్షము. అయితే మాయ ఆత్మను నీడవలె వెంటాడుతూ, చిత్తవృత్తులను విజృంభింపచేస్తూ, ఆత్మను కనుమరుగుచేస్తుంది. అందుచేత మాయ ప్రభావాన్ని అధిగమించి ఐహికబంధాల నుండి విముక్తి పొందుటకు సాధన అత్యవసరం. ఏ క్షణాన్నయినా మాయ మన కళ్ళు కప్పగలదు. కనుక తుది శ్వాసవరకు మనో చాంచల్యం కలుగకుండా దైవచింతనలోనే నిమగ్నమై ఉండాలి.

అసలు అహంకార మమకారములే మాయ. ప్రతిదానికీ 'నేను... నేను' అని విర్రవీగటం అహంకారం. అయితే, ప్రతిదీ 'నాది...నాది' అని భావించటం మమకారమవుతుంది. 'నేను, నాది' అనే అహంకార మమ కారములను పెంచుకోవటమే 'మాయ'. ఈ మాయ వైదొలగితే మోహం నశిస్తుంది, మోక్షం ప్రాప్తిస్తుంది.

## ఆచరణ

**చెప్పుట సులభంబు చేయుట కష్టంబు**
**ధాతకైన వాని తాతకైన**
**చెప్పుట కంటెను చేయుటయే మేలు**
**ఉన్నమాట తెల్పుచున్నమాట** 100

అన్నారు బాబా. బాబావారు ఆచరణకు ప్రాధాన్యతనిస్తారు. బోధించడం కాదు, ఆచరించాలి. 'చెప్పవచ్చు కోటి, చేయరు ఒక్కటి' అంటూ బాబా తన ఆవేదనను వెలిబుచ్చారు. భగవద్గీత, సుందరకాండ లాంటి పవిత్ర

గ్రంధాలు నిత్యమూ పారాయణ చేస్తే మోక్షం ప్రాప్తిస్తుందని చాలామంది భావిస్తుంటారు. దీనిని బాబా అంగీకరించరు. కనీసం ఒక్క శ్లోకమునయినా బాగా అర్థం చేసుకొని ఆచరణలో పెట్టాలని బాబా అభిప్రాయం. అది చేయకుండా రోకంటి పాటలా కేవలం పారాయణచేస్తే ప్రయోజనం ఉండదు. ఆచరించినప్పుడే అర్హతను సంపాదించుతాం. అర్హత గలవానికే భగవదనుగ్రహం లభిస్తుందంటారు బాబా. మాటలు కన్నా చేతలు ముఖ్యం. చెప్పటం తేలిక, చేయటం కష్టం. ఆచరణ లేని వేదాంతం 'గ్రామ్ ఫోన్ రికార్డు 'లాంటిదే అవుతుంది. చైతన్యం గల మనిషి చేయవలసింది ఆచరణ. ధర్మపన్నాలూ వల్లెవేస్తే ప్రయోజనంలేదు. ధర్మాన్ని ఆచరించాలి. అనుభవించాలి, ఆస్వాదించాలి, ఆనందాన్ని పొందాలి. కనుక ప్రతి ఒక్కరూ బాబాను ఆదర్శంగా గైకొనాలి. ఒక పర్యాయం బొంబాయిలో జరిగిన పత్రికాగోష్టిలో ఒక విలేఖరి "స్వామీ! తమ సందేశం ఏదైనా ఇవ్వండి "అని బాబాని అడిగారుట. అప్పుడు స్వామి నవ్వి "వేరే సందేశం ఎందుకు? *My life is my Message*" అన్నారుట. స్వామి ఆచరణ ద్వారా ఇతరులకు బోధిస్తుంటారు. బోధించింది ఆచరణలో పెడతారు. ఆచరణలో పెట్టిందే బోధిస్తారు. అదే వారి ప్రత్యేకత. కనుక బాబా వారిని అనుసరించి, వారి బోధలను ఆచరణలో పెట్టి మన జీవితాలను సార్థకం చేసుకుందాం.

